# భారతి

మాసపత్రిక

*

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

(1938-1972)

*

జనవరి 1977



సంపుటము : 54 సంచిక : 1

విడిపత్రిక వెల రూపాయిన్నర



కీ. శే. శివలెంక శంభుప్రసాద్‌గారు

సంపాదకుడు 1938-72

# స్వవిషయం

1977 నుంచి "భారతి" పేజీల సంఖ్య పెంచటానికి ప్రయత్నిస్తున్నాము నేటి ధరలని దృష్టిలో ఉంచుకున్నట్లయితే ఇది ఎంత కష్టంతో కూడిన పనో అర్థంకాక తప్పదు "భారతి" వంటి సాహిత్య పత్రికలో ప్రకటనలకి ఎక్కువ అవకాశం ఉండదు. అమ్మకం కూడా తక్కిన రకాల పత్రికల అమ్మకాల కన్నా తక్కువగానే ఉంటుంది. ఈ ఇబ్బందులు ఇప్పటివి కావు కాని దేశంలో పరిస్థితులు ఎంతో వేగంగా మారిపోతున్నాయి. తెలుగు సాహిత్యాభివృద్ధిని కోరే వారి ఆదరాభిమానాలు లేకపోయినట్లయితే "భారతి" నిర్వహణ వీలు కానేకాదు. చదివేవారి ఆదరాభిమానాలు మాత్రం చాలవు; రాసేవారు కూడా "భారతి" అభివృద్ధికి తోడ్పడాలి. కొంతకాలంగా "భారతి" కి కవిత్వం రాసిపంపే వారి సంఖ్య బాగా పెరుగుతున్నట్లు తోస్తుంది. కొన్ని నెలలుగా "భారతి" లో 'కవితల' సంఖ్య పెరగటం పాఠకులు గమనించే ఉంటారు. కథలు, నాటకాలు చాలా తక్కువగా వస్తున్నాయి. రచయితలు, రచయిత్రులు తమ చుట్టూ ఉన్న ప్రపంచంలోనివి ఎన్నిటిని గురించో రాయగలిగినంత రాసి పంపటంలేదని అనిపిస్తోంది. నేటి పరిస్థితులలో ఇది అంత తేలికగా చెయ్యగలిగిన పని కాదని అనిపించవచ్చు కాని ఉన్న పరిమితులలోనే మరి కొంత కృషి చెయ్యటానికి అవకాశాలు లేకపోలేదు. "భారతి" చందాదారులకి ఒక కొత్త సౌకర్యం కల్పించటానికి ప్రయత్నిస్తున్నాము. సంవత్సరం చందా ఒకేసారి కట్టే వారికి చక్కటి 'కన్సెషన్' ఇస్తున్నాము. "భారతి" స్థాపించి ఏభయిరెండేళ్ళు దాటుతున్నాయి. ఇంతకాలమూ ఈ పత్రిక తెలుగువారి సంస్కృతికి ఒక ప్రతిబింబంగా ఉండటానికి ప్రయత్నిస్తూనే వచ్చింది. ఈ ప్రయత్నంలో "భారతి" కి తెలుగు సాహిత్యాభిమానుల అండదండలు లభించాయి. ఇక ముందు కూడా వారి ఆదరాభిమానాలు ఉండగలవనే ఆశిస్తున్నాము.

# విషయానుక్రమణిక

## జనవరి 1977





# అచ్యుత విలాప యోగము

## శ్రీ సురభి మనోహరరావు

ఓ సృష్టికర్తా !
    నీవు విచారించావోకప్పుడు,
పూజాదికాలుండరాదని భృగువు శపించినప్పుడు!
బతికిపోయావు!
ఆ శాపమే నీ పాలిటి వరమయిందిప్పుడు!
నిత్య పూజలందుకొనే నా అవస్థలు చూడు,
నీకు దప్ప, వేరెవరికి చెప్పుకోను నా గోడు.

* * *

ఈ పాషండుల హృదయ పాషాణాల మధ్య,
కఠిన శిలా నిర్మితాలయిన గర్భాలయాల గోడల నడుమ,
ఊపిరి సలుపని ఊదు వత్తుల పొగల్లో
మకిలి పట్టిన విద్యుద్దీపాల అఖండ జ్యోతుల ముందు,
కర్పూరంగా చెలామణీ అవుతూన్న
కంపు పుండల హారతుల వాసనల్లో;
చదవటాని కోపిక లేక వేసిన మంత్రాల రికార్డుల రొద,
కర్ణాభరణాల పేర బిగించిన కర్ణ బంధనాల్ని చీల్చుకొని,
శాయశక్తులా శిరో వేదన సృష్టిస్తూండగా,
అక్రమార్జనాపరులు, వాకిచ్చిన సక్రమమైన వాటాగా,
నా కంఠాన బిగించిన రత్నహారాల ఉరిత్రాళ్లతో-
మణి మకుటాలనే ముళ్ళ కిరీటాల్ని మోయలేక మోస్తూ;
చేయని నేరానికి, కటకటాలకావల కాలక్షేపం చేస్తున్నాను.

* * *

బలవంతంగా అంటగడతారు భాగస్వామ్యపు బంధం,
బ్లాక్మార్కెట్ వ్యాపారాల్లో-స్మగుల్డ్ గూడ్స్ సరఫరాల్లో;
సాటి వాడికి లాభం సంపూర్ణానుస్వారం చూపినా-
లెక్కకన్నా కొంత ఎక్కువే వేస్తారు నా హుండీలో.
"ఆమ్యామ్యా" గిట్టదన్న అక్కసుతో కాబోలు,
అడ్డమైన లెక్కలూ అడుగుతారు-ఆదాయప్పన్నధికార్లు.
"రూల్ ఫర"లన్నది ఎవరి పట్ల ఏట్లున్నా-
నా పట్ల మాత్రం అక్షరాలా అమలవుతున్నది.
పాపం! ధర్మకర్తలకూ, ట్రస్టీలకూమాత్రం-
స్వ పర భేదాలన్నవి ససేమిరా-లేవు;
నావీ-వారివీ-కలిపే కడతారు-
(అఫ్ కోర్స్! నా డబ్బులోంచే)
ప్రాపర్టీ, ట్యాక్సులూ-పవర్ బిల్లులూ
పెట్రోల్ ఖర్చులూ – పేపర్ చందాలూ,
అనుకొంటుంటారు కొందరు-అబద్ధమో-నిజమోగాని;
అర్చనా ద్రవ్యాలు అర్థభాగం వారికే అర్పితాలనీ;
నా ఆస్తి పెట్టే పిల్లలు, వారింటి పిల్లలకే పనీ!
డబ్బివ్వని వారికి నా దర్శనమే కానీయరు,
నైవేద్యం సమర్పించి, ప్రసాదాన్ని అమ్ముతారు.

* * *

విశ్వామిత్రుడు ఒకడే నీ కప్పటి ప్రత్యర్థి;
స్వార్థం కాదది; ఆతడప్పుడు త్రిశంకు కార్యార్థి;
ఇపుడో! ప్రతివాడూ నీ సృష్టికి ఛిద్రాన్వేషి;
నీలో దోషం వెదుకుట కొక్కని కొక్కడు పోటీ!
ప్రకృతినే గెలిచామని ప్రగల్భాలు కొడుతూనే.
భీభత్సాలకు మాత్రం మూలం నేనేనంటూ;
మంచైతే, వారి ఘనత, కీడైతే నా తప్పని,
నిస్సంకోచంగా నిందని నా నెత్తిని రుద్దుతారు.
"చాతుర్వర్ణ్యం మయా సృష్టం"అని గొప్పపోయాన్నేను,
అయిదో వర్ణం సృజించి "అస్పృశ్యు"లంటున్నారు వీళ్లు
(ఈ మాట గాధేయుని చెవి సోకకుండా చూడు!
సోకిందో! అరుంధతిని అంటరాని దంటాడు!)

* * *

కమ్యూనిస్టు పరిభాషలో కేపిటలిస్టునేను!
ఇంగితాన్ని చెరుస్తూన్న గొంగటి పురుగౌతాను;
ప్రగతిమార్గ పథికుల ముం-గాళ్లకు సంకెలను నేను;

బూజు పట్టినట్టి పాత భావాలను కాపాడె
స్వార్థ పిశాచీ రూపపు బూర్జువాను నేను;
ఇక కేపిటలిస్టుల దృష్టిలో నా డ్యూటీల లిస్టు!
కొండవీటి చాంతాడుకు కొన్నిరెట్లు అధికం:
ఇన్‌కమ్ ట్యాక్సెగవేసే ఫిక్టిషియస్ పార్ట్‌నర్ని;
కాసు కాశపడి పాపం కడిగివేయగల బంటుని
ఇంతెందుకు!
చెప్పిన ప్రతి వెధవ పనీ చేసే –
సిన్సియర్ సర్వెంటుని!

*  *  *

ఇంతకు ఏడ్చినవన్నీ- ఏహో మచ్చుకు కొన్ని!

ఇక నాకోపిక లేదు– నా కిట స్వాతంత్ర్యం లేదు;
ఈ కల్పాంతం వరకూ ఇంకా ఎన గచాటో!
వద్దు వద్దు పద్మభవా! పగతురకూ ఈ పాట్లు,
నీ యిష్టం నా పోస్టుని ఏబాలిషే చేస్తావో,
కాకుంటే ఇంకెవ్వరినైనా నియమిస్తావో!
అదనపు బాధ్యతగా నీవే ఈ పని చూస్తావో–
నీయిష్టం—నీయిష్టం—నా కొద్దీ దైవత్యం!
—అదుగో! వస్తున్నాడు! అపర యముడు పూజారి!
దోర వయసు ఇల్లాండ్రను ఓరగంటితో చూస్తూ!
మన మాటలు విన్నాడా— మన్నే ఇక నా నోట్లో
వెళ్తానిక! ఎప్పటిలా పడివుంటూ నా కొట్లో.

# ప్రియ యామిని

శ్రీ మేకా మన్మదరావు

చిగురాకు పత్రాలపై
మిణుగురుల వెలుగు జిలుగుల
అక్షరాలతో
నాకై నీవు వ్రాసిన ప్రేమలేఖలతో
నా తోటంతా నింపుతావు!
నిశ్శబ్దాల తియ్యని గొంతులతో
ఆ లేఖలనే వల్లివేసే పూల పెదవులు
నా ఏకాంతాన్ని
పరిమళాల నిలయంగా మలచుతాయి!!
ఆకాశం పందిరి మంచానికి
చుక్కల పూల మాలలను
చక్కగా వ్రేలాడదీసి,
వెన్నెల చందనం మేనంతా అలది,
చంద్రుడిని తలగడగా వేసి
నన్ను పరుండ బెడతావు!
పెగలు తప్పు సాగసెరుగని
పగలును పరిచారికగా
గది బయటను నిలుపుతావు!
నిదురించే నా నీలికన్నుల నీడలలో
కవితల పురివిప్పి నాట్యం చేయమని
కలల నెమిళ్ళకు కబురును చేస్తావు!
ఊహల రమణీయతకు
ఊపిరిని పోస్తావు!!
ప్రియయామిని!
రెప్పవేయక రేయంతా
నన్నే నింపుకోవడంలో విరుపెక్కే
నీ ఆ రెండు కళ్ళూ–
ఈ జగత్తు సర్గానికి
చైత్రమూ, చైతన్యమూ కలిగించే
రెండు సంధ్యలు!

# శ్రీ జి. ఆర్. వర్మ

కనుకట్టు, గారడీ, మంత్ర, తంత్ర సర్వోపాయాలూ జన సామాన్యాన్ని నమ్మించడానికి మతాచార్యులూ, పూజార్లూ ప్రయోగించడం బహు పురాతన కాలాన్నే విశ్వవ్యాప్తంగా ఉంది. ఆచార్యులూ వారి ఆగ్రహానుగ్రహాలూ పురాతన గాథలే – రాజానుగ్రహం, రాజగురు – పురోహిత పదవికి వార్నోవారి కక్షలూ, కార్పణ్యాల కథలు మన పురాణాల్లో ఉన్నవే. అపౌరుషేయాలనాడూ; రాజుల శాసనాలనాడూ రచయితలు కవులే. సూర్యుడుకూడా చూడలేనివి వారు చూడగలరనడం కవుల భావనాశక్తి కావచ్చును. కాని కవి మహిమా గాధలు పురాతన మనిపించవు. రక్తపు పోటు రోగులవలె మేధావులూ ముక్కోపులే-వెంటనే కరుణించుట. సాహిత్య పోషకులు పూర్వం రాజులూ ధనవంతులూను. రానురాను కవితాపోషకులు తమ వంశాన్నీ, ప్రీతి పాత్రుల్నీ భోగపత్నుల్నీ కీర్తింపజేయ దిగజారిననాడు పుట్టిందేమో చాటువుల్లో తిట్టుకవిత–ఖబడ్దార్ కవిత్వం. రొయ్యకులేవా బారెడు మీసాలు నాటి కవితకు పెద్దక్క ఖబడ్దార్ కవిత్వము.

దక్షారామ భీమేశ్వరాలయ తంబళి బ్రతికుండగా దేవుడు సంతానమీయలేదట – ఆ కోర్కె వితంతువు ప్రార్థనలో విన్నాడట. భీమేశ్వరుని వరప్రసాదుడామె కొడుకు వేములవాడ భీమకవి. అతడమోఘ వాక్సిద్ధి గలవాడు – ఏమంటే అది తథాస్తు అయ్యేదట. వితంతువు – కొడుకు సాటి బ్రాహ్మణులంతా వెలివేస్తే వాళ్లను భలేగా ఏడ్పించాడట కవి.

వేంగీరాజ్యంలో ఆనాడు కవిపోషకులు లేనట్లుగా పొరుగు రాజ్యంవెళ్లి కలింగ రాజ దర్శనం కోరగా ఏదో 'సందడి' లోనున్న ఆరాజు ఇది సమయం కాదన్నాడట. దాన్నవమానంగా భావించి భీమ కవి కోపంతో '...ముప్పది దినంబులావలన్ జామున కర్థమందతని సంపద శత్రువుల జేరుగావుతన్' ముహూర్తంకూడా పెట్టేశాడు. రాజ్యభ్రష్టుడైన కళింగరాజుచే పూలమ్మినచోట కట్టెలమ్మించలేక అన్నట్లుగా వేంగిలో తిరిపెమెత్తించాడు కవి. కను చీకటిలో కాలు జారి గోతిలో పడ్డాట్టరాజు – సరిగ్గా భీమకవి ఉన్నచోటనే. ఏవరు నీవంటే 'భీమకవి చేసిన జోగి' నన్నాట్ట. తన అమోఘ వాక్సిద్ధికి తానే సంబరపడి, రాజు దీనావస్థ చూచిన కవి కరుణించి మరో ముహూర్తం పెట్టాడు– 'వేయి గజంబులుండ పదివేల తురంగములుండ నాజిలో రాయలగెల్చి సజ్జనగరంబున బట్టము కట్టుకో ... బోయిన మీనమాసమున బున్నమి పోయిన షష్ఠినాటికిన్' అనడంలో స్టాటిస్టిక్స్ ఇవ్వడమేకాదు–భీమకవి గొప్ప జ్యోతిష్కుడనిపించును.

కళింగ చోడగంగ సింహాసనమెక్కినది శకవర్ష 999, కుంభ మాసం, శనివారం శుక్ల తృతీయనాడు స్థలం అతని రాజధాని (త్రి)కళింగావని నగరి (ముఖలింగ–నగరి కటక, శ్రీకాకుళంజిల్లా)

పద్యంలో రాయలు మనకు దొరకడు. కళింగరాజు–రాజకళింగ గంగు అనే పేరిట వాడు అనంతవర్మ చోడగంగదేవ (క్రీ.శ.1078–1150) అని నిర్ణయించారు. కవి యుద్ధం చేయమన్నాడు. కాని కళింగ గంగు రాజూ వెడలెనూ సభకూ వతుగా శత్రురాజ సభ ప్రవేశించి, కళింగగంగు పాత్ర అభినయిస్తూ ఆనందిస్తున్న శత్రురాజును చంపేసాట్ట.

సాహిత్య సముద్ర మంథనంలో వేములవాడ భీమకవిగార్ని సంశోధనచేసారు. అసలు పద్యంలో ఉన్న 'తెలుంగాధీశ' తీసివేసి ఏవరో 'కళింగాధీశ' చేర్చారన్నారు. త్రికళింగాధిపతి చోడగంగు రాజధాని చిత్రకూటమన్నారు. ఇతడు వేంగీశ్వరుని పై తిరుగుబాటుచేసి యుండునన్నారు. వేంగిలో త్రికళింగాధిపతి బిరుదాంచితుడు కోన పోతరాజులు ఇతడ్ని ఓడించియుండునన్నారు. సాహిత్య సంశోధనలో నాటి చాళుక్య–చోళ సామ్రాట్ కులోత్తుంగ చోళదేవ (క్రీ.శ.1070–1118) వేంగీరాజు ప్రతినిధుల్లో ఏవరినీ నమ్మలేక త్వరత్వరగా వారిని మార్చివేసేవాడన్నారు. భీమకవి క్రీ. శ. 12 వ శతాబ్దం ప్రథమ పాదం వాడన్నారు. భీమకవివన్న చాటుపద్యాలుతప్ప అతని గ్రంథాలేవీ లభ్యంకాలేదన్నారు. "కవి జనాశ్రయ" లక్షణ గ్రంధ కర్త అన్నారు. ఇతడే డబ్బుకోసం రేచన అనే కోమటి పేరిట వ్రాసెనన్నారు. తన గ్రంథానికి ధోకా లేకుండా నన్నయగారి లక్షణగ్రంథం గోదావరిలో కలిపేసాడన్నారు. భీమకవి వ్రాసిన "రాఘవ పాండవీయ" ద్వ్యర్థికావ్యంకూడా అలభ్యం అన్నారు.

చాటుపద్యాలు చదివి ఆనందించదగినవే–సాహిత్య సంశోధనకు హేతువాదం, చరిత్ర పరిశోధనా, సత్యాన్వేషణా జోడిస్తే సారస్యం చెంబుతాడు తెగుతుంది.

పురుష సంపర్కం లేనిదే స్త్రీ సంతానవతి కాలేదనే సత్యం తెలియకగాదు. వ్యక్తుల మహిమ పెరగడానికా అన్నట్లు సద్యో గర్భాలు, సద్యోజాతులు, పరస్పర వీక్షణాల్లో సంతానప్రాప్తి దేవుని వరం, కన్యాసంతానం అయోనిజులు కథలు అనేకుల పవిత్ర గాథల్లో ఉన్నాయి. ధనదపుర (చందవోలు) శివాలయాని కంకితమైన సాక్కమ్మను హేశ్వరి (దేవదాసీ). శివానుగ్రహించే ఆమె కన్న సంతానం కొడుకు లిద్దరూ ఆయుధోపజీవులు, కూతురు కామసేవి

వెలనాటి ఇమ్మడి గోంకరాజు భోగపత్ని – ఈ కథ క్రీ. శ. 12వ శతాబ్దానిదే.

కవులచుట్టూ కథలు ముసురుకోడం చిరకాలాన్నుండీ ఉన్నదే—నాటి జానపద గాథల సేకరించి వాల్మీకి "రామాయణం" వ్రాసుండును. శ్రీరామభక్తుడు ఆంజనేయుడు "మహానాటక – హనుమన్నాటకం" వ్రాయగా (చెక్కగా) దాన్ని వాల్మీకి సముద్రంలో పారవేయించాట్ట.

మాజీ సంస్థానాధిపతులుగూర్చిన వార్తలు చదువుతున్నాము. అలాంటి పనులేవో చెయక తిరిపెమెత్తాడు రాజు కళింగగంగు. వేయి ఏనుగులు, పదివేల గుర్రాలున్న రాజు కళింగ గంగుచే తిరిపెమెత్తించుట 'రవిగానని...కవిగాంచున్' ఉన్న సైనిక బలంతో రాయల గెల్వమన్నాడు కవి. కాని కళింగగంగు యుద్ధంచేయకుండా వేషగానిలా వెళ్ళి సభలో శత్రువును చంపేశాడు. ఇలాంటి కథేదో చంద్రగుప్త మౌర్యునిగూర్చి ఉందని జ్ఞాపకం. నెల్లూరు గోనుగుంట బలిజవారి గాథల్లో మరోపోలిక. బలిజవీరులు క్షురకర్మ కాములుగా చేరి భల్లాణుని తలతీసివేసారట. రాజసభ అంటే ద్వార పాలకులు, అంగరక్షకులు, సామంతులు సైనికులుంటారే—వారందరూ తమరాజు హత్యకావడం చూస్తూ ఊరుకొన్నారేమో !

"కవి జనాశ్రయ" కర్త వాదీంద్ర చూడామణి (జైనాచార్య) శిష్యుడూ, చోళవాడి (మహబూబునగర్ జిల్లా పానగల్లు రాజధాని) రాజు ఇమ్మడి గోకర్ణదేవ (క్రీ. శ. 1120–50) అనే పరిశోధకాభిప్రాయ మొకటున్నది.

భీమకవిని ప్రప్రథమంగా పేర్కొన్నది రాజభోగి శ్రీనాథుడు. ఆనితల్లి రాజ్యాన్ని భర్త ఏలుచుండగా అతని సోదరుడు మంత్రి – రాజమండ్రి రెడ్డిరాజు నాశ్రయింపవచ్చిన శ్రీనాథుడు. 'వచియింతు వేములవాడ భీమనభంగి ఉద్దండలీల' అన్నాడు. సమీపకాల, సమకాలిక విషయాలకు శ్రీనాథుని గ్రంథాలు దర్పణం. కాబట్టి భీమకవి ఉనికి 'బంకం' అనలేము.

పద్యతో పనులు సాధించగల అమోఘవాక్శుద్ధిగల కవులు రాజాశ్రయం కోరడం ఎందుకో? పద్యంతో తాడిచెట్లు నేలగూల్చడం, చెట్లముళ్ళు రాల్చడం, చెలువు నీరింకించడం, ఒకణ్ణి చంపడం, వేరొకణ్ణి పదవీభ్రష్టుణ్ణిచేసి తిరిగి రాజ్యం ఇప్పించగల కవులు మోళీకట్టినా డబ్బువస్తుంది. నేడున్న కవిజనాశ్రయాలు సినిమాలు, రేడియో, పత్రికలు, పబ్లిషర్స్, సాంస్కృతిక శాఖలు అప్పుడు లేవు. నాడు రాజపోషణ ఒకటే కవి గొప్పతనానికి గీటురాయిగా ఉండేదేమో !

వేములవాడ భీమకవి వలెనే వేములవాడలో భీమేశ్వరుడున్నట్లు సాహిత్యం చెబుతుంది. చారిత్రకంగా వేములవాడ నేటి కరీంనగర్ జిల్లాలో నాటి వేంబులవాటికా – అక్కడా చాళుక్యులు పాలించారు. కాని అచటి దేవుడు భీమేశ్వరుడు కాదు. చారిత్రకంగా ఒక దేవన కళింగ పొరుడు. భీమకవి పూర్వులే నాడు వేములవాడనుండి వేంగికి వచ్చారో తెలియదు. పూర్వం కవుల కనేక శాస్త్రాల్లో ప్రావీణ్యముండేది. అందులో బ్రదుకు తెరువుకు నేటికీ బహుధా ఉపకరిస్తున్నది జోస్యం.

భీమకవి తంబళి కొడుకైతే అంత తామసమూ అనిపించక పోదు. కాగా నాడు కవులకు రాజ సందర్శనకు సమయా సమయ వివక్షణలేదా ? ఆగ్రహానుగ్రహాలు రాజభోగి శ్రీనాథునికే చెల్లును. వివిధరంగాల్లో దౌత్య రాజనీతుల్లోగూడా అనుభవజ్ఞులు కాళిదాసు, నన్నయ, ఆతని మిత్రుడు నారాయణ భట్టూ భీమకవిని పేర్కొన్న శ్రీనాథుడూను. ఆ గుణాలు భీమకవిలో ఉన్నదీ లేనిదీ తెలిసే ఆధారంలేదు.

"కళింగాత్తుపరణి" మరో తమిళకావ్యంలోనేకాదు అనేకులకు కళింగ, త్రికళింగ, సప్తకళింగ భేదాలు తెలిసినట్లులేదు. రాజుల బలాబలాలబట్టి రాజ్యాల సరిహద్దులు మారడం సహజమే. దక్షిణకోసల చక్రకూటం, కళింగ, ఉత్తర కళింగ మధ్య గిరివన ప్రాంతం త్రికళింగ. అదే నేటి బస్తరు, రాయపూర్, గంజాం, శ్రీకాకుళం, విశాఖ జిల్లా కాని యున్న దండకారణ్యభాగం—క్షేత్రగాథల్లో గోవింద కానన; మహాకాంతార-గోండ్వానా శాసనాల్లో దశారణ్య రాజ్యం–ప్రప్రథమంగా త్రికళింగాధిపతులమన్నది క్రీ. శ. 6వ శతాబ్దంలో ఇద్దరు కళింగ గంగామఠకులరాజులు. వీరి నోడించి త్రికళింగాధిపతులమన్నవారు దక్షిణకోసల పాండువంశీయులూ, కొన్యోధ శైలోద్భవులు. గంగామల కులం తర్వాత కళింగ గంగులు గంగానామాన్వయులు. వీరిలో తొలిగా క్రీ. శ. 11వ శతాబ్దంలో త్రికళింగాధిపతి నన్నది అనంతవర్మ ముమ్మడి వజ్రహస్తదేవ. ఇతని పౌత్రుడు రాజధానిని వంశధారా తీరాన్నుండి మహానదీ ప్రాంతానికి మార్చినా తదాదిగా అనువంశిక బిరుదు త్రికళింగాధిపతి. వీరు ఓఢ్రులుగా పరిగణింపబడిన పిమ్మట రూప గాంగులమన్నారు. కళింగగాంగుసత్యవర్మదేవ (క్రీ. శ. 850) నోడించిన వేంగీశ్వర గుణగ విజయాదిత్యుడూ (క్రీ.శ. 844–88) త్రికళింగాధిపతి నన్నాడు. కళింగ గాంగుల నోడించిన చేదికాలచుర్యులూ అదే బిరుదు వాడారు. క్రీ. శ. 11వ శతాబ్దాంత్యంనాడు దంతపురదేవేంద్రవర్మా అంతేనేమో! అధిరాజు పేరు సామంతులు పెట్టుకున్నట్లే ఓడినవారి బిరుదులు గెల్చినవారు వాడుకోడంలో ఆ గెల్చిన రాజులతో ఆ యుద్ధాల్లో పాల్గొన్నవారూ వాడారు.

కళింగ, త్రికళింగ, ఓఢ్ర తదితర రాజ్యభాగాలు గెల్చుకొన్న—సప్తకళింగాధిపతి రాజభూషణ సోమేశ్వరునిది దప్ప మరే కళింగ, త్రికళింగాధిపతి రాజధానీ సక్కరకొట్టంకాదు. కళింగగాంగ త్రికళింగాధిపుల రాజధానులన్నీ వంశధారా–మహానదీ మధ్య ప్రాంతాలవి. శ్రీకాకుళం జిల్లాలో సజ్జ చిరుసస్యం పంటఉంది. కాని నాటి రాజధానీ నామాల్లో సజ్జనగరంలేదు. సజ్జనగరం తూర్పుగోదావరిలోఉంటే కథాకాలానికిఅదికళింగరాజ్యాంతర్భాగంకాదు. సంఘటనలు వేరురాజ్యాల్లోనైనా శాసనాలూ, నిర్మాణాలు, అభిషేకాలు స్వంత రాజ్యాలలో నిర్వర్తించడం నాటి రాజుల ఆచారము. కళింగ చోడగంగ పట్టాభిషేకం

క్రీ. శ. 1078లో వంశధారా నదీతీరవు కళింగ నగరి (నగరి) నేటి ముఖలింగ-నగరికటకం (శ్రీకాకుళం జిల్లా)లో జరిగెను. (శకవర్ష 999 కుంభమాస శుక్లతృతీయ శనివారం) దానికి సజ్జనగరం అనే పేరు గాని, చక్రకూటమనే పేరుగాని లేదే-శాసనాల్లో (త్రికళింగావని నగరి)-నేటి శ్రీకాకుళం జిల్లాలోది.

భీమకవిని తర్వాతి వారెవరూ ఇంగితజ్ఞానం లేని వానిగాచిత్రించారనుకుంటాను. సందడి కార్యంలోఉన్న రాజు మరోసారి కలుద్దాం అంటే అంత కోపించడం-

భీమకవి కాలం అన్ననాడు భీమేశ్వరక్షేత్రం దక్షారామ అనబడినట్లు తోచదు. గుణగ విజయాదిత్యుని పిమ్మట వేంగీశ్వరుడు విష్ణువర్ధన చాళుక్యభీముడు (క్రీ. శ. 892-918) అతని నాడే దేవునిపేర్లు భీమేశ్వరుడు, ఊర్లపేర్లు భీమవరంగా ప్రసిద్ధికెక్కాయని పరిశోధకాభిప్రాయము-నాడేకాదు. చాళుక్య-చోళ-చక్రవర్తుల నాడూ భీమేశ్వరక్షేత్రం పేరు పెదడకిరేమి. వారు, వారి సామంతుల కుల/దేవాలిదేవుడు భీమేశ్వరుడు.

తిట్టు-ఖబడ్దార్ కవిత్వం చాటువుల్లో పీట వేసుకుంది. పురుటిగదివీరశైవమా? వేంగిలో పండితారాధ్యుడు కర్ణాటకానబసవణ్ణ పిమ్మటి సాహిత్యంలో వీటి ఛాయలు తిట్టుకవిత క్రీ. శ. 12వ శతాబ్దం ద్వితీయార్ధం నుండి స్థానికగాథల్లో కూడా అలాంటి కల్పనలు వేళ్ళు పాతుకున్నట్లుంది. అవీ ఇవీ మూటకట్టి ఎవరో భీమకవి భుజానికి తగిలించారేమో!

కళింగ చోడగంగు వేంగీశ్వరులపై తిరుగుబాటు చేసాడనే సాహిత్య సంశోధన-అవకాశము కనిపించదు. కులోత్తుంగ చోళుడు వేంగీ రాజప్రతినిధుల విశ్వసించక చీటికి మాటికి మార్చే అనే సంశోధకాభిప్రాయం కూడా సరికాదు.

క్రీ. శ. 11-12 శతాబ్దాలనాటి చారిత్రక సంఘటనలకు కవిత్వంపూసి భీమకవి నోట జెప్పించిన దెవరో, ఏనాడో తెలియదు. కవి ఆగ్రహానుగ్రహాలకు పాత్రుడైన కళింగరాజు ఎవరు? ఒకరా ఇద్దరా? భీమనామలైన వేంగీపిరులు, భీమేశ్వర భక్తులైన రాజులు వారు చేసిన పనులు ఎవరు భీమకవి పరంచేసారో తెలియదు.

చరిత్ర-సాహిత్యంగూర్చి వ్రాసే అర్హత నాకులేదు. కాని నాకున్న సందేహాలు వందలు-పరిశోధకులూ, సాహిత్య సంశోధకులూ సత్యాన్వేషణ చేయగోరెదను.

కులోత్తుంగచోళుడు సమకాలిక సమీప కాలిక రాజులతో పోలిస్తే తనగూర్చి తర్వాతి కాలపువారు జెప్పకోగలందుకు ఒక్క సూర్యాలయం దప్ప మరే నిర్మాణం చేయలేదు. శాసనాలు వేయలేదు, కవుల పోషించనూలేదు. కాని ఇతని చరిత్ర సమకాలిక ''కళింగాత్తుపరణి'', పిమ్మట మరో కులోత్తుంగచోళునినాటి మరో తమిళకావ్యం ఇతని సామంతుల శాసనాలబట్టి తెలుస్తుంది-పరమశైవుడు. వీలైవప్పుడు వీరోచితక్రీడలూ, సంగీత శ్రవణాసక్తుడు.

రాజ కళింగగంగు కళింగచోడ గంగు అన్నారు కాబట్టి అతని సమీప సమకాలిక సంఘటనలు కొన్ని ఈ క్రింది వివరాలు చూచి పెద్దలు నిర్ణయించాలి.

క్రీ. శ. 11వ శతాబ్దంలో కళింగ ఇమ్మడి కామార్ణవ, సోదరుడు రాజేంద్రచోళ సైన్యాలు, వేంగీ విమలాదిత్యుని చేతిలో చెల్లిపోయారు. ఈ కామార్ణవుని ద్వైమాతరుడు మధుకామార్ణవుడు క్రీ. శ. 1019లో రాజయ్యెను.

కళింగలో వేంగీరాజు ప్రతినిధిగానున్న వీరవిజయాదిత్యుని తిరుగుబాటు ప్రోత్సాహకుల్లో కళింగగంగానామాన్వయమధు (ఇమ్మడి) కామార్ణవుడు. ఇతని పరిపాలనా, వీరవిజయాదిత్యుని తిరుగుబాటూ క్రీ. శ. 1038 లో ముగిసెను. మధుకామార్ణవుని పిమ్మటి కళింగ రాజు అనంతవర్మ ముమ్మడి వజ్రహస్తదేవ (క్రీ. శ. 1038–70). విష్ణువర్ధనరాజరాజు ద్వైమాతురుడు వీరవిజయాదిత్యుని తిరుగుబాటు (క్రీ. శ. 1038 నాటికి) అణచి మధుకామార్ణవుని శిక్షించి, ముమ్మడి వజ్రహస్తుని పదస్తుని చేసాడంటే భీమేశ్వర భక్తుడైన వేంగీరాజరాజే భీమకవి ఆగ్రహానుగ్రహాలనాలి.

రాజరాజు కొడుకు కుమార రాజేంద్ర చోడుడు (కులోత్తుంగ చోళ) కప్పము కట్టమానిన దారావర్షుని శిక్షించి, అతని చక్రకూట రాజ్యాన్ని నిర్మూమధామంచేసి వేంగికి వచ్చేటప్పటికి తండ్రి కర్ణాటక యుద్ధంలో మరణించుట-పినతండ్రి వీరవిజయాదిత్యునికి మరోసారి వేంగీరాజపదవి. పినతండ్రిని ఓడించినా తన ఆశలన్నీ దౌహిత్ర వారసత్వం-చోళచక్రవర్తి కావాలనే కాబట్టి వేంగిని పినతండ్రికి

విడిచి ఆ ప్రయత్నంలో ఉండెను. వీరిద్దరి సఖ్యత పొరుగురాజులకు ఇబ్బంది. కల్యాణీ చాళుక్యులకు వీరవిజయాదిత్యుడు మిత్రుడు శత్రువైనాడు. చోళవీరరాజేంద్ర చోళునికి కుమార రాజేంద్ర చోడుడు బంధువు శత్రువైనాడు. వీరరాజేంద్రచోళుడు ఈ ఇద్దర్నీ ఓడించెను. ముమ్మడి వజ్రహస్తుడూ, అతని కొడుకు దేవేంద్రవర్మ రాజరాజు వేంగికి మిత్రులు కారానాడు. విజయోత్సాహంతోవచ్చిన వీరరాజేంద్ర చోళుని కళింగవంటి చిన్నరాజ్యం నిలువరించలేదు. వీరవిజయాదిత్యుడు సహాయమర్థించుటతో వేంగి కళింగ సైన్యాలు వీర రాజేంద్రచోళుని ధాటి నరికట్టాయి. చోళరాజు రాజసుందరిని కళింగ రాజరాజు రాణినిజేసి (క్రీ. శ. 1068-9) తన రాజ్యంలో కుమార రాజేంద్రు నోడించబోవుటలో మరణించెను. వేంగియువరాజు కులోత్తుంగ చోళునిగా చోళ సింహాసనమెక్కెను (క్రీ శ. 1070) వీర విజయాదిత్య–కళింగ రాజరాజు సఖ్యత తాత్కాలికము. క్రీ.శ.1072 నుండీ విరోధులుగా యుద్ధాలు చేసారు. ఇద్దరూ క్రీ.శ. 1076లో మరణించుట గమనించ దగినది. కళింగ రాజరాజు వేంగీ యుద్ధంలో మరణించియున్న వీరవిజయాదిత్యుడే భీమకవి ఆగ్రహము.

పినతండ్రి మరణమెరిగిన కులోత్తుంగ చోళుడు వేంగికి కొడుకునంపెను. కళింగ రాజరాజు మరణించిన వెంటనే అతని కొడుకు బాలుడైన కళింగ చోడగంగరాజు కాలేకపోయెను. కళింగాధిపతి నన్న దంతపురవాసి గంగామలకుల దేవేంద్రవర్మ బాలరాజు రాజ్యమునపహరించెను. బాలరాజు రాజ్యభ్రష్టతకు వేంగీశ్వరులు కారకులు కారు.

ధారావర్షుని కొడుకు బాలుడైనందున తల్లి గుండమహాదేవి సంరక్షకురాలుగా పాలించెను. చక్రకూట బాలరాజు సోమేశ్వరుడు క్రీ. శ. 1068 నుండే విజృంభించి తన రాజ్యభాగా లపహరించిన మధురాంతకాదుల పారద్రోలి అపజయమనే దెరుగకుండా త్రికళింగ, కళింగ, ఓఢ్ర తదితర రాజ్యభాగాలజయించి సప్త కళింగాధిపతి ఐనాడు. ఇతని అండదండలు దంతపుర దేవేంద్రవర్మ కుండెను. వీరూ, కల్యాణీ చాళుక్యుల సైన్యాలు వేంగిని పీడించారు.

చోళరాజు కన్య మధురాంతకిని పెండ్లాడిన కులోత్తుంగ చోళునికి కళింగ రాజరాజు - రాణి చోళరాజ సుందరికి పుట్టిన కళింగ చోడగంగ వరుసకు కొడుకు. కాగా దంతపుర, చక్రకూటరాజుల కారణంగా కళింగ బాలరాజు చాళుక్య–చోళరాజ్యానికి బహు సన్నిహితుడైనాడు.

కులోత్తుంగ చోళుని కొడుకు ఇమ్మడి రాజరాజనే ముమ్మడి చోడ దేవ క్రీ. శ. 1076–8 మధ్య వేంగినేలెను.

ముమ్మడిచోడుని దండనాయకుడు వెలనాటి మహా మండలేశ్వర గొంకరాజు. వీరి కళింగ దండయాత్ర కళింగ చోడగంగ సహాయార్థమనిపించును. క్రీ. శ. 1078 లో కళింగ చోడగంగ పట్టాభిషేకం బట్టి వేంగీవారు దంతపుర దేవేంద్రవర్మపై దాడిచేసారనాలి. ఆ యుద్ధంలో పాల్గొన్న వేంగీవీరులు ముమ్మడి భీముడు. ఈ మలయాధిపతి చిన్ననాటినుండీ వీరవిజయాదిత్యునివద్ద పెరిగెను. విజయానంతరం వేయిగ్రామాలకధిపతి ఐనాడు. దీన్నిబట్టే భీమకవి అనుగ్రహం వేంగివారి తోడ్పాటే. ఆ సంవత్సరంలోనే కర్ణాటక సైన్యాలకు ఓడి ముమ్మడిచోడుడు కంచికి పారిపోయెను.

కులోత్తుంగ చోళుడు మరో కొడుకు విష్ణువర్ధన వీర చోడుని సైన్యంతో వేంగికి పంపెను. ఇతడు క్రీ. శ 1078 84 మధ్య వేంగినేలెను. ఇతని బెల్గూరి శాసనం–కళింగబాలరాజు తండ్రి నాటి దండనాయక వనపతి కళింగ మంత్రి – మంత్రిభార్య పద్మావతి (క్రీ శ. 1081) ఈ భీమేశ్వరు దర్శించరావడంలో బాలరాజుకు తోడ్పడ వీరచోడు నర్థించుట క్రీ. శ. 1096 వరకూ దంతపుర దేవేంద్రవర్మ చక్రకూట సోమేశ్వరుల విజృంభణ సాగుటలో అప్పటి వరకు కళింగ బాలరాజు పదవి సుస్థిరం కాలేదు. వీరపాండ్యుని తిరుగుబాటు సందర్భంగా వీరచోడుడు తండ్రి వద్దకు పోయెను.

వీరచోడుని సోదరుడు చోడగంగదేవ అనే మరో రాజరాజు వేంగి (క్రీ. శ. 1084-9) నేలెను. ఈ గంగ. దండనాయక గొంకరాజు క్రీ. శ. 1089 లో కళింగ యుద్ధంలో మరణించి యుండురు.

వీరచోడుడు రెండవసారి వేంగి (క్రీ. శ. 1089-94) కి వచ్చెను. వెలనాటి ఇమ్మడి విదుదనకు అగ్ర సింహాసనార్హత, దండనాయక పోతన కొడుకు మేడమార్యుడు తన బిరుదుతో కుమార నారాయణ బ్రహ్మ మహారాజగుటబట్టి మొదటి జయం వీరిదై యుండును. ముఖలింగ మధుకేశ్వరాలయ శాసనంబట్టి వీరచోడుడు క్రీ. శ. 1092-3 అచట విడిసెను. ఈ దండయాత్ర చక్రకూట సోమేశ్వరుని శిక్షించుట, కళింగబాలరాజుకు తోడ్పడుట దంతపుర దేవేంద్రవర్మను శిక్షించుటకే ఆయుద్ధంలో వీరనారాయణ వీర చోడుడోడి మరణించెను.

విజయోత్సాహంతో చక్రకూట సోమేశ్వర. దంతపుర దేవేంద్రవర్మ సైన్యాలు వేంగిని ముట్టడించి రాజధాని జననాధపురాన్ని భస్మీపటలం చేసెను. (క్రీ. శ. 1094) సోమేశ్వరుని శాసనంలో వేంగి రాజధాని దహనం, వీరచోడుని మరణం ఉన్నాయి.

చేతి కందివచ్చిన కొడుకులు ఇద్దరు కళింగ యుద్ధాల్లో మరణించారు. కులోత్తుంగ చోళుడు స్వామిభక్తిపరాయణులైన వెలనాటి వారిలో తనపేరిటి వెలనాటి రాజేంద్రచోడుని దత్తపుత్రునిగా ప్రకటించి, మరింత సైన్యం పంపెను. ఈ సంఘటనతో కులోత్తుంగుని సమయజ్ఞత, పరిపాలనా పాఢీయేగాదు వేంగివారికి నూతనోత్సాహం కల్గించెను. చతుర్థాన్వయులైన వెలనాటివారు రాజబంధువులు, క్షత్రియులైనారు. వెలనాటి రాజేంద్రచోడ (క్రీ.శ.1094–1106) అధిరాజు అంచనాలు, ఆశలు, తన విద్యుక్త ధర్మ నిర్వహణలో దేనికీ వెనుదీయలేదు – చోడగంగ, వీరచోడులు సాధించలేనివి సాధించెను.

సాహిత్య సంశోధకులు "కళింగత్తు పరణి" కవి కులోత్తుంగ చోళుని ఆస్థాన కవి అన్నారు. కులోత్తుంగుని మంత్రి, సేనాని మండలేశ్వర కరుణాకర పల్లవరాయుని క్షాశ్రితుడు. అందుచేతనే

"కళింగాత్తు పరణి" కరుణాకరుని ప్రశస్తి – కరుణాకరుడూ, చోళ సైన్యమూ వెలనాటి రాజేంద్రునికి బాసటగా వచ్చెను. కవి కళింగ దండయాత్ర విజయం కీర్తి తన ఏలిక కరుణాకరునకిచ్చుటలో ఇతరుల విస్మరించెను.

వేంగీ కాంచీపుర సైన్యాలు వేంగీ రాజధాని (జననాథపుర) నా క్రమించియున్న సప్తకళింగసైన్యాల నోడించి వెంట దరిమెను. చక్రకూటమున సోమేశ్వరుడు మిగిలిన వేయి ఏనుగులతో ఎదిరించి మరెప్పుడూ తలెత్తనంత చిత్తుగా ఓడిపోయెను. అపజయ మెరుగని సోమేశ్వరుని జీవితంలో అపజయము (క్రీ. శ. 1096) చక్రకూట రాజ్యం ఇతని పిమ్మట కొడుకు కన్నరదేవ పాలనా కాలాన కలచురుల (రత్నదేవ) చేది రాజ్యాంతర్భాగమయ్యెను.

ఈ కళింగ దండయాత్రకు నాయకుడు వెలనాటి రాజేంద్ర చోడుడు. దంతపుర దేవేంద్రవర్మను ఓడించి చంపుటేగాక అతని రాజధానిని దిబ్బలుగా చేసారు. అదే నేటి శ్రీకాకుళం జిల్లాలో దంత హండా. మహేంద్రగిరిపై జయస్తంభం శాసనంలో మహాదండ నాయక (వెలనాటి) రాజేంద్రచోడ, వండైనగర మండలేశ్వర మంత్రి చోళసేనాని తొండైమాన్ కరుణాకర పల్లవరాయన్; కళింగ చోడ గంగ గజసాహిణి, సేనాపతి, రాజరాజ బ్రహ్మమహారాజులున్నారు. ఈ యుద్ధంతో సోమేశ్వరుడు సామంతుడైనాడు. కళింగచోడగంగకు సుస్థిరత కల్గెను. ఈ యుద్ధంలో పాల్గొన్న రాజేంద్రచోడుని వేంగి వీరులు - దుర్జయవంశ నాదెండ్ల మహామండలేశ్వర ఇమ్మడి మన్మ (మండ)రాజు దంతపురం ధ్వంసంచేసిన వారిలో ఒకడు. ఈ కొండ పడమటిరాజు బిరుదుల్లో గంగానామాన్వయులదైన అనియంక భీమ ఉన్నది. చతుర్థాన్వయ మహామండలేశ్వర పల్లవరాయ పండ సత్కారింపబడెను. కోనకందరవాడి సీమా మహామండలేశ్వరకోన ఇమ్మడి పోతరాజు వేంగీంద్ర బిరుదు పొందాడు. ఇతడే సాహిత్య పరిశోధకులు కళింగ చోడగంగు నోడించాడనుకున్న త్రికళింగాధిపతి బిరుదాంకితుడు. చాళుక్య నారాయణ బ్రహ్మమహాధి రాజ చమూపతి భీమ నారాయణుడున్నాడు. మహామండలేశ్వర కోటభీమరాజున్నాడు.

గంగైకొండ చోళపురంవారు కళింగనే ఓఢ్రరాజ్యం అనక పోలేదు. త్రికళింగాధిపతి బిరుదు కళింగ గంగాకులుల, గంగానామాన్వయులకు 'కామన్'. అనియంకభీమ గంగానామాన్వయులది. దంతపుర దేవేంద్రవర్మ బాలరాజు రాజ్యమపహరించి రెంటు బిరుదుల్తూ వాడాడేమో?

రాజ కళింగగంగు కథలో భీమకవి కాపాడింపబడిన విషయాలు పదవి పోయినది దంతపుర కళింగరాజు, సామంతుడైనది సప్తకళింగాధిపతి అనుగ్రహింపబడినది కళింగ నగరి కళింగచోడగంగ. భీమకవి స్టాటిస్టిక్స్ వేయిగజాలును వాడినది సప్తకళింగాధిపతి. చక్రకూటమూ కళింగమువలె ఏనుగులకు ప్రసిద్ధి. కాని గజపతి అనేపేరు కళింగ గంగానామాన్వయులది. వారి నిర్మాణాల్లో శిల్పంలో కూడ ఏనుగులకున్న ప్రాముఖ్యత గుర్రాలకులేదు.

సాహిత్య పంశోధకులు కళింగచోడగంగు తిరుగుబాటు చేసియుండవనుకోడానికి అస్కారం లేకపోలేదు. తమ రాజు కష్టంగట్టి మానినందునే ఈ దండయాత్ర యనుకొన్న పౌరులు-అభయునికే (కులోత్తుంగచోళ) గాక ఆతని సైన్యానిక్కూడా భయపడలా అన్న అపజయమెరుగని రాజు "కళింగాత్తుపరణి" సందర్భం - కళింగచోడ గంగు క్రీ. శ. 1078-96 మధ్య అనేక విపత్కర పరిస్థితులకు గురైనాడు, అపజయమెరుగని వాడుకాడు, కష్టము కట్టని వాడు కాడు. అతడు తన పట్టాభిషేకము నాటినుండీ తోడ్పడుచున్న కులోత్తుంగచోళునకు భయపడనవసరము కనిపించదు. పోతే మరో సందర్భము కళింగచోడగంగ శ్రీకూర్మం శాసనం (క్రీ. శ. 1136)లో పూర్వాపర ఉత్తర రాజ్యాల్లో (?) యుద్ధాల్లో విజయుడై తిరిగి వచ్చుట. అప్పటికి విశేషానుభవం గడించిన కళింగచోడగంగ ముఖ్యంగా వేంగీ యుద్ధంలో చాళుక్య-చోళ సైన్యాలకు బాసటగా పోరుట అనాలి. శాసనాలబట్టి కళింగ గజసాహిణి రాజరాజ బ్రహ్మమహాధి రాజు (క్రీ. శ.1102 3); కళింగ సేనాపతి చోడగంగ తిలక బ్రహ్మమహారాజ (క్రీ. శ. 1112-3); శ్రీఖండపుత్ర మహామాండలిక రేచవ (క్రీ. శ. 1116-7) జననాథపురంలో ఉన్నారు.

దత్తపుత్రుని మరణానంతరం సమర్థుడైనవాని నన్వేషించుటలో కులోత్తుంగ చోళుడు వేంగికివచ్చి రాజప్రతినిధిగా కోన రాజేంద్రచోడుని (క్రీ. శ. 1107-10) నియమించుట ఇతరులు హర్షించలేదనిపిస్తుంది.

కులోత్తుంగచోళుని మరో కొడుకు పరాంతకదేవుడు క్రీ. శ. 1111-18 మధ్య వేంగినేలి తండ్రి మరణించగా (క్రీ. శ. 1118) విక్రమచోళ దేవ అనే పేరుతో చాళుక్య-చోళచక్రవర్తి అయ్యాడు. క్రీ. శ 1118-37 మధ్య పల్నాడు హైహయులు; కొందరు తెలుగుచోడ, చాళుక్య, క్షత్రియ సామంతుల తోడ్పాటుతో కల్యాణీ చాళుక్య సైన్యాలు వేంగి నాక్రమించుటలో స్వామిభక్త మాండలికులను కొన్నాళ్లు సామంతులుగాచేసి పాలించుట - చివరికి క్రీ. శ. 1137 నాటికి వీరిని పారద్రోల గల్గినది వెలనాటి ఇమ్మడి గొంకరాజు, కమ్మనాటి మహామండలేశ్వర నంబిరాజు ధర్మవరం మహామండలేశ్వర కడియరాజు, విజయవాడ మహామండలేశ్వర భీమన, మహామండలేశ్వర కోన రాజేంద్రచోడ, మలయాధిపతి మహామండలేశ్వర ఐతమరాజు. వీరంతా చాళుక్య భవన మూలస్తంభాయమానులూ, వేంగీ చాళుక్య సముద్ధారులూ, వేంగీ చాళుక్య నంకకారులుగా ప్రసిద్ధులు. కల్యాణీ చాళుక్య ఆర్మడి విక్రమాదిత్యుని మరణం (క్రీ. శ. 1126) వేంగివారిని ఊపిరి తీయనిచ్చెను. కాని పిఠాపురం చాళుక్యుల్లో ఒకడు విజయాదిత్య చక్రవర్తిగా ప్రకటించుకోడం–ఇతనికి తెలుగుచోడ కొలని నాయక భీముని తోడ్పాటు–ఇమ్మడి గొంకరాజు, అతని కొడుకు ఇమ్మడి రాజేంద్రచోడుడూ తిరుగుబాట్లు, ఆక్రమణల నణచగల్గారు. ఆ యుద్ధాల్లో కళింగచోడగంగ, వీరికి బాసటగా నుండియుండునేగాని వేంగిని గెల్చుటా, తిరుగుబాటుకాదు. చాళుక్య-చోళ చక్రవర్తి, ఇమ్మడి కులోత్తుంగచోళ (క్రీ. శ. 1132-48) వేంగి

పాలన సమర్థుడైన ఇమ్మడి గోంకరాజు కప్పగించెను. పిమ్మట చక్రవర్తి చాళుక్య నారాయణ అనే మరో రాజరాజు (క్రీ. శ. 1140-73) వెలనాటి వారిపై ఆధారపడెను.

కళింగ చోడగంగ వీరందరికీ సమకాలీనుడు, గాంగుల్లో చిరకాలం విస్తృత రాజ్యాన్నేలినవాడు. రాజైనపిమ్మట సుమారు 18ఏళ్ల ఒడుదుడుకుల్లోఉండి సుమారు ఇరవైయ్యేళ్ల ప్రాయంలో సుస్థిరుడైన (క్రీ. శ. 1096)న ఇతనికి క్రీ. శ. 1140 పూర్వం మరోసారి తాత్కాలిక పదవీచ్యుతి కల్గించినది చేది కలచురి ఇమ్మడి రత్న దేవుడు-మరో త్రికళింగాధిపతి బిరుదాంచితుడు. ఇమ్మడి గోంకరాజు కళింగదండయాత్రలో ఓడినది త్రికళింగాధిపతి ఇమ్మడి రత్నదేవుడు – కళింగచోడగంగ కాదు. ఈ గోంకరాజు శాసనాల్లో ఓడినవారు కర్ణాట, మరాట, లాట, కుంతల, ఆంధ్ర, కటక, త్రికళింగాధిపతులు-తిరుగుబాట్లణచుట, కర్ణాటక సైన్యాల పారద్రోలుట వగైరా.

కళింగ చోడగంగ పిమ్మట నాలు శతాబ్దాలనాటి "మాదలా పంజి" (పురీజగన్నాథాలయపు ఓఢ్రపు కవిలెకట్ట) ఇతనిగూర్చి చెప్పినది. ఉత్కళరాజు సువర్ణకేసరి (క్రి.శ.1123-32)నిస్సంతు. అతని మాండలిక వాసుదేవ బహంపతి ప్రోద్బలమున కర్ణాటకరాజు (కళింగచోడగంగ) ఉత్కళ మాక్రమించెను. కళింగచోడగంగ శాసనాల బట్టి అతడు ఆదిలో భౌమకర వంశ సువర్ణ కేసరికీ తోడ్పడెనని పించును. సువర్ణ కేసరి మరణానంతరమే అతని రాజ్యాన్ని కలుపుకొని మిధున (మిద్నపూర్) పురవరకు వ్యాప్తిచేసెను. కలచురి ఇమ్మడి రత్నదేవుని బెడదా తీరెను. ఆ సందర్భముననే విస్తృత రాజ్యపాలనా సౌలభ్యానికి రాజధానిని వంశధారానదీ తీర కళింగ నగరి కటకమునుండి మహానదీతీర కటకమునకు మార్చెను. ఇతని తర్వాత కొంతకాలానికి కళింగ గాంగులు ఓఢ్రులుగా పరిగణింపబడినారు. నేటి విశాఖ, శ్రీకాకుళం గంజాం జిల్లావరకూ నాటి కళింగ రాజ్యం కళింగచోడగంగనాడూ వేంగీ సామంత రాజ్యముగ నుండెను.

ఇమ్మడి గోంకరాజు నాటినుండీ పూర్వంవలె సామంతుల మన్నపుటికీ వేంగీశ్వరులు వెలనాటి చోడులు. ఇమ్మడి రాజేంద్ర చోడునిపిమ్మట ముమ్మడి గోంకరాజు – వెలనాటి వారిలో చివరివాడు వెలనాటి ముమ్మడి రాజేంద్రచోడుడనే పృథ్వీశ్వర (క్రీ.శ 1185-1260) వేంగీశ్వరుడు. క్రీ. శ. 12వ శతాబ్దం చివరి పాదంలో విజృంభించిన వీరశైవంలో పృథ్వీశ్వరునికి పూర్వమే వింతలువిడ్డూరాలు కల్పనాకథలుండెను. వెలనాటి వారికి జంకిన కాకతీయులు పృథ్వీశ్వరుని నాటికి నెల్లూరు చోడులు, స్వామి ద్రోహులైన మాండలికులు – వీరశైవం అంతా కలిసి వెలనాటివారి పాలనను గుంటలో పూడ్చి గంటవాయించారు.

కళింగగాంగరాజు అనియంక భీముని కొడుకు అనంతవర్మ ముమ్మడి రాజరాజు (క్రీ. శ. 1198-1211) పాలనకు ముప్పు వచ్చేట్లుండగా వెలనాటి పృథ్వీశ్వరుని కళింగ దండయాత్ర తిరుగుబాటుచేసిన మరో గాంగవంశ మాండలిక నరసింహునణచి ముమ్మడి రాజరాజుకు తోడ్పడుట మాత్రమే. పృథ్వీశ్వరుని మంత్రి కొఱవి వెన్నయామాత్యుని బిరుదులు కళింగదేశ నిర్మూలనధామ, వీరఘొట్ట విభాల. శ్రీకూర్మంశాసనం (క్రీ. శ. 1205) పృథ్వీశ్వరుని కోశాధ్యక్షుడు అనంతామాత్యుడక్కడున్నాడు. మాండలిక నరసింహుని తిరుగుబాటు పూర్తిగా అణచకుండా పృథ్వీశ్వరుడు వేంగిపై దాడి చేసిన నెల్లూరుచోడ, కాకతి గణపతి సైన్యాల నెదుర్కొన కళింగ కదలివచ్చి క్రీ. శ. 1210లో కాకతీయులతో యుద్ధాన మరణించెను.

• మాండలిక నరసింహు స్వతంత్ర ప్రకటన క్రీ. శ. 1208. వేంగిని జయించిన కాకతి గణపతి ఇతని నణచుటకు రాజనాయకు నంపెను. రాజనాయకుడు చొక్కర (గంజాం) దుర్గం ముట్టడించి గోధూము (నరసింహ)ని వధించెను. ఆ యుద్ధంలో పాల్గొని యుండును. కాకతి గణపతి బావమరదే జాయపసేనాని బిరుదుల్లో గోధూమఘరట్ట ఉన్నది. ఈ తిరుగుబాటు కళింగ ప్రాంతం నేటి ఉత్తర విశాఖ శ్రీకాకుళ-గంజాం ప్రాంతానివి.

భీమకవి ఆగ్రహానుగ్రహాలకు పాత్రుడైన రాజు కళింగగంగు అనంతవర్మ చోడగంగదేవ అన్నారు. అతని నాటివీ-ముందువెనుకల నాటి సంఘటనలివన్నీ –

సిద్ధహస్తులైనవారూ, నిష్పక్షికంగా ఆలోచించగలవారు భీమకవి పరంగావచ్చిన కథ-చారిత్రక సంఘటనలను కవిమహాత్మ్యం చేసినారనిపించకపోదు. సాహిత్య పంశోధకుల పొరపాట్లూ గుర్తించక పోరు. పిమ్మటి వారెవరో – బహుశా తిట్టుకవిత్వానికీ, అరాజకత్వం ప్రేరేపించడానికీ-మతవైషమ్యాలు దుష్ప్రచారాలకు నాంధి క్రీ. శ. 12వ శతాబ్దం చివరి పాదంలో ఇలాచేసారనిపిస్తుంది.

కవి ఆగ్రహానుగ్రహాల వాస్తవం – చారిత్రకంగా భీమేశ్వర భక్తులైన వేంగీశ్వరులూ, భీమనాములెవరో కావాలేగాని మంత్రాలకు చింతకాయలు రాలనట్లే కవికోపంతో రాజ్యంపోవడం, అనుగ్రహంతో తిరిగి సంపాదించడం ఎవరూనమ్మరు. ఐతే కళింగదేవేంద్రవర్మరాజ రాజు మరణానంతరం కొడుకు కళింగ చోడగంగ క్రీ. శ. 1096 వరకూ ఎక్కడెక్కడ భద్రుడైయ్యున్నదీ నేతెలియగోరుచున్నాను.

[ అముద్రిత 'కళింగదేవ' నుండి ]

# ఇంద్రకల్లు

శ్రీ కే. కిశోర్‌బాబు

శ్రీ కే. అశోక్‌బాబు

విస్సన్న చెప్పిందే వేదం అనేది తెలుగువారికి చిరపరిచితమైన సామెత. దీన్ని

ఇపుడే చెబుతా ఇనుకో బుల్లెమ్మా
విస్సన్న చెప్పిన వేదంగూడ

అని పింగళి మహిళా లోకాన్ని మేల్కొల్పుతు 1962లో తెరక్కెక్కించాడు.

ఈ విస్సన్న పూర్తిపేరు "ఇంద్రగంటివిశ్వపతిశాస్త్రిగారు". అతడు పిండి ప్రోలు లక్ష్మణకవి సమకాలికుడని, లక్ష్మణకవి అతనిని "మామా నీ పేరులో వి తీస్తే "శ్వపతివి" శ్వ తీస్తే "విపతివి" అని పరిహాసం చేసేవాడని చెళ్ళపిళ్ల వేంకటశాస్త్రిగారు తమ కథలు గాథల్లో చెప్పారు.

ఈ విశ్వపతి శాస్త్రి వేదంలో చాలా గట్టివాడట. కావచ్చు లేకుంటే వ్యక్తిపేరుతో సామెత ఏర్పడటం సాధ్యంగాదు. ఈలా ప్రామాణికుడైన ఈ వేదపండితుని పూర్వు లెక్కడివారో గాని పూర్వం వేదపండితులకు నిలయమైన ఇంద్రకల్లొకటి నేడు నాగర్ కర్నూలు తాలూకాలో ఉంది. దానికి ఇంద్రేశ్వరమని ప్రాచీన నామం.

పండితారాధ్య చరిత్రలోని పర్వత ప్రకరణంలో పేరుతో ఉండే తీర్థమొకటి శ్రీశైల దక్షిణద్వారస్థ క్షేత్రాల్లోను క్షేత్రమొకటి పశ్చిమ ద్వారస్థ క్షేత్రాల్లో పేర్కొనబడింది.

త్రింశద్యోజన పరిమితమైన శ్రీశైల క్షేత్ర స్వరూపాన్ని సర్వజ్ఞ మల్లికార్జునుడు పండితుని శిష్యుడైన దోనమయ్యకు చూపిన సందర్భంలో శ్రీశైల చతుర్ద్వారాల్లో ఉండే పెక్కు స్థలాలను చెప్పాడు.

డా॥ చిలుకూరి నారాయణరావుగారు పండితారాధ్య చరిత్రకు మిక్కిలి శ్రమించి విపులమైన పీఠిక వ్రాసి అనేక విషయాలు వివరించారు గాని పర్వత ప్రకరణంలో పేర్కొనబడ్డ స్థలాలను గుర్తించినట్లు లేదు. ఎవరేగాని ఆ ప్రకరణంలోని దోనమయ్య మహేశ్వరాచల ప్రాప్తి వృత్తాంతంలో చెప్పబడ్డ ప్రదేశాలన్ని సమగ్రంగా పరిశీలించి వివరిస్తే తెలుగు దేశానికి పెద్ద స్థలచరిత్ర లభిస్తుంది. ఇది విషయాంతరం.

పండితారాధ్య చరిత్రలో ఇంద్రేశ్వరం ప్రలు పర్యాయాలు పేర్కొనబడ్డా వానిలో ఏ ఒక్కటైనా ఈ యింద్రేశ్వరాని కన్వయిస్తుందో లేదో చెప్పలేం గాని ఈ గ్రామం మిక్కిలి పురాతనమయింది.

ఇది ఒక పట్టణంగా ఉండి మత సంస్కృతులకు కేంద్రమై జైన వైదిక శైవమతాలు త్థాన పతనాలు పొందిన చిహ్నాలు స్పష్టంగా కన్పిస్తాయి.

క్రీస్తుశకం పదకొండో శతాబ్దం నాటికీ గ్రామం మహా వైభవంగా ఉండేది. ఆనాడిక్కడ నేటి పై పింగు పద్ధతి గూడ ఉండేది. ఆ మట్టి గూనలింకా నేలలో ఉన్నాయి. ఇంకా అనేకమైన ఆలయాలుండేవి. అనేక వేదపండితుల కుటుంబాలుండేవి.

ఇక్కడ గాజు, బలపంరాయి, శంఖు మొదలైన వానికి సంబంధించిన పరిశ్రమలుండేవి. గాజుతో వివిధాకారాల పూసలు, పిల్లల ఆట వస్తువులు గూడ చేయబడేవి. పిండిరాతితో గణపతి, దేవి మొదలైన పూజామూర్తులు చెక్కేవారు. శంఖంతో గాజులు, ఉంగరాలు మొదలైన భూషణాలు చేసేవారేమో! ఇక్కడ లభించిన శంఖాలను బట్టి చూస్తే అవి వీరికే సముద్రతీరంనుండి అందుతుండేవా! అని ఆశ్చర్యం వేస్తుంది. ఈ పరిశ్రమలతోపాటు ఇక్కడి కుమ్మరి గూడ మంచి పనివాడు.

ఇక్కడ వెలసిన మతాల్లో మొదట చెప్పదగింది జైనం. ప్రాపంచిక వాసనలు విడిచి దిగంబరులై ప్రశాంతంగా నాగుల పడగల నీడల్లో నిలచిన జైనమూర్తులనేకం ఇక్కడుండేవి. వారికి సంబంధించిన గాథలిక్కడి శిల్పులు కృష్ణ శిలాఫలకాలపై తీర్చారు

ప్రస్తుతం గ్రామంలో ఉండే చెన్నకేశవాలయం ఇక్కడి ఆలయాలన్నింటిలో ప్రాచీనం. దాని ప్రాకార ద్వారాని కిరువైపుల జయ విజయులకు బదులు పద్మాసనస్థమైన మహావీర ప్రతిమలున్నాయి కాబట్టి అది మొదలు జైనాలయమే కావలి.

పాల్కురికి సోమనాథుని పిమ్మట జైనానికి దుర్దశ పట్టింది. దిగంబర జైనులను శూలాలతో పొడిచి చంపటం వారు పవిత్ర కార్యంగా భావించారు. అలాటి హింస ఇక్కడ కూడ జరిగింది.

ప్రస్తుతము అక్కడ గ్రామదేవత ప్రక్కగా ఉండే ఓ వీరగల్లు విషయాన్ని చెబుతుంది. ఆ వీరుగల్లో వీరశైవముద్ర మూర్తి

కవించి ఉంది. అతడు శూలంతో దిగంబర జైనులను పొడిచి చంపుతున్నాడు ఆ వీరగల్లుపై అతని పేరుగూడ చెక్కబడింది.

ఈ ప్రాంతంలో వీరగల్లు అనేకం ఉన్నా ఈలా జైనులను చంపుతున్న వీరగల్లు - అందులోనూ ఇంత స్పష్టమూ, సుందరమూ అయింది మరెక్కడలేదు.

శైవులీ విధంగా జైనుల్ని హింపించి వారి మూర్తులన్ని భగ్నంచేసి పారవేశారు.

జైనం పిమ్మట శైవం వ్యాపించింది.

ఈ గ్రామానికి నాలుగు మూలల్లో నాలుగు శివాలయాలుండేవి. వానిలో ఆగ్నేయాలయానికి ముక్కంటేశ్వరాలయం, నైఋతి ఆలయానికి ఇంద్రేశ్వరాలయం, వాయువ్యాలయానికి భీమేశ్వరాలయం, ఈశాన్యాలయానికి నందీశ్వరాలయం అని వ్యవహారాలు. వీనిలో ఇంద్రేశ్వరాలయాన్నిబట్టే ఈ గ్రామానికి ఇంద్రకల్లని వ్యవహార మేర్పడిందంటారు. ఈ ఆలయంలో దూలం పైకప్పుపై రామాయణ చిత్రాలుండేవి ఇది ఈ ఆలయంలోని ప్రత్యేకత. కాని రంగులతో చిత్రించబడిన ఈ చిత్రాలు నేడు ఏ ఓటు సున్నం కొడుతుండటంవల్ల మాసిపోయినాయి—గంగాపురంలో ఈలాగే రంగుల మోజుచేత చెన్నకేశవాలయ ప్రధాన ద్వారానికి శిల్పంలోని జీవకళాంత పూడుకుపోయే అట్లుదట్టంగా రంగు పులిమారు.

స్థానికులీ ఆలయాలు గోవ గన్నయ్యగారి కాలంలో కట్టబడినవంటారు గాని నే డింద్రేశ్వరాలయ స్తంభాలపై ఉదయనచోడుని, అతని కుమారుడైన భీమచోడుని పేర్కొనే దాన శాసనాలున్నాయి కాబట్టి పదకొండో శతాబ్దం పూర్వార్థంనాటికే ఈ ఆలయాలు వెలసి ఉండాలి.

గంగాపురం రాజధానిగా ఉండే కాలంలో ఇక్కడ ఇంద్రేశ్వరాలయం ప్రక్కగా ఉండే స్థలంలో ఎప్పుడూ యజ్ఞయాగాలు జరుగుతుండేవి. వాటికి కావలసిన ద్రవ్యాలు గంగాపుర రాజభవనంనుండి వస్తుండేవి అని పూర్వులు చెప్పేవారు.

చాళుక్యులు మొదట జైనులైనా తర్వాత శైవులై ఆ మతాన్ని గూడ పోషించారు. శిల్పాన్ని గొప్పగా ఆదరించారు.

శ్రీ కార్తికేయశర్మగారు తమ గణపతి వ్యాసం-1976 సెప్టెంబరు భారతి-లో కిరీటాల్లోని గణపతి మూర్తులను పేర్కొన్నారు. అలాటి మూర్తులిక్కడ ఇంద్రేశ్వరాలయం దగ్గరున్నాయి.

చాళుక్యులు మాతృగణభక్తులుగాబట్టి వారి కాలంలో వెలసిన శిల్పాల్లో మాతృకామూర్తులు ముఖ్యంగా పేర్కొనదగినవి.

ఇక్కడ మాతృకా మూర్తుల్లో ఏకాంశిలపై మలచివవి

మొదటివి. ఇవి నల్లరాతివి. ఈ మూర్తులన్నిటికంటె సుందరంగానూ పవితనంగామా ఉన్నవి.

వానిలో మాహేశ్వరీ మూర్తి ప్రస్తుతం చెఱువు వెనకఉంది. శిల్పి ఈ దేవి కిరీటాన్ని పాముల అల్లికతో అతి సుందరంగా మలిచాడు. ప్రజలీ దేవిని ప్రస్తుతం "కన్నీటమ్మ" అంటున్నారు. మరొకదేవి గ్రామదేవతగా పూజలందుకుంటుంది. ఆమె సోదరీమణుల్లో ఇక తక్కిన వారెక్కడున్నారో తెలియదు.

ఈ గ్రామంలోని నాగ ప్రతిష్ఠ మరొక ప్రత్యేకత. పూర్వమిక్కడ సహస్ర నాగప్రతిష్ఠ ఉండేదట. ప్రస్తుతం ఇంద్రేశ్వరాలయం వెనుకగల చెఱువునిండా నాగశిల్పాలున్నాయి. నాగశిల్పాల్లో ఎన్నెన్ని భంగిమలున్నాయో అవన్నీ ఇక్కడ కనిపిస్తాయి.

శైవం తరువాత అన్నిచోట్లవలె ఇక్కడగూడా వైష్ణవం వ్యాపించింది. దశావతారాలతో కూడిన ఒక సుందరమైన విష్ణుమూర్తి నేడు చెఱువులోపడివుంది. ఈ గ్రామంలో మత విప్లవంతోపాటు మరేదో యుద్ధంకూడ జరిగిన చిహ్నాలున్నాయి.

ఇపుడు గ్రామాని కుత్తరంగా ఐతవోలు దారిలో ఓ వీరగల్లుంది. దానిపై ఉండే పురుషుడు కత్తి, డాలు ధరించి ఉన్నాడు. అతనికి "వీరలింగన్న" ప్రజావ్యవహారం. అతనికి కొద్దిపాటి దూరంలో సమాధివంటి ఓ శిథిల ప్రదేశముంది. దాన్ని ప్రజ అగ్గిగుండమని పిలుస్తారు. ఇపుడున్న గ్రామానికి తూర్పున భూగర్భంలో విపరీతంగా ఎముకలు దొరుకుతాయి.

ఈ విషయాలను సమన్వయం చేసిచూస్తే ఆ ఎముకల ప్రదేశం ఓ యుద్ధరంగం, ఆ వీరుడు ఆ యుద్ధంలో పాల్గొన్న యోధుడు, అగ్నిగుండం యుద్ధంలో మరణించిన వీరుల పత్నులు అగ్నికాహుతియైన ప్రదేశంకావాలి. కాని ఈ సంఘటనంతా చూచిన పూర్వ గామం నేటి గ్రామపు టడుగున సుమారు మూడు గజాల అడుగున విధ్వంసించిందికాబట్టి, ఆ యుద్ధం ఏ కాలంలో ఎందుకు జరిగిందో తెలిసికునే ఆధారాలింకా దొరకలేదు.

ప్రస్తుత గ్రామానికి భూగర్భంలో తూర్పువైపున ఎముకలే గాక కూజామూతులవంటి మట్టిపాత్రలు, దక్షిణ దిశలో శంఖాలు, పిండిరాతితో చెక్కిన ప్రతిమలు, పడమరగా గాజుపూసలు, గాజమోడ-దొరుకుతుంటాయి.

అంతేగాక అపుడపుడు త్రవ్వకాల్లో బయటపడిన శిథిలమైన మూర్తులు, ఇంకా ఇతర మూర్తులన్నీ గ్రామస్థులు చెన్నకేశవాలయంలో చేర్చారు. వాటిలో కొన్ని ఇటీవల జిల్లాలోని పిల్లలమర్రి ప్రదర్శనశాలకు కొని వెళ్ళారు.

గ్రామానికి నాలుగు వైపులల్లోగల ఆలయాల్లో ముక్కంటేశ్వరం ఇంద్రేశ్వరం మాత్రమే మిగిలాయి. తక్కినవి కూలి నేలలో పూడుకుపోయాయి.

ఇంద్రేశ్వరం ప్రక్కగాఉండే యజ్ఞభూమి నేడు దెందిరామచంద్రారెడ్డిగారి పొలమయింది.

ముక్కంటేశ్వరాలయం మండపం కప్పు కొంతభాగం విచ్చుకొని పోబడింది.

కాకతీయ సామంతుల పిమ్మట ఈ ప్రాంతాన్ని గంగాపుర మహత్యకర్త రెడ్డి రెడ్డి మల్లారెడ్డి వంశీయులు పాలించారు. ఆ మల్లారెడ్డి రెండోకుమారుడు అక్కారెడ్డి నాగర కందమూలు నతిమకు వచ్చినట్లు గంగాపుర మహత్య పీఠికలో శ్రీ సురవరంవారు చెప్పారు. రెడ్డి రెడ్డి బూరుగునుండి ఈ ప్రాంతానికి వచ్చి మొదట ఇందకల్లులోనే నివసించారు. అప్పుడు వారి అధీనంలో అరవై గ్రామాలుండేవి. అక్కడినుండి వారు యాదరెడ్డి పల్లెకు, అక్కడినుండి తాడూరికి వెళ్లారు.

తాడూరిలో స్థిరపడిన పిమ్మట వారికక్కడ ఒక ఆలయం నిర్మించాలని సంకల్పంకలిగి ఇందకల్లులో ఆలయాలు చాలా ఉన్నాయి గదా! ఒకదాన్ని విప్పి ఇక్కడికి తెచ్చుకుందామని భావించి బండ్లతో వెళ్లి ముక్కంటేశ్వరాలయం కప్పు కప్పుకడీలు కొన్ని తీసుకువెళ్ళారు.

వారాలా తమ గ్రామాల యంచుకు వెళ్లటంచూసి గ్రామస్థులు కళ్ళు తెరచి వారు రెండవ తడవ వచ్చేవర కాటంకపరచారు. అంతటితో ఆ దొరలాపని విరమించుకొని వానితో నిమిత్తంలేకుండానే తమ గ్రామంలో ఆలయం కట్టుకున్నారు. ఈ సంఘటనతో ఆలయానికేర్పడిన వెలితిమాత్రం అలాగే మిగిలిపోయింది.

గ్రామస్థుల అభిప్రాయం ప్రకారం పూర్వగ్రామం క్రింద ప్రస్తుత గ్రామం చాలావరకు విరివిడుంది. త్రవ్వకాలలో అపుడు ఆ వెనకటి గదులు, గోడలు, పొయ్యిలు, కుండలు మొదలైనవి చెక్కుచెదరకుండ కనిపిస్తుంటాయి. అంతేగాదు అక్కడక్కడ శిల్పాలు గూడ కనిపిస్తుంటాయి గాని సామాన్యులు వాటిని వెలికితీస్తే ఆ దేవతలకోపమొస్తుందేమోనని జడుసుకుంటుంటారు. కాబట్టి ఇది పురాతత్వశాస్త్రజ్ఞులు తప్పకుండ చూచి పరిశీలించవలసిన ప్రదేశం.



# పంచపాత్ర

## కే ఎ స్వీ

### 6

### (గత సంచిక తరువాయి)

అబ్బో! ఎన్ని చిత్రాలు! ఎన్ని దృశ్యాలు! నలుపు తెలుపులవి! రంగు-రంగులవి! రకరకాలవి! చిన్నవి-పెద్దవి!

ఫేడౌట్ అయిపోతూ అయిపోతూ చిన్నప్పటి పరిచయస్థుల ముఖాలు .....

బంతాటలో బోర్లపడిపోయి మోకాలు గీసుకుపోయిన ఎర్రటి రక్తం...

తలి ముఖం తండ్రిముఖం ఎందుకు గుర్తొస్తుందో గాని—కూటిమాటికీ మధుర ఆలయంలో మీనాక్షిదేవి ముఖం...

వెల్లెలి గయ్యాళిముఖం...ఎత్తుపళ్ళతో సహా...

వొకానొక కుష్ఠురోగి కురుపుల ముఖం...

ఏదో పెళ్ళిలో ఏదో గదిలో పెట సర్దుకుంటూ స్తనాలు బహిర్గతం చేసిన స్త్రీ—ముఖం గుర్తులేదు...

సినిమాల్లో సెక్సు దృశ్యాలు-ఎన్నెన్నో ...... అందమైన మాంసం—స్త్రీ మాంసంలో వొంపు-బరువు-వికృతపు మెరుపు-వాళ్ళ నవ్వుల కృత్రిమత్వంతో సహా అచ్చుపడిన కొన్ని ఘట్టాలు-స్నాన ఘట్టాలు—పడకటింటి దృశ్యాలు...

ఎవరో స్నేహితుడింట్లో వొక స్త్రీ మేడపైనుంచి కాలుజారి పడిపోయిన దృశ్యం...ఆమె తలమీద రక్తం—

మోటారుకారు ప్రమాదంలో బుర్ర చితికి చచ్చిపడిన పిల్లవాడి శవం—రక్తం—

ఎక్కడిదో తెలీదు-ఇళ్ళు కాలుతూన్న దృశ్యం—మంటల ఎరుపు-రక్తంలాంటి ఎరుపే!......

స్ట్రెచర్ మీద ఎవర్నో తీసుకెళ్తున్నారు

కుక్కపిల్ల కంట్లో అసహ్యమైన పుసి

థియేటర్‌లో వొకసారి పక్కన కూచున్న కళ్ళజోడు యువతి (ఇప్పుడెక్కడుందో—) అద్దాలుమాత్రం బొమ్మలో వున్నాయి. ముఖం అసలు లేనే లేదు......

బిగుతుగా చీరె ధరించి వంకర టింకరగా నడిచిన పదేనిమిదేళ్ళ పిల్ల

హెడ్‌క్లర్కు వరదరాజులుగారి రెండో పెళ్ళాం రొమ్ములు...

కిరసనాయిలు క్యూ

న్యూస్ రీల్లో ఇందిరా గాంధీ

లంచమివ్వడానికొచ్చిన పెద్దమనిషి కళ్ళలో కంగ్రతీతనం

కూరగాయల మార్కెటులో కొత్తిమిర అమ్మే స్త్రీ ముక్కుమీద పెద్ద పులిపిరి మచ్చ

"ఇక్కడ కాగితములు అంటించరాదు" గోడమీద బోర్డు

"ఇక్కడ ఉమ్మిపోయరాదు—" అదీ వొక బోర్డే

"నో వేకెన్సీ-" అది బోర్డు కాదా మరి

"అప్పలేదు" పవారి కొట్టులో ఎప్పుడూ వెక్కిరించే బోర్డు.

స్కూటర్ మీద వెళ్ళే పిల్ల వేసుకున్న బర్మాముడి.

కూలిన వొంతెన ఎలెక్ట్రిక్ షాక్‌తిని చచ్చిపోయిన ఆడమనిషి మెటర్నిటీలో వరుసగా పసికందుల ముఖాలు-ఓ! అన్నట్టు—ఎన్ని సూర్యోదయ / సూర్యాస్తమయాలు-మబ్బుల్తో సరసాలాడే చంద్రయానాల రమ్యదృశ్యాలు...కొబ్బరాకులమీద వెన్నెల మెరుపులు—అప్పుడెప్పుడో కాలేజీ దినాల్లో స్నేహితురాలు (!)-రైల్వే స్టేషన్‌లో వీడ్కోలు-చెయ్యూపుతూ దూరమైపోయిన ఆనాటి ఆ దయామయి జాలినిండిన ముఖం...మరిచిపోవడానికి వీలులేదు వీలేలేదు-దినానికో రకంగా మారుతూ చంద్రకాంత్‌కే ఎప్పటికప్పుడు వింతగా కనిపిస్తూ వచ్చిన చంద్రకాంత్ ముఖం......

...అద్దంలో చంద్రకాంత్!!! ...

ఎన్ని దృశ్యాలని! అలా ఎన్ని దృశ్యాలని!—

నవ్వించి కవ్వించి ఏడ్పించి వుసిగొలిపి లాలించి బుజ్జగించి వోదార్చేవి-అన్నీ-అవి అన్నీ దృశ్యాలు......

చంద్రకాంత్ కళ్ళు కెమిరా లెన్సులుగా పనిచేసి అతని మనసనే ఫిల్ముమీద మాంత్రిక చిత్రాల్లా ముద్రించుకుపోయినవి—అవే దృశ్యాలు!!



*

చంద్రకాంత్ గురించిన చంద్రకాంత్‌కే తెలియని నిజాలకి అవే సాక్ష్యాలు! ప్రబల సాక్ష్యాలు!!

మెదడు కాలిపోతోంది, చంద్రకాంత్ మనసుతో నా మన సుకి జ్వరం తగిలింది. ఇహ తట్టుకోలేక చంద్రకాంత్ మనసుని మరీ లోతుగా పరీక్ష చెయ్యడం (!) ఆపేసేను. చం. కాం మనసుని మళ్ళీ ఆ పసుపురంగు మైనపు కాగితంలో పెట్టి జాగ్రత్తగా కట్టే సేను. నవల రాసే రాస్తాను. లేకపోతేలేదు ఆ మనసున్నేను మళ్ళీ స్వంత దారుడికి చేర్చకపోతే-పాపం, అతనేమైపోవాలి ?!

"హమ్మయ్య" అనుకుంటూ కొత్త సిగిరెట్టు వెలిగించేను.

చంద్రకాంత్ మనసు గురించే ఆలోచిస్తూ వున్నాను. చైతన్య స్రవంతిలో రాయాలనుకుని చాలా రోజులుగా నేను వాయిదా వేసు కుంటూ వొస్తూన్న నవలకి చంద్రకాంత్ మనసుని వస్తువుగా ఎంచుకుంటే ?

ఆలోచిస్తూనే వుండగా గడియారం తొమ్మిది గంటలు కొట్టింది.

కిటికీలోంచి వగరం కనిపిస్తోంది. దీపాల నగలతో నవ్వుతూ పిలుస్తోంది.

వెళ్ళి అలా తిరిగిరావాలని వుంది. కాని, ప్పూఁహుఁ - తల దిమ్ముగా వుంది. మెదడంతా పింజలు పింజలై తేలిపోతూ తూలిపోతోంది...

భోంచేసే వోపికకూడా లేదు.

అసలు ఆకలే లేదు.

పక్కమీద వాలేసరికి నల్లగా మెత్తగా మత్తుగా వొచ్చి వాలింది నిద్ర. కావలించుకున్నాను. అంతే! రాయిలాగా నిద్రపోయేను......

ఏదో పురుగు దొలుస్తూంటే వులిక్కిపడ్డాను. చెవులో దూరింది పురుగేదో అనుకుంటూ చెవులో చిటికెన వేలుదూర్చి గెలికొట్టి చూసేను. అప్పుడే తెలిసింది-నన్ను మేలుకొల్పిందొక పురుగుకాదని వొక రింగ్ రింగ్ మనే శబ్దం నాచెవిలోకి పురుగులా దూరిందని... ...

రింగ్ రింగ్‌మని మ్రోగుతూనేవుంది టెలిఫోన్.

బెడ్‌లైట్ స్విచ్ నొక్కి వాచీ చూసుకున్నాను. ఒకటిన్నర.

ఇంతరాత్రివేళ నాకు ఫోన్లు ఎక్కణ్ణుంచీనూరావు. ఇదేదో రాంగ్ నంబరే అయి వుంటుందనుకుంటూ రిసీవరెత్తి అతి ప్రయత్నం మీద (అంత గాఢనిద్రలో వున్నాను మరి - ) చెవికి ఆన్చుకుంటూ "హల్లో !..." అన్నాను.

అవతల్నుంచి ఉలుకూ పలుకూలేదు. వొళ్ళు మండింది. రిసీవర్ పెట్టేద్దామనుకుంటూనే "హల్లో" అన్నాను మళ్ళీ.

"హల్లో" — అంది అవతల్నుంచి వొక తియ్యని కంఠం. తియ్యటి స్త్రీకంఠం.

నాకు ట్రంకాల్స్ ఎక్కణ్ణుంచీనూ రావు. పోగా, నాకు ఫోన్‌చేసే స్త్రీ పరిచయస్తులు లేరు ఇది తప్పని సరిగా రాంగ్ నంబరే అనుకుంటూ "ఆనందరావ్ స్పీకింగ్—" అన్నాను, అవతలావిడే ఫోన్ పెట్టేస్తుందన్న ఆశతో.

"ఎవరన్నారూ ?—" అంది ఆ స్త్రీ కంఠం. చిన్నప్పట్నుంచి గులాబ్‌జామ్‌లే తిన్నట్టుగా వుంది. అంత తియ్యగావుంది గొంతు.

"ఆనందరావు - కె. ఆనందరావు—" అన్నాను అసహనంగా— అంత తియ్యటిగొంతు విన్నప్పటికీ అసహనం వదల్లేదు (అంతగాఢ నిద్రలో వున్నాను మరి—) "మీకెవరు కావాలి ?—"

"మీరే కావాలి—" అంది ఆ స్త్రీ, స్పష్టంగా.

అదిరిపడ్డాను.

1976 సంవత్సరపు జోకేమిటి ? వొకటిన్నరకి — రాత్రి వొకటిన్నరకి ఫోను—నువ్వే కావాలనే స్త్రీ !

"ఆనందరావంటే— కె. ఆనందరావుని నేను కథలవీ రాస్తుం టాన్లెండి—" అంటూ నా అడ్రెస్ చెప్పేను—"బహుశా మీక్కావలసిన ఆనందరావు వేరే వున్నారేమో !—" అన్నాను.

"నో - నో - మీరేకావాలి—"

"క్షమించాలి - మీరెవరోకూడా నాకు తెలీదు—"

"దానికేం ? మీరెవరో నాక్కూడా తెలీదు—"

"మరి - "

గలగల గలగలమని నవ్వింది. "ఇంతకుముందు తెలీకపోతే ఇప్పుడు తెలుసుకోకూడదూ ?—"

"తెలుసుకోవొచ్చు. తప్పులేదు. కాని, ఇదేమిటి ? — అర్ధ రాత్రి—టెలిఫోన్‌మీద—మీరెవరో నాతో హాస్యాలాడుతున్నారు—"

"వూఁ - వూఁ -" అంటూ అలాగే సాగదీసి ఆపుకోలేక గలగలా కెరటాలు కెరటాలుగా నవ్వేసింది—"ఐలైక్యూ! ఐలైక్యూ—ఆనంద రావ్ !..." అంది జీరగొంతుతో.

ఇదేదో అసాధారణ పరిస్థితని తేలిపోయింది.

"ఇంతకీ-మీరెవరో చెప్పనేలేదు—"

"రంజని, రాజేశ్వరి, సుమిత్ర, కాదంబరి, సుప్రియ, కృష్ణ వేణి, మంజుల, లత, అనిత, వనిత, వినత, వూఁ ... (నవ్వు)... వీణ, వాణి, రాణి...మీ ఇష్టం—ఏపేరుతోనైనా పిలవండి—పలుకు తాను—"

ఈవిడెవరో గడుసుమనిషని అర్థమైంది— !

"సరే — నాకే విందుకు ఫోన్‌చేసేరిప్పుడు మీరు? ఎక్కణ్ణుంచి మాట్లాడుతున్నారు? అసలింతకీ-వ్హాట్‌కెన్నైడూ ఫర్యూ?—"

"ఎన్ని ప్రశ్నలు!..."

"వొక్కొక్క ప్రశ్నకే సమాధానం చెప్పండి చాలు..."

"వూఁ—" అంటూ నోరు తెరవకుండానే నవ్వింది — "నిద్ర పట్టలేదు. చేతికొచ్చిన నెంబరు డయల్‌చేస్తూవున్నాను. ఎవ్వరూ రిసీవ్ చెయ్యలేదు పది పదహేను కాల్స్- వూహూఁ - లిఫ్టింగేలేదు. మీరొక్కరే 'హల్లో' అన్నారు చివరికి. ఇంత పెద్ద రాత్రిలో - ఇంత నల్లని నగరంలో మీరొక్కరే "హల్లో" అంటే "హల్లో" అన్నారు. ఐసీ—ఐలైక్యూ-బలైక్యూ-"

"ఎక్కణ్ణుంచి-ఫోన్ చెయ్యడం?"

"ఇంటనుంచే-మా ఇంటినుంచే-బెడ్ రూంనుంచే-"

"సరే-హల్లో-అన్నాను. అంతే చాలా? ఇంకా ఇప్పుడు నేను మీ గురించి చెయ్యగలిగిందుందా?—"

"మంచి నిద్దర్లో వున్నారు కాబోలు-"

"వూఁ—" అన్నాను నిద్రను అభినయిస్తూ.

"నాకోసం కాస్త నిద్ర వాయిదా వెయ్యలేరూ?—"

"ఎందుకూ?—"

"మీరు వెంటనే బైల్దేరి రావాలి—"

"గాడ్! ఎక్కడికి?—"

"ఉలిక్కిపడనక్కర్లేదు. మా ఇంటిక్కాదులెండి ... సిటీ పార్కు దగ్గిరేగా మీరుంటున్నది...ఆ పక్కనే టవర్ క్లాక్ దగ్గిరికి పావుగంటలో రావాలి మీరు..."

"ఎందుకు?—"

"వొస్తే చెప్తాను?—"

"అసలు మీ పేరు?—మీ ఫోన్ నంబరు"

"ఆఁ-ఈ డిటెక్టివ్ బుద్ధులన్నీ నాకు తెలుసులే! కాని, నీకు ధైర్యముంది కదా?-"

"బోలెడు—" 'మీకు' అనేదల్లా 'నీకు' అంటోండడం నేను గమనించకపోలేదు!

"అయితే పావుగంటలో టవర్‌క్లాక్ దగ్గిరికి వొచ్చెయ్యి వో. కె?-"

ఇదేదో-ఈ తమాషా చూడాలని నాకూ వుంది. కాని, నిద్ర?

"వో కె?—" అన్నాను-నా మటుకు నేను ఎటూ నిర్ణయించుకోకుండా.

"థేంక్యూ-" అని ఫోను పెట్టేసింది ఆవిడ.

నేనూ ఫోను పెట్టేసేను.

కాని, సగం నిద్ర నుంచి లేచొచ్చిన పక్కవేపు చూసేసరికి నిద్ర మళ్ళీ ముంచుకొచ్చింది.

ఈ టెలిఫోను యువతెవరు?

కొంపదీసి ఇంకో పాత్ర కాదుగదా! నిద్రకూడా మానుకుని పాత్రల గురించి తలబద్దలు కొట్టుకుంటే నేనేం కావాలి?

మళ్ళీ నిద్రపోవడానికే నిశ్చయించుకున్నాను. అంతలో—

మళ్ళీ రింగ్ రింగ్‌మంది టెలఫోన్!

"హల్లో" అన్నాను.

"ఆనందరావ్!?—"...ఆవిడే!

"అవును—"

"నిద్ర కంటిన్యూ చేసేద్దామనుకుంటున్నావ్ కదూ?—" అంది.

ఎలా కనిపెట్టేసింది? టెలిపతీగాని వుందా?

''ఎలా కనిపెట్టేసే ననుకుంటున్నావ్ కదూ? నాకేం తెలి ఓతి లేదులే..కాని, నీతో అయిదు నిమిషాలసేపు టెలిఫోన్‌మీద మాట్లాడి-నీ బుద్ధి కనీసం ఆమాతం కనిపెట్టలేనూ?-''

ఇది మరీ విడ్డూరం. అబద్ధాలెందుకని నిజమే చెప్పేను-

''మీరు చెప్పింది నిజమే-నిద్రపోదామనుకుంటున్నాను-

''నువ్వు నన్ను మీరనడం బాగులేదు. మర్చిపోయేవా?- మనం ఏడున్నర నిమిషాలనుంచీ స్నేహితులం.. చనువుగా పిల్చుకోడానికి ఆ మాత్రం పరిచయం చాలు ... ఇహపోతే- చూడానందరావ్... ఇంకో పది నిమిషాల్లో నువ్వు టవర్‌క్లాక్ దగ్గరికి రాకపోతే రేపు ఈవినింగ్ ఎడిషన్లో వొక స్త్రీ ఆత్మహత్య గురించి చదువు కుంటావు..నేను ఇంతవరకు ఎప్పుడూ మాటతప్పలేదు-''ఆమె ఫోను పెట్టేసింది.

ఇహ తప్పేట్టు లేదు. ఇంతవరకు ఆమె చేసిన పనులేవీ సవ్యంగా లేవు. ఇకపైన అపసవ్యమైన పనులు చెయ్యకుండా వుంటుం దని హామీ ఏమీలేదు. నేను వెళ్ళకపోతే ఆత్మహత్య చేసుకున్నా ఆశ్చర్యంలేదు అదీగాక, ఈ విచిత్ర వ్యక్తిత్వం ఏమిటో చూద్దామని నాకూ వుందికదూ? పైజమ్మామీద లాల్చీ తొడుక్కుని సిగిరెట్టు ప్యాకెట్టూ లైటరూ తీసుకుని గదికి తాళం పెట్టేను. చిడీలు దిగు తూంటే చలిగాలి జవ్వ్వుమని లాగికొట్టింది. పళ్ళు పీకేయి. సిగి రెట్టు లిగించి రోడ్డెక్కి నడక సాగించేను......

టవర్‌క్లాక్ దగ్గరికెళ్ళి ిల్చున్నాను.

రెండు కావొస్తోంది!

ఆమె ఎక్కడుంటోంది? ఎలా వొస్తుందిక్కడికి? అస లొస్తుందా రాదా?

కొంపదీసి ఇదంతా ఒక ప్రాక్టికల్ జోక్ కాదుగదా!

ఎవరికి చెప్పినా ఎవరూ నమ్మరు.

హాస్యాస్పదం. అసంబద్ధం.

నా ప్రక్కగా కారొచ్చి ఆగింది. నల్ల ఫియెట్. నావేపు తలుపు తెరుచుకుంది. 'గెటిన్ ప్లీజ్''-ఫోన్‌లోనైనా బైటైనా ఆగొంతును అవలీలగా గుర్తుపట్టొచ్చు.

కూచున్నాను. కారు కదిలింది.

''ఎలా గుర్తుపట్టేరు నన్ను!?-'' అన్నాను, ఆమెవేపు చూడకుండా.

''ఎదురుచూసే మనుషులెలా వుంటారో నాకుతెలుసు''-అంది. ''మాటప్రకారం వొచ్చినందుకు నీకు మెనీ థేంక్స్ - మనిషనే తోడు లేక పిచ్చిపట్టినట్టుంది... నువ్వురాకపోతే సూయిసైడ్ ఎలా చేసు కోవాలా అని ఆలోచిస్తున్నాను...'' చాలా సిన్సియర్‌గానూ సీరియస్ గానూ అంది.

ఆశ్చర్యపడ్డం, ఆశ్చర్యపడ్డట్టు కనిపించడం-రెండూ మాను కున్నాన్నేను.

''నీకు మరీ ఇబ్బందయితే-వెళ్ళిపో!-'' అంది కారు వేగం తగ్గిస్తూ-...నా ముఖభావం గమనించిందేమో!

''అబ్బే-లేదు-'' అన్నాను.

''వూహూం-మాటప్రకారం వొచ్చేవుగా-అంతేచాలు - ఇంక నువ్వు వెనక్కి వెళ్ళిపోయినా నేను ఆత్మహత్య చేసుకోను-''అందామె.

నవ్వొచ్చింది నాకు.

నేను కాఫీ తాగను-నేను కాఫీ తాగుతాను-అన్నంత సులువుగా -నేను ఆత్మహత్య చేసుకుంటాను... నేను ఆత్మహత్య చేసుకోను- అంటోంది ఆమె.

''ఏం నవ్వుకుంటున్నావూ?...'' అంది.

''ఏమీలేదు''-అంటూ ఆమెకేసి తిరిగేను.

ఆశ్చర్యం.

ఆమె అద్భుత సౌందర్యవతి.

జరీఅంచు నల్లచీర. నల్ల రవిక, బన్ పెట్టకుండానే చుట్టిన కొప్పు.

కాటుకలేదు. లిప్‌స్టిక్ లేదు. మెడలో ఏమీలేదు. కుడిచేతికి స్క్వేర్ వాచీవుంది. ఇంకే ఆభరణాలూ లేవు.

ఏ ఆభరణాలూ ఇవ్వలేని సహజ సౌందర్యం ఆమెలోవుంది. లక్షలమంది ప్రేక్షకులచేత ఆరాధింపబడే సినిమా తారలు ఆమెముందు దిగదుడుపు.

''నేను అందమైనదాన్ని-'' అందామె. నన్ను కనిపెట్టింది.

ఎలా ఈవిడతో?

ఈవిడముందు ఆలోచించినా ముప్పే!

''అంతేకాదు-నీకు తెలివికూడావుంది-''అన్నాను.

''థేంక్స్ నన్ను మిత్రుణ్ణిగా - నువ్వు - అని పిలిచేవు, ఐలైక్యూ ... ...''

''నువ్వనుకుంటున్నంత విచిత్రంగా లేదిదంతా నాకు...''

''ఆ సంగతి నాకుతెలుసు-'' అంటూ నవ్విందామె-''నువ్వొక రచయితవి కదూ?-''.

''తెలిసే ఫోన్ చేసేవా?-''

''ప్లీజ్ నమ్మునన్ను-ఇందాకా వస్తూ ఆలోచించేను-అవును- కె. ఆనందరావ్-నీ కథలు చదివేన్నేను-''

నిర్జనమైన వీధులగుండా దర్జాగా వెళ్తోంది కారు. ఆమె హేలగా అవలీలగా డ్రైవ్ చేస్తోంది. ఎక్కడికని నేనడగలేదు

మనిషి జీవితంలో మరవురాని సంఘటనలు కొన్ని, రచయితగా నా జీవితంలో మరవురానిది ఈ ఘట్టం. ఇంత అందమైన ఈ స్త్రీ అసలు నా కథ అచ్చయిన పుస్తకాన్ని ముట్టుకోవడమే నాకు గొప్ప. నన్ను తన ఫ్రెండని పిలిచి అర్ధరాత్రివేళ తనతోబాటు కార్లో తిరగ మని అడిగితే ? – నాకేం ?–ఎక్కడికైతే నాకేం ?

"నీ కథలేం బావుండవు–" అందామె, కారు మలుపు తిప్పుతూ–

ఆ మాటతోనాకు అగాధంలోకి పడిపోయినట్టనిపించలేదు.

తిరస్కారాలు నా కలవాటే !

"థేంక్స్ !–" అన్నాను సిన్సియర్‌గానే !

"యు ఆర్ నాటీ !..." అందామె పల్వరుస కనిపించేలా నవ్వుతూ. "నీ కథల్లో మసాలా తక్కువ. అంటే తెలుసుగా......"

"సెక్సు–"

"అంతేకాదు – ప్రేమ – త్యాగం – అభిమానం - మమత – మమకారం – ఇవన్నీ వుండాలి. ఈ భావాలుకాదు. ఈమాటలున్నా చాలు... ...నువ్వు హిటయిపోతావు... ..."

"నా కథలగురించి మాట్లాడకు – నీగురించి చెప్పు–నీ పేరేంటి ?–"

"నువ్వే పేరుపెట్టు–నేను పలక్కపోతేవొట్టు–"

"రూప " అన్నాను.

"మంచిపేరు. కాని నాకిష్టంలేదు – ఎందుకని అడక్కు– నువ్వలాగే పిలు...నీకోసం నేను పలుకుతాను..."

"థేంక్స్ !–"

సెకండ్‌షో జనాన్ని చీల్చుకుపోయింది కారు. "ఎక్కడికి తీసుకెళుతున్నానని అడగవేం ?–"

"నీకే తెలీదని నాకు తెలుసు–"

"ఇలా చెప్పకుండానే అన్నీ తెలిసిపోతే ఎన్ని చిక్కులు!–"

"ఏం చిక్కులు!?"

"అదీ నీకు తెలుసు–"

"సరే–నీ మీద నవల రాయనా ?–"

"అంతకన్నా–నన్ను ప్రేమిస్తాననరాదూ?–వొక్కసారిగా–"

"నీకు పెళ్ళయిందనుకుంటాను–"

"కాలేదు. కాని అయినట్టే లెక్క–"

పెళ్ళి ప్రసక్తితో ఆమెలో విచిత్రమైన మార్పొచ్చింది.

"ఆయన-అంటే రాజాగారు-సరదా పురుషుడు. వాళ్ళూర్లో సంసారం వుంది. నెలకో మూడ్రోజులు సిటీకొచ్చి నాతో వుంటా డంతే...అందుకోసం నాకో బంగిళా ఇచ్చేడు, కారిచ్చేడు, బ్యాంకులో అకౌంట్ కూడా..."

"లక్షాధికారి కాబోలు–"

"కేవలం పలుకుబడితో పదిమంది లక్షాధికార్లను కొన గలడు- అదృష్టవంతురాల్నికదూ నేను?..."

"అయిస్తే అదృష్టమే...!"

"కాని ఆయనకిది లాభంలేని బేరం...అయినా అదేమిటో -మోజు...ఆయన లేనప్పుడు అంతా నా యిష్టం...ఏం చేస్తానో ఎలా వుంటానో ఆయన అడగరు-పట్టించుకోను గూడా పట్టించు కోరు-కాని, వేరే ఎవర్తోనూ నా కవసరంలేదు-ఇష్టమూలేదు–"

ఆలోచిస్తున్నాను.

"సిగిరెటుందా?–" అని అడిగి నా దగ్గర్నుంచి తీసుకుంది.

లైటరుతో నేనే వెలిగించేను.

అందం ఆమె ప్రతి కదలికలోనూ వుంది.

నిజానికి అసలైన అందమేదో ఆమె లోపల-ఆమె మనసులో వుంది!

ఎందుకోగాని సడెన్‌గా మా మధ్య మాటలు ఆగిపోయేయి.

కారు చేసే శబ్దంతప్ప ఇంకే శబ్దమూలేదు.

సిగిరెట్ పొగ ఆమె అతి నాజూగ్గా వొదుల్తూ మధ్యమధ్యన తనతో లాను నవ్వుకుంటోంది. నా ఉనికిని మర్చిపోయిందా? అనిపిం చింది కొంత సేపు.

మెయిన్ రోడ్డుమీద అటూ ఇటూ దీపాలు జిగేల్ జిగేల్మని వెలుగుతున్నాయి.

తారురోడ్డు మెరుస్తోంది. నల్లటి తారురోడ్డు.

కారు మెరుస్తోంది. నల్లటి ఫియెట్.

రూప చీరె మెరుస్తోంది. నల్లటి చీరె.

ఆ చీరెలో ఆమె నల్లరాతి శిల్పంలా వుంది.

నాగినిలా వుంది.

వున్నట్టుండి కారు స్పీడ్ హెచ్చించింది రూప.

అకారణమైన వేగం.

నాకు భయం వెయ్యలేదు. కాని, ఆమె ప్రవర్తన అంతు పట్టక ఆశ్చర్యపడ్డాను.

స్టేడియం దాటొచ్చేక అప్పుడు స్పీడు తగ్గించింది రూప.

సిగిరెట్టు పీకని నాజూగా నిదానంగా అవతలికి గిరాటెట్టింది. నా కేసి తిరిగింది నవ్వింది.

"ఏమైనా మాట్లాడకూడదూ?-" అంది.

"ఏం మాటాడను? నువ్వే ఏదైనా చెప్పు..."

"భరించగలవా?-"

"అంత విషాదమా? లేక-అంత వినోదమా?-"

"భరించలేనంత బోరు-"

"బోరయితే భరించడం కష్టమే! నీకు అయినవాళ్ళెవరూ లేరా?-రాజుగారు తప్ప-"

"అయినవాళ్ళు - వున్నారు. వాళ్ళకి నేను లేను. చచ్చి పోయేను-"

"అదెలా గు-"

"రచయితవి. వూహించు"

వూహించడాన్ని అభినయించేను. "వూహూ - అందలేదు"

"అందనిదె తే వొదిలెయ్యి-"

"నువ్వు తాగుతావా రూపా?-"

"ఎందుకొచ్చింది అనుమానం?-"

"నీకు తెలుసు-ఏ అనుమానం ఎందుకొస్తుందో.."

"నీతో మాటాడుతూంటె నాతో నేను మాట్లాడుకుంటు న్నట్లుంది ఆనందరావ్....నీతో అబద్ధాలు చెప్పను నేను. సిగిరెట్లు-ఎల్. ఎస్. డి... ... అంతకుమించి దురలవాట్లు లేవు నాకు..."

"నిజానికి దురలవాటు అనేవి లేవేమో! మంచీ చెడూ నీతి అవినీతీ-న్యాయం అన్యాయం వీటిలాగే దురలవాట్లు-మంచి అల వాట్లు-ఇవీ రిలెటివ్ టెర్మ్స్ అనుకుంటాను-"

"... ... ... ... ..."

"వొకందుకు నాకు సంతోషంగానూ ఈర్ష్యగానూ వుంది రూపా!...స్త్రీవైనా నీకు కావలసిన స్వేచ్ఛ వుంది-"

"నా బానిసత్వం ఎలా తెలుస్తుంది నీకు?-"

"ఎలాంటి బానిసత్వం?-"

"ఆత్మ శరీరానికి చేసే బానిసత్వం-"

"శరీరమే ఆత్మకి బానిస కదూ?-"

"ఆత్మ బలే మాట!..."

"ఫిలాసఫీ చదివేవా రూపా?-"

"ఫిలాసఫీ 'చదివే' వాళ్ళు ఫిలాసఫీ స్టూడెంట్సు మాత్రమే! .. అసలైన ఫిలాసఫీ జీవితమే నేర్పుతుంది..."

"ఏం నేర్పింది నీకు జీవితం?-"

"ఇంకా నేర్పుతోంది-"

"పోనీ ఇప్పటిదాకా-"

"నువ్వేమీ నేర్చుకోలేదు-అని నేర్పింది-"

"బానిసత్వమన్నావు - అది పోవడం యెల్లాగమా?"

"బానిసత్వం పోవడమంటూ యెప్పుడూలేదు...బానిస విధానం మారుతుంది. వాతావరణం మారుతుంది. దుస్తులు మారతాయి..."

నగరం శివార్లలోకొచ్చేం. కారాపింది రూప.

కళ్ళు చిట్లించి వాచీకేసి చూసుకున్నాను.

మూడుగంటలు.

"దిగి నడుద్దాం రా..." అంది రూప. తను దిగింది. నేనూ దిగేను.

నల్లటి తారురోడ్డు అటూ ఇటూకూడా చీకట్లోకి కలిసిపోతోంది.

ఆకాశంలో నక్షత్రాల ధగధగ.

కీచురాళ్ళ ధ్వని.

దూరంనుంచి నగరం చీకటి సముద్రంలో దీపాల వడవలా వుంది.

రోడ్డు దిగి నడవసాగింది రూప. అది ఆమెకి అలవాటైన ప్రదేశంలా ఆమె ప్రవర్తిస్తోంది. కాని, ఆమె అంతకుముందు అలా అక్కడికెప్పుడూ రాలేదని తెలుస్తూనేవుంది. కొంతసేపటి వరకూ కళ్ళు చీకటికి అలవాటు కాలేదు.

"నీగురించి ఇంకేమీ చెప్పలేవా, రూపా?-"

"చెప్పగలను. చెప్పను."

"ఏం?-"

"చెప్పకుండుక్కాదు జీవితం -"

"రహస్యమా జీవితం?-"

"అందరికీ తెలిసిన అతిరహస్యం-"

నడిచి నడిచి వొకచోట ఇసుకలో కూలబడింది. "ఇహనే నడవలేను-"

చీకట్లో ఆమె కళ్ళు తప్ప ఇంకేమీ కనిపించడంలేదు. మసక వెన్నెలుంది మరీ హీనంగా. ఆమె బుగ్గమీద మెరవన్నైనాలేదు.

ఏమీ మాట్లాడలేదు నేను.

"చలిగావుందా ?" అంది రూప. "కారో వెనకసీట్లో శాలువా తీసుకునే వొచ్చేను-పోయి తీసుకురానా ?-"

"వొద్దు-"

మళ్ళీ నిశ్శబ్దంగా వుండిపోయింది రూప.

వున్నట్టుండి- "నువ్వింకా పెళ్ళెందుకు చేసుకోలేదు ?-" అంది.

చేసుకోలేదని మాత్రం ఆమెకు రూఢే!

"అమ్మాయి దొరకలేదు-"

"ఎలాంటిది ?-"

"అందంగా వొద్దు-డబ్బుతో వొద్దు - సాధువొద్దు నన్ను ప్రేమించేది-"

"అంటే ?-"

"నాకు చలేసుందేమోనని నన్ను అడక్కముందేకూడా నాకోసం శాలువా వెంటతెచ్చేది-"

"వెంటతెచ్చీ-ఇవ్వకుండా వుండే నాలాంటిది?-"

"నువ్వప్పుడే ఎందుకివ్వలేదో నాకు తెలుసు"

"ఆనందరావ్‌జీ!-ఐ లైక్ యూ...ఐదేళ్ళ క్రితం అయితే బహుశా నిన్నే పెళ్ళాడేదాన్ని"

"నక్షత్రాలు చూడు-" అన్నాను పూర్తిగా సమ్మంధం లేకుండా మాట మార్చి- "ఓరియన్ అంటే నా కిష్టం-"

"జీవిత సమస్యల్ని మృత్యువు పరిష్కరిస్తుందంటావా ?-"

"జీవితం అసలొక సమస్యకాదు. వొక కళ. బాగా బ్రతికే వాళ్ళందరూ మంచి ఆర్టిస్టు లన్నమాట..."

"మరి-నామాట ?-"

"నామాటే నీమాటాను - మనం తపస్సు చెడిన కళాకారులం-"

"కారణం ?-"

"కళని మరీ స్వచ్ఛంగా బ్రతకాలనుకోవడమే !-"

"కళనే బ్రతకడమా ?-"

"అవును"-

ఈదురుగాలి వీస్తోంది చీరెని భుజాలచుట్టూ తిప్పి కప్పుకుంది రూప. జరీ బోర్డర్ మెరిసింది. "పాటలొస్తే పాడు-" అంది.

"చచ్చిపోయేప్పుడు తప్ప-పాడను-అదే ఆఖరు సంగీత ప్రయత్నం..."

సరిగ్గా నా పాలసీ..."

అలా నా ప్రతి మాటకీ బదులు చెపూ నే వుంది రూప. నవ్వడంలేదు. చిలిపిగా మాటలు నాన్చడంలేదు. నగరంలోని రూపకూ నగరం శివార్లలోని రూపకూ పోలికేలేదు!

నీ మీద నవల రాస్తానేమో!–" అన్నాను చివరికి.

"ఆడపిల్లలమీద రాసే అలవాటు–మంచిదికాదు-"

"నీ పెర్మిషన్‌తో–"

"వూహూం-పెర్మిషన్ నేనివ్వను, నువ్వు రాసినా ఏమీ అనుకోను. నువ్వు రాసి అది అచ్చయినా–నేను చదవను..."

"వెళ్దామా ఇహ–" అన్నాను లేస్తూ.

మౌనంగా తనచేయి అందించింది. మాటవరసకి నా చేయూతే గాని తను పువ్వులా తేలిగ్గా లేచి నిలుచుంది. "నువ్వు మరీ బుద్ధిమంతుడివనుకోవాలా నేను?–" అంది ప్రక్కనే నడుస్తూ.

కెరటం బద్దలైంది.

వొక్కసారిగా దగ్గరికి లాగి హత్తుకుని ముద్దు పెట్టుకున్నాను.

ఆ చీకట్లో ఆ క్షణమే చచ్చిపోయుంటే అది స్వర్గం

"కొంచెం బుద్ధిమంతుణ్ణే నేను–

"పెళ్ళి చేసుకో–ఆ వుండే బుద్ధి కూడా పోతుంది-'

వొ:లేదు ఆమెనింకా నేను.

చేతుల్లో అలాగే నిలిచింది–"మనం స్నేహితులం!–"

"శరీరాల్నేని ఆత్మలమైతే బాగుణ్ణు!-" అన్నాను.

"శరీరాలున్నా–ఆత్మలం అని గుర్తుంచుకో చాలు...నిండైన మనిషివి ఔతావు–"

తల తిరిగిపోయింది నాకు.

ఎంత తేలిగ్గా సునాయాసంగా చెప్పింది–సత్యాన్ని!

ఆ భావన సాధించడంకోసం ఎన్ని పుస్తకాలు చదివేను! ఎన్ని వుపన్యాసాలు విన్నాను!!

"ఆనందరావ్–ఐ లైక్యూ-దా-పోదాం-దా–" అని రెండో క్లాసు కుర్రాడికి ఐదోక్లాసు ఆడపిల్ల చెయ్యందించినట్టు అందించింది.

కారు నగరంలోకొచ్చేసరికి నా గుండెలో గుబులు రేగింది. టవర్ క్లాక్ దగ్గిర ఆగేసరికి గొంతు తడారిపోయింది.

"మళ్ళీ ఎప్పుడు రూపా?–"

"వొకసారి వుండడం. అంతే. మళ్ళీ–అనేది భ్రమ. అనంతంలో త్రికాలాలు లేవు. వున్నదొకటే కాలం. అది-నిత్యం..."

"మనం ఎలా కలిసేం? ఎందుకు విడిపోతున్నాం?–"

"నిన్నటిదాకా మనం కలవలేదు. రేపట్నుంచి కలవం. నిన్నా రేపులో కలవడంలేదు. మరి నేటి కలయిక? ఏమౌతుంది? ఆలోచించు! కలిసినా కలవనట్టే! కలవకపోయినా కలిసినట్టే–"

"అదెలాగు ?–"

"ఆలోచించు–వందేళ్ళక్రితం నువ్వూ లేవు నేనూ లేను. మరో వందేళ్ళ తర్వాత నువ్వూ వుండవు, నేనూ వుండను. అప్పుడు ఇద్దరమూ లేము. ఇప్పుడు ఇద్దరమూ వున్నాము– వుండడంలోనూ లేకపోవడంలోనూ మనిద్దరం వొకటే. లోకానికి ఇద్దరం-మనకు మనం వొక్కటే–"

దుఃఖం వల్లనో, ఆనందం వల్లనో కళ్ళలో గిర్రున నీళ్ళు తిరిగేయి. నా చేతిని అందుకుంది రూప. నిండుకళ్ళతో నాకేసి చూసింది. సృష్ట్యాదినుంచి వున్న అన్ని చీకటి రాత్రుల్నీ ఇముడ్చుకున్న కళ్ళవి!

"నేస్తం! నన్ను గుర్తుంచుకో! నువ్వంటే నా కిష్టం –! ఐ లైక్యూ! ఐ లవ్ యూ!......"

రివ్వున రూపకారు దూసుకుపోయింది. నల్లటి రాత్రిలో నల్లటి తారోడ్డు మీద నల్లటి కార్లో నల్ల చీరెలో రూప–చీకటిలో కాటుక నలుపులా కలిసిపోయింది.

వొక్కణ్ణే మిగిలేను నేను, కాని–

లెక్క లేనన్ని మెరుపులు మెరుస్తున్నాయి నాలో...

* * *

గదికి చేరుకున్నాను.

జరిగినవన్నీ వొకటి వెంట వొకటిగా కళ్ళముందు కదులుతున్నాయి.

అయిదుగురు-మనుష్యులు!

అయిదు పాత్రలు!

ధనపతి, కైక, పొన్నమ్మ, చంద్రకాంత్, రూప–

వొక్కరొక్కరే వొచ్చేరు.

తమ గురించి తాము చెప్పినంత చెప్పగలిగినంత చెప్పేరు.

తమ గురించి రాయమన్నారు ఇద్దరు. రాస్తే రాయమన్నా

ఒకరు. రాయొద్దన్నారొకరు. రాయడమంటే ఏమో తెలీక —దాన్ని గురించి నిర్లిప్తంగా వెళ్ళిపోయేరొకరు.

టేబిల్ మీది కాగితాలు నావేపు తెల్లగా శూన్యంగా చూస్తున్నాయి.

దీనంగా పడుకుంది నాకలం!

ఎవర్ని గురించి రాయాలి?-ఏం రాయాలి నేను?

నవల రాస్తే చాలు — తను అచ్చు వేయించుకుంటానన్నాడు ధనపతి. తన గురించి నేను రాయాలి! రాస్తే — వొస్తే అతని కొడుకు తిరిగి రావొచ్చు. నాకు ఏదో కొంత సంభావన ధనపతిగారి ద్వారాకూడా ముట్టొచ్చు. కాని ధనపతి కథలో కొత్తదనంలేదు చెప్పుకోదగ్గ ఉదాత్త లక్ష్యంకూడా లేదు. కుటుంబ కలహం గురించి రాస్తే తప్పులేదు. ఇంకే అన్యాయాలకి లొంగక అది కేవలం కుటుంబ కలహమే అయి వూరుకుంటే దానివల్ల సాంఘిక ప్రయోజనంకూడా అట్టే వుండదు.

"ఆడా మగా మధ్య ఆర్థిక కారణాలవల్ల ఈదోపిడీ ఇలా నిరంతరం జరగాల్సిందేనా?—" అని ధిక్కరించి ప్రశ్నించి, అలా జరక్కూడదనీ, జరక్కుండా చూడాల్సిన బాధ్యత నామీదావుందనీ చెప్పింది కైక. "నిజానికి నామీదరాస్తే — ఈతరం ఆడపిల్లల మీద రాసినట్టు—" అంది. మాటవరసకి నేను కైక మీద కైక చెప్పిన కథే రాస్తే - ఈతరం ఆడపిల్లలు హర్షిస్తారా? నన్ను స్త్రీద్వేషి కింద జమకట్టేవాళ్ళు కొందరైనా వుండకపోతారా?? ఏమో! నాకసలే స్త్రీలంటే భయం. ఎంతటి రచయితైనా స్త్రీ పాఠకుల సానుభూతి లేకపోతే రాణకెక్కలేదు. స్త్రీలకి అప్రియాలురాసి నేను బ్రతికి బట్టకట్టగలనా?

మొగుడు చంపేస్తున్నాడంటూ కేకలేసుకుంటూ మధ్యాహ్నం పారిపోయొచ్చిన పొన్నమ్మ సాయంత్రానికల్లా వాడికి స్నానానికి వేణ్ణీళ్ళు పెట్టాలని గుడిసెకెళ్ళిపోయింది. పొన్నమ్మ కథని నవలగారాస్తే పాఠకులూ, పాఠకీమణులూకూడా హర్షిస్తారు. కాని, పొన్నమ్మ భాష నాకురాదు. వాళ్ళ జీవితాల్తో ప్రత్యక్ష పరిచయంకూడా నాకులేదు. చూడకుండా అనుభవించకుండానే చూసినట్టూ అనుభవించినట్టూ రాయడం కష్టంకాదుగాని నికృష్టం. నాకిష్టంలేదు. పొన్నమ్మ కథని నేనిప్పుడప్పుడే రాయలేను.

ధనపతి బూర్జువా మనిషి. కైక మధ్యతరగతి ఆడపిల్ల. పొన్నమ్మ పీడిత వర్గానికి చెందిన స్త్రీ. వీళ్ళ ముగ్గురినీ వర్గ దృక్పథంతో పరిశీలిస్తూ సాంఘిక వివరణాత్మక విశ్లేషణాత్మక నవల రాద్దామంటే -వూహూ—లంకెలందడం లేదు.

చంద్రకాంత్ మనసు నా మనసుతో నా మెదడుతో చేసిన గారడీతో ఒక చైతన్యస్రవంతి నవల రాయొచ్చు. అల్లాటప్పా కబుర్లు చెప్పి అదే చైతన్య స్రవంతి అని చెప్పన్నేను. చైతన్య స్రవంతంటే-అదో కత్తిమీదసాము. అంత సాహసం నాకిప్పుడులేదు.

తన గురించి ఏమీ రాయొద్దంది రూప. రాయాలనుంది నాకు. కాని, రూప మీద కూడా ఏమీ రాయలేనేమో! రూపగురించి రాయడమంటే నా అంతరాత్మగురించి నేను రాయడమన్నమాట! అంత ఆధ్యాత్మిక పరిపక్వత నాలో ఇప్పుడు లేదు. లేని దానికి విచారం లేదు. వయసురాకుండా ముదిరిపోయినా ప్రమాదమే!

ఈ అయిదు పాత్రలు చెప్పిన విషయాల్ని ఒకదాన్నొకటి కలబోస్తే ?-అనే ఆలోచనకూడా వొచ్చింది నాకు! —

కైకను గత చరిత్రపేరిట ఫూల్ కొట్టి మోసం చేసింది ధనపతి కొడుకు కళాయే అని చెప్పొచ్చు. ఆ కళాయే ఈ యస్. గోపాలం! ఏం? - ఇహపోతే — రూప ఎవరు? ఆవిణ్ణి పోషించే ఆ రాజుగారెవరు? సౌకర్యంకోసం కావలిస్తే ఈ రెండు పాత్రల స్థలాలూ మార్చెయ్యొచ్చు. ధనపతి ఏకపత్నీవ్రతుడు కాడని వాదించడం పెద్ద కష్టంకాదు. నిజానికి వాదించనవసరం లేదు! (అఖిలాదేవికీ ఆయనకీ — సయోధ్య ఎన్నడూ లేదు కూడాను!) మరి పొన్నమ్మ గతేమిటి? — ఆమె భర్తని రిక్షావాడుగా కాక ఫ్యాక్టరీ వర్కర్‌గా చిత్రిస్తే!? అతణ్ణి — ధనపతి మనుష్యులచేత 'యాక్సిడెంట్'లో చంపిస్తే!? అన్నట్టు చంద్రకాంత్ ఏం కావాలి? అతడే కైక తొలి ప్రియుడు గోపీ సుందరం అనేస్తే? — మిగతా లంకెలు సరిపోతాయా? — ఎలాగైనా సరిపెట్టాలి! అన్నీ సరిపడితే-ఏదో ఒక నవల తయారు చెయ్యొచ్చు ... ...

వున్నట్టుండి జ్ఞానోదయం అయింది నాకు. నా ఆలోచనలో గల పెద్ద లోపం తెలిసొచ్చింది.

ధనపతి—కైక—పొన్నమ్మ—చంద్రకాంత్—రూప ... వీళ్ళవి నిజమైన కథలుకావు. వీళ్ళంతా నన్ను పలకరించడానికొచ్చిన పాత్రలు. అంతే!

వీళ్ళ జీవితాల్ని నేనెలా కలపగలను?

ఎలానూ కలపలేను.

అన్నట్టు ఈ పాత్రలైనా నాకు పూర్తిగా అర్థం కాలేదు. నిజానికి వాళ్ళకి వాళ్ళే అర్థం కాలేదు. ఆసంగతి వాళ్ళుకూడా ఒప్పుకుంటారు! ఇహ నాకేం అర్థం ఔతారు?

పాత్రలు తమకి తామూ అర్థంకాక, రచయితకీ అర్థంకాక—అలాంటి పరిస్థితిలో రచన సాగితే(!) ఇహ నవల పాఠకులకి మాత్రం ఏమర్థమౌతుంది? పాఠకులకి అర్థం కాకూడదనే రాసేవాళ్ళుంటే వుండొచ్చుగాక, నాపద్ధతి అది కాదు.

శవాన్ని వెన్నెక్కించే భేతాళుడిలా కాగితలూ కలం మేజా సొరుగులోకి తోసేసేను.

వూహూఁ—నేను నవల రాయను

(అయిపోయింది)

# క్రొత్త సీసాలు కొన్ని

## శ్రీ గడియారం శేషఫణిశర్మ

1 మానస భజరే! రమావల్లభమ్
విభుమ్
పావన గుణ సంభవమ్॥

సలలిత మృదు భాషణమ్
ఘనాంబుద రుచిపోషణమ్
మనువంశ భూషణమ్
మానస భజరే! రమావల్లభమ్॥

శ్రీకరమ్ శుభకరమ్
పాపౌఘ భీకరమ్
ప్రణత జన సమాదరమ్ శ్రీధరమ్
మానస భజరే! రమావల్లభమ్
విభుమ్
పావన గుణ సంభవమ్॥

శంభు సన్నుతమ్
కుంభ సంభవాది మునిసేవితమ్
మహద్భావనమ్
సురహిత పావన జీవనమ్
మానస భజరే! రమావల్లభమ్
భజరే! భజ భజ!!

2. రఘువర శరణంటిరా!
దేవరా!
దయగల దొరవీవెరా!॥

కంజ నయన!
అభయంకర చరణా!
ఆంజనేయ వరదా!
రణరంగ కోవిదా!
రఘువర శరణంటిరా!
దేవరా!॥

అనుపమాన నిగమాంత విహరణా!
వరద సుగుణ!
వితరణ ధనా! పావనా!
రఘువర శరణంటిరా!
దేవరా!॥

దశరథ నృపవర నందనా!
బుధ చందనా!
కుందరదన!
వందిత సురనాయక!
గుణ బంధుర!
నను రయమున పరిపాలింపరా
రఘువర శరణంటిరా!
శేషకవి గీతనామ! రామ!॥

3. రాముని కొనియాడరా!
తారకామృత నాముని కొనియాడరా!

మునిజనులకు,
యోగివరులకు,
రససిద్ధులగు కవు
లకు గాని కనరాని
రాముని కొనియాడరా!॥

నరపాల చూడావతంసుని,
రాక్షస హనన రిరంసుని,
రణరంగ విద్యావిశారదుని,
స్మరసదుని,
రాముని కొనియాడరా!

భవా భవాది సురసన్నుతున్,
మనోభవ సమున్,

వివాంబుధి శ్యాము
సీతా మనోజ్ఞ బంభరున్,
భజించుటే వరమని మదినెంచి,
రాముని కొనియాడరా
వీడవి నీమమలర! ॥

4. పాడవా ఒక తీపి పాట!
ఇచ్చోట,
మేల్ పసిడి వెన్నెల వెల్లుబాట! ॥

నీదు దరహాసముల
నిండె విరిమల్లియలు!
నీదు క్రీగంట
వర్తించె రేవేలుగులు!
ఆ మల్లియల నేరి,
ఆ వెన్నెల చేరి,
వినలేవి పరవశమ్మున,
రసార్ద్ర ప్రధిత భావముతో
పాడవా ఒక తీపిపాట!॥

ఓ ప్రణయినీ!
భావనా మరంద రసవాహినీ!
సఖీ!!

మందర సుమవల్లికవలె,
బంధుర నవ మల్లికవలె,
చేతనీవు నిల్వ
నెడద వింతకాంతి తోపగా
పాడవా ఒక తీపిపాట!॥

5. నీ చిరునవ్వుల
విండెవసంతము
అందముగా సకియా!

చెలువగు నీ కను
సన్నల విల్పెను
వెన్నెల లారయగా చెలియా!

హాయుపుగ నీ వడ
లందిన వింద్రధ
నుస్సులు విరిసె సఖీ వినవే!

పొలుపుగ ని పలు
పుల ప్రవహించెను
తేనియ వాకలవె చెలువా!

ప్రణయిని నీవల
పుల వల దగిలెనె
మనసిది తెలిసికొనన్

మరునిమ మత్తిలి
తెట దరి గనియెద
నెటులిక జనగలనే!

ఇలాలకు వెరచితి
నెటులిక జనియెద
రమణిరో నిమసిడి
వేకువ తెలిరేకను వడివీడి!!



# తేవారం త్రయం కాలం

శ్రీ బి. జి. ఎల్. స్వామి

[ ప్రొఫెసర్ బెంగుళూరు గుండప్ప లక్ష్మణస్వామిగారు మదరాసు ప్రెసిడెన్సీ కాలేజి ప్రిన్సిపల్‌గా, చీఫ్ ప్రొఫెసర్ ఆఫ్ బాటనీగా పని చేసి రిటయిరయి ఆ కాలేజీలోనే ఎమెరిటస్ ప్రొఫెసర్‌గా ఉంటున్నారు. వీరు సుప్రసిద్ధ కన్నడ సాహిత్య వేత్త కీ. శే. గుండప్పగారి కుమారులు. ప్రొఫెసర్ స్వామిగారు మంచి చిత్రకారులుగా పేరు పొందారు. వారి మాతృ భాష తమిళం కాని కన్నడ రచయితగానే ఎక్కువ పేరు సంపాదించుకున్నారు. వారి ''కాలేజిరంగ''ని ఈ మధ్యనే కన్నడంలో సినిమా తీశారు. కొంత కాలంగా ప్రొఫెసర్ స్వామి గారు ప్రాచీన తమిళ చరిత్రకి సంబంధించిన పరిశోధనలు చేస్తున్నారు. చిదంబరం గుడి, తొల్కాప్పియమ్, కాలాముఖశైవం, గొంకీ మతం, తేవారత్రయం—వీటి మీద ఆయన ఇంగ్లీషులో రాసిన వ్యాసాలు వివిధ విశ్వవిద్యాలయాలు ప్రచురించే పత్రికలలో పడ్డాయి. తేవారం త్రయం కాలం గురించి ప్రొఫెసర్ స్వామిగారు చేసిన పరిశోధనల ఫలితంగా రూపొందిన ఇంగ్లీషు వ్యాసం అనువాదాన్ని ఈ నెల ''భారతి''లో మొదలు పెడుతున్నాము. ఆతరువాత ఆయన ఇతర రచనలు కొన్నిటి అనువాదాలని కూడా ప్రచురించగలమని అనుకుంటున్నాము. ''తమిళ చరిత్రని గురించి ప్రచారములో ఉన్న కొన్ని అభిప్రాయాలనీ, సిద్ధాంతాలనీ ప్రొఫెసర్ స్వామిగారు చేసిన అనుశీలన తెలుగు పాఠకులకి ఎందరికో కొత్త సమాచారాన్ని అందచెయ్యటమే కాక వారితో ఆలోచనలని రేకెత్తించేట్లుగా కూడ ఉండగల''దని అనువాదకుడి ఆశ. ప్రొఫెసర్ స్వామి గారు ''సంగమ్'' సాహిత్యం కాలం మీద రాసిన వ్యాసం త్వరలో ప్రచురింపబడగలదని తెలుస్తోంది. ''తెలుగులో వాడకంలో ఉన్న అచ్చుతోనే సరిపుచ్చుకొనటానికి ప్రయత్నిం''చినట్లు అనువాదకుడు తెలుపుతున్నాడు. ''తమిళం వచ్చిన వారు దానిని గమనించి సహృదయంతో అర్థం చేసుకొనగల''రని అతని నమ్మకం.]

సుమారు 80 సంవత్సరాలకింద (1895) సుందరం పిళ్లై తిరుజ్ఞాన సంబందర్ కాలాన్ని నిర్ణయించే పరిశోధనలు [illegible]గారు; అంతకిముందు ఇటువంటి పరిశోధనలు జరగలేదు. కొన్ని [illegible]హిత్యాధారాలని అనుశీలించి ఆయన ఈ ''తేవారం'' కవి క్రీ.శ.7వ [illegible]బ్దంలో జీవించి ఉండాలని నిర్ధారణ చేశారు. శేక్కిళర్ తన [illegible]రుత్తొండర్ పురాణం'' (పెరియపురాణం) లో చెప్పిన కొన్ని [illegible]నిబట్టి తిరునావుక్కరసర్ (అప్పర్) తిరుజ్ఞాన సంబందర్ [illegible] వయస్సులో పెద్దవాడయిన సమకాలికుడు అయిఉండాలని [illegible]చబడుతోంది. ఇంకా ప్రత్యేకంగా భావించబడేది ఏమిటంటే—[illegible]నావుక్కరసర్ పల్లవరాజు మహేంద్రవర్మ (క్రీ.శ.610-630) [illegible]ంచిన కాలంలో జీవించి ఉంటాడని, ఈయన తనే జైనమతాన్ని వదులుకుని శైవాన్ని స్వీకరించి మహేంద్రవర్మనికూడా ఇదేవిధంగా మతం మార్చుకునేట్లు చేశాడని నమ్మబడుతోంది. ఈ ఊహకి రెండు ఆధారాలు. మొదటిది శేక్కిళర్ పెరియపురాణం; రెండవది తిరుచి రాతిగుడిలో చెక్కబడిన సంస్కృత శిలాశాసనం (సౌ. ఇం. శ. నెం. 33, 34) ఈ శాసనానికి ఎన్నో అర్థాలు చెప్పటం జరిగినదని గమనించాలి. ఈ శాసనంలో దానం ఇచ్చినవ్యక్తి మహేంద్రవర్మే అని ఒప్పుకున్నప్పటికీ దాని అర్థం అస్పష్టంగా, సందిగ్ధంగాకూడా ఉంటోంది; కాని, తిరుజ్ఞాన సంబందర్, తిరునావుక్కరసర్‌లు మహేంద్రవర్మతోబాటు సమకాలికులన్న విషయం ఒక నిర్ధారణ అయిన యథార్థంగా స్వీకరింపబడుతోంది. తమిళనాడుయొక్క సాహిత్య, మత, సాంస్కృతిక, రాజకీయ చరిత్రకి (సయితం) ఈ వాదం ఒక పునాదిరాయిగా ఉంటోంది.

అయినా, తేవారం కవులలో మూడవ వాడయిన సుందరర్ (నంబి ఆరూరార్) కాలం ఇంకా తేలటంలేదు. కొందరు రచయితలు (శ్రీనివాసపిళ్లై 1949; రాజమాణిక్కమ్ 1960; మొదలయిన వారు) అతను క్రీ. శ. 9 వ శతాబ్దంవాడు అంటారు. మరి కొందరు (దొరైరంగస్వామి 1958, వెళ్లైవరణన్; మహాలింగం 1969 మొదలయినవారు) అతను రెండవ పల్లవ నరసింహవర్మ రాజసింహ (క్రీ. శ 690/1 - 728/9) కాలంనాటివాడు అంటారు. సుందరర్ తేవారంలో పేర్కొనబడిన కాడవర్కోన్ కళరచ్చింగన్ ఈ రాజేనని వారి అభిప్రాయం. అంటే ఇప్పటివారిలో ఎక్కువమంది అభిప్రాయంలో ముగ్గురు తేవారం కవులూ ఏడవ శతాబ్దంలోనే పరిపాలించిన పల్లవరాజుల (అంటే మహేంద్రవర్మ I నుంచి నరసింహవర్మ II దాకా) సమకాలికులే అన్నమాట.

## ఆంతరంగిక సాక్ష్యం

తేవారం త్రయం కాలం నిర్ణయించటానికి మధ్యయుగపు తమిళ సాహిత్యంలోని ఆధారాలు చాలావరకు వాడబడినాయి. 12వ శతాబ్దానికి చెందిన శేక్కిళర్ రాసిన ''తిరుత్తొండర్ పురాణం'' లో ఈ కవులు చేసిన పనులు వివరంగా వర్ణింపబడివాయి; ఇదే మూల వివరాలకి ప్రధానమయిన నిధిగా పరిగణింపబడుతోంది. ఈ గ్రంథం లోని వస్తువునే ఇంకా ఎన్నోరకాల ప్రయోజనాలకోసం వాడటం జరిగిందని ఇక్కడ గమనించవచ్చు. మధ్యయుగపు తమిళనాడుయొక్క సాంఘిక, సాంస్కృతిక చరిత్రని ఊహించటానికీ (రాజమాణిక్కమ్

...), ఆకాలంలో ప్రచారంలో ఉన్న శైవాన్ని అర్థం చేసుకొనటానికి (నారాయణ అయ్యర్ 1936); తమిళనాడులోని కొన్ని పాత రాజవంశాలకి చెందిన రాజులు, ఇతరవ్యక్తులు కొందరు-వీరెవరో నిర్ణయించటానికి (మహాలింగం 1969) తిరుత్తొండర్ పురాణం ఉపయోగపడింది. పెరియపురాణం నమ్మతగిన ఒక చారిత్రిక కథనం అన్న అభిప్రాయాన్ని పిళ్లై బాగావ్యక్తపరచారు (1968):

"రాజకీయ చరిత్రకి సంబంధించిన కొన్ని యదార్థాలు కూడా చెప్పబడినాయి..."

ఇంకొక పేరుపొందిన చరిత్రకారుడు ఈ గ్రంథం "అంత విలువకలది కాదు" అన్నారు. ఇది గమనించదగిన విషయం (నీలకంఠశాస్త్రి 1956); ఇంకొకచోట(1955)ఈయనే ఇలాగరాశారు: "శేక్కిళర్ మహాగ్రంథంలో పుష్కలంగా కనిపించే 'పద-చిత్రాలు' అతని కాలానికిచెందిన జీవితం, సంఘాలని ఆదర్శవంతంగా చిత్రించే వర్ణనలుగా స్వీకరించటమే సమంజసంగా ఉంటుందనిపిస్తుంది. అతనికి పూర్వపు కాలానికి సంబంధించిన అనుశీలనగా కాని, చిత్రాలుగా కాని వీటిని స్వీకరించటం సరికాకపోవచ్చు." శేక్కిళర్ ఈ గ్రంథాన్ని రాయటంలో భక్తిని పెంపొందించటమే తన ముఖ్యోద్దేశంగా ఉంచుకున్నాడు. 63గురు శైవ భక్తుల పవిత్ర కథలని చెప్పి తన గ్రంథాన్ని వినేవారిలోనూ చదివే వారిలోనూ భక్తిని పెంపొందించటానికి అతను ప్రయత్నించాడని గమనించాలి. రచయితకి ఇటువంటి ఉద్దేశం ఉన్నప్పుడు గ్రంథంలోని "చారిత్రిక" సంఘటనలు చాలా వరకు ప్రక్షిప్తాలవలన, ఒకదానిపయిన మరొకదానిని పయిన రుద్దటం వలన, కాలవిరుద్ధమయిన విషయాలవలన తమ నైజాన్నీ, విలువనీ కోల్పోతాయి. అందుచేత అసలయిన చారిత్రిక సూత్రాలని కలిసిపోయిన ఈ ముద్దలోనుంచి వేరు చెయ్యటం వీలులేకుండా పోతోంది. ఒకవేళ ఏదోఒక దారం వేరయినప్పటికీ అది సందేహాల నుంచి, చిక్కులనుంచి విడికాకుండా ఉంటుందని ఇక్కడ నొక్కి చెప్పవలసివస్తోంది.

ఈ సందర్భంలోనే కన్నడ భాషలో 63 గురు శైవభక్తుల జీవితాలని గురించిచెప్పే రచనలు ఎన్నో ఉన్నాయని పేర్కొనటం అప్రస్తుతం కాదు. (1) వీటన్నిటిలోనూ ప్రాచీనమయినది "శివగణద రగళె" (అంటే శివగణంమీద రగళె రచన). దానిని షుమారుగా 12వ శతాబ్దంలో జీవించిన హరిహరుడు రాశాడు. ఇతను శేక్కిళర్ సమకాలికుడు. ఈమధ్యనే ఈ రచయిత రాసిన మరొక గ్రంథం బయటపడింది—ఇది వచనంలో ఉంది, దీనిపేరు "అరవత్తుమూవరు పురాతనర కథాగర్భద గద్య" (అరవయి ముగ్గురు శైవభక్తుల వచన కథా సంగ్రహం.) అంటే—సమకాలికులుగా చూసినా, గ్రంథవస్తువు విషయం తీసుకున్నా శేక్కిళర్, హరిహరుల రచనలు పోల్చటానికి తగినట్లుగా ఉన్నాయన్నమాట. ఇద్దరు రచయితలూ శివభక్తులని గురించి ఒకే క్రమంలో రాశారు. (హరిహరుడు లేక అతని అనుచరులు కన్నడంలో "తిల్లయివాళంద నర్పురాణా"న్ని వదిలివేశారు.) ఇద్దరూ భక్తుల కథలలో ఒకేరకం సంఘటనలని వర్ణిస్తారు. అయినా ఈ రెండు భాషల కథనాలలోనూ ముఖ్యమయిన తేడాలు ఉన్నాయి. ఇవి వాస్తవిక దృష్టితో చూసినట్లయితే ఎంతో ముఖ్యమయినవని తెలుస్తుంది. "తేవార"త్రయం కాలాన్ని నిర్ణయించటానికి పనికి వచ్చేవిగా పరిగణింపబడే కొన్ని ఈ కథలని ఇప్పుడు క్లుప్తంగా పరిశీలించవచ్చు.

## తిరుజ్ఞాన సంబందర్

ఆళుడయప్పిళ్లయార్‌ని అవతల వదిలి అతని తండ్రి కోలనులో స్నానం చేస్తూ ఉండగా ఉమాదేవి అతనికి పాలు ఇస్తుంది. పిల్లవాడు ఏడుస్తాడు. ఇది పెరియ పురాణం కథ.

హరిహరుడు ఈ సంఘటనని గురించి చెప్పడు. పిల్లవాడు "మామ" నిజయించి పాలు తాగినట్టు మాత్రం చెప్తాడు. సురంగుడు తన "త్రిషష్టి పురాతన చరిత్రం"లో నారదుడిని గూడ కథలోకి తీసుకువస్తాడు. స్కందుడే తిరుజ్ఞాన సంబందర్‌గా పుట్టాడని కూడా ఇతను అంటాడు.

## తిరునావుక్కరసర్

కన్నడ గ్రంథాలలోని కథలు తమిళ కథలలాగే ఉంటాయి; జైనులతో భక్తుడు పేచీపడటాన్ని గురించి చెప్తాయి కాని జైనులు అతనికి రాయి ఒకటి కట్టి నీటిలో పారవేసినట్లు చెప్పవు.

## సుందరర్

హరిహరుడుకాని, ఇతర కన్నడ కవులుకాని సుందరర్‌కి ఇద్దరు భార్యలు ఉన్నట్టు చెప్పరు.

## చేరమాన్ పెరుమాళ్

హరిహరుడు, లక్కణదండేశుడు ఈ రాజు తన రాజ్యాన్ని "తిరునీలకంటపాణ"కి ఇచ్చేసినట్లు చెప్తారు. పెరియ పురాణంలో ఈ సంగతి లేదు.

## చిరుత్తొండర్

కన్నడ రచనలలో ఈ భక్తుడు పల్లవుల సేనాధికారి అని ఉండదు. అది వాతాపి యుద్ధాన్ని గురించి కూడా చెప్పదు. ఒక పెరియ పురాణంలో శివుడు బైరవుడివేషంలో చిరుతొండర్‌కి వచ్చి కలుసుకుంటే కన్నడ గ్రంథాలలో శివుడు శివుడుగానే ప్రత్యక్షమవుతాడు.

## కోచ్చెంగచోళన్

ఈ భక్తుడు (పూర్వజన్మలో) గోదావరి నదీతీరంలో జన్మించాడని కన్నడ గ్రంథాలు; తమిళ గ్రంథాల ప్రకారం అతను చోళ

విశదీకరించి ప్రత్యేకంగా చెప్పినవాడు కన్నడకథ ధోరణి పెరియపురాణం ధోరణికి భిన్నంగా ఉంటుంది. కన్నడకథలు కోచ్చెంగచ్చోళన్ చంపిన ఏనుగ గుహలో ఉండే రాక్షసుడుగ జన్మించినట్లు చెప్తాయి; ఈ రాక్షసుడితో రాజు ఘర్షణ పడ్డాడు అప్పుడే అతను తను శివలింగపూజని శ్రద్ధ చేసినట్లు గ్రహిస్తాడు. శివలింగపూజని మొదలు పెట్టగానే అతను విముక్తి పొందుతాడు.

## నరసింగమున మరియర్

ఈ భక్తుడి ఊరు తిరుమునయిప్పాడి అని పెరియపురాణం చెప్తుంది; కన్నడ రచనలు అతనిది "తిరునావలూర" అంటాయి. హరిహరుడు అతన్ని శివపుర (అంగవాడి ?) నివాసిని చేస్తాడు. త్రిషష్టి పురాతన చరిత్రం వంటి గ్రంధాలు ఇతను సుందరర్ తండ్రి అని చెప్తాయి.

ఈ కధాంతరాలు ఒక్కొక్క కవి భావన శేక్కిళర్‌తో సహా – ఒకే కథావస్తువుకి ఎటువంటి కాల్పనికపు రెక్కలు వచ్చేట్లు చేయగలదో నిరూపిస్తాయి. ఇటువంటి కధలు శాస్త్రీయ చారిత్రక పరిశోధనకి ఎంతవరకు ఆధారాలు కాగలవని విమర్శనాత్మక దృష్టితో అనుశీలించిచూడాలి. ఒక సంఘటనకి సంబంధించిన కధలో అతిశయోక్తితోకూడిన పౌరాణికాంశాలు ఉంటే వాటిని విస్మరించిన తరువాతనే ఆంతరంగిక సాక్ష్యానికి విలువ ఉంటుంది. ఇక్కడే ఎంతో జాగ్రత్త, సంయమనం అవసరం అవుతాయి. పెరియపురాణంలో, కన్నడ కథలలో పరిమాణం విషయంలోనూ గుణం విషయంలోనూ కూడా మార్పులిగిన అంశాలు చాలా ఉంటాయి. వీటిలో ఏ అంశాలలో కల్పన లేకపోవటం వలన అవి ప్రమాణమయిన ఆధారాలుగా స్వీకరించటానికి తగినవో నిర్ణయించాలి.

తేవారం త్రయం కాలాన్ని గురించి చర్చించేటప్పుడు తేవారం లోని అంశాలనే ఆధారాలుగ తీసుకొనటం జరుగుతూ ఉంటుంది. ముగ్గురూ తమ భక్త్యావేశంలో చెప్పే కవిత్వంలో యధాలాపంగా తమతో సంబంధం ఉన్న – లేదా తమతో సంబంధం కల సంఘటనలలో సంబంధం ఉన్న – కొందరు రాజులని (రాణులని) పేర్కొంటారు ఇటువంటి వారంతా తేవారం రచయితల సమకాలికులని కొందరు గట్టిగా వాదిస్తారు. ఈవిధంగా పేర్కొనబడిన వ్యక్తులు తేవారం త్రయంకన్నా ముందరివారు కావచ్చునన్న వాదానికి వారు అవకాశం ఇవ్వరు. వారిని పేర్కొన్నప్పుడు క్రియలకి వర్తమాన కాలం వాడబడుతుంది కనుక వారు తేవారం రచయితల సమకాలికులని చెప్పబడుతూ ఉంటుంది. అయితే, కవిత్వంలో కాలం వాడుక విషయంలో కొంత స్వేచ్ఛ ఉంటుంది. ఇది కాలక్రమాన్ని నిర్ణయించటానికి అసందిగ్ధమయిన ఆధారం కాలేదు.

కొన్ని శాసనాలలోని అంశాలు తేవారం త్రయం కాల నిర్ణయానికి వాడబడుతున్నాయి. కాలం గట్టిగా తెలిసిన శాసనాల విలువని అందరూ గుర్తిస్తున్నారు కాని లిపిని పట్టి మాత్రం కాలం నిర్ణయింపబడిన శాసనాల విలువ చరిత్ర పరిశోధన దృష్టితో చూసినట్లయితే తక్కువ కాదు.

ఇప్పుడు ఆధారాలవీ, వీటి సహాయంతో తేవారం త్రయం కాలాన్ని ఊహించటానికి ఉపయోగింపబడిన వాదాలవీ విమర్శనాత్మకంగా అనుశీలించటం అవసరం.

## 1. తిరునావుక్కరసర్ - మహేంద్రవర్మ I

### అ) సాహిత్యం :

జైనులు తిరునావుక్కరసర్‌ని ఒక రాతి బండకికట్టి, సముద్రంలో పారవేశారు; అతనప్పుడు పంచాక్షరాలని జపించాడు; రాతి బండ తేలిపోయి అతన్ని సురక్షితంగా తీరాన్ని చేర్చింది. ఈ అద్భుతాన్ని విన్న ఒక పల్లవరాజు తిరునావుక్కరసర్‌ని పూజించి శైవమతం స్వీకరించాడు ఈ రాజే పాటలిపుత్రంలోని జైనుల మఠాన్ని విరగ కొట్టించి ఆరాతితోనే తిరువదిగై లో 'గుణభర – ఈశ్వరమ్' అనే గుడి కట్టించాడు – ఇది పెరియ పురాణంకథ.

శేక్కిళర్ పల్లవరాజు పేరుచెప్పడు. అతనెవరో తెలుసుకొనటానికి సహాయపడే ఆధారాలు ఏవీ ఇవ్వడు. ఇది గమనించతగినది.

### ఆ) శాసనాలు :

తిరుచిలోని పయి రాతిగుహలోపల (లలితాంకుర పల్లవేశ్వర గృహం) ఇరువయిపులాఉండే గంగాధర శిల్పంలో కొన్ని సంస్కృత శ్లోకాలు ఉన్నాయి (సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్ I, 33, 34) వీటి లిపి "మామల్లపురం, కాంచీపురం పల్లవ శాసనాల లిపిని గుర్తుకి తెస్తుంది" ట శాసనాలు గుణభరుడనే రాజుని పేర్కొంటాయి. ఇతనికే పురుషోత్తముడు, శత్రుమల్లుడు, సత్యసంధుడు అనే బిరుదులు కూడ ఉన్నాయి. గుణభరుడు లోపలలింగంఉన్న శివాలయాన్ని కట్టించాడుట. ఈ శాసనాలని సంస్కరించి కూర్చిన హల్ట్‌ష్ ఎంతో జాగ్రత్తగా "గుణభరుడు బహుశ చోళదేశాన్ని ఏలిన పల్లవరాజ కుమారుడు అయిఉంటాడు," అన్నాడు.

నెం. 33 శాసనంలోని ద్వంద్వార్థాన్ని గమనించాలని కూడా హుల్ట్‌ష్ అన్నాడు, అది ఇలాగ ఉంది :

గుణభరనామాని రాజ
న్యానేన లింగేన లింగిని జ్ఞానమ్
ప్రథమ్ చిరాయలోకే
విపక్షవృత్తేః పరావృత్తమ్.

ఈ పంక్తులు ఎంతో చర్చకివస్తువులయ్యాయి. వాటినిబట్టి ఎంతో దూరం వెళ్ళే నిర్ధారణలు కొన్నిచేశారు కొందరు (శ్రీనివాసన్ 1964, మహాలింగం 1969, నాగస్వామి 1971.) హుల్ట్‌ష్

ఈ పద్యాన్ని ఈ విధంగా అనువాదం చేశాడు. "గుణభరుడన్న పేరు కల రాజు లింగారాధకుడుగా ఉండగా విపక్షవృత్తి నివదులుకున్న జ్ఞానం లోకంలో ఈ లింగంచేత విస్తరించబడుగాక!" ఒక అధోజ్ఞాపికలో," ఈ పద్యం అంతా ద్వంద్వార్థంతో కూడి ఉంది. అందులో తర్కశాస్త్ర ప్రసక్తి ఉంది- 'లింగిన్' అంటే ఒక ప్రతిపాదనయొక్క కర్త, 'లింగ' అన్నది ఒక ప్రతిపాదనయొక విధేయం. 'విపక్ష' అంటే వ్యతిరేకోదాహరణ" అని రాశాడు.

మహాలింగం (1969) రెండు సందర్భాలనీ మొదటి మహేంద్రవర్మ మతానికి ప్రసుత్తమయిన ఆధారాలుగా స్వీకరించారు. "పెరియపురాణం సంప్రదాయానికి దీనిని అన్వయిస్తే అతను మతం మార్చుకున్నాడన్న సూచన బయట పడుతుంది," అని ఆయన అంటారు. నాగస్వామి (1971) కూడా మొత్తంమీద హుల్ట్ష్ వ్యాఖ్యని ఒప్పుకుంటూ కొత్త దానిని ఒకదానిని ఇచ్చారు. ఇది హుల్ట్ష్ వ్యాఖ్యకన్నా మెరుగని అనిపిస్తుంది. ఆయన రెండవ అర్థం మీద విపులమయిన వ్యాఖ్య ఒకటి ఇస్తారు—అది తర్కానికి సంబంధించినది. ఈ పంక్తులలో "విపక్షవృత్తి అన్న మాటలు మహేంద్రుడు జైనాన్ని వదులుకుని శైవాన్ని పుచ్చుకోవటాన్ని స్పష్టంగా తెలిపే" అర్థం ఆయనకి స్ఫురిస్తోందిట. "శివలింగారాధనను 'లింగ, లింగిన్' అన్నమాటలు సందేహానికి తావులేకుండా తెలుపుతాయి. 'లింగిన్' అంటే లింగధారి, అంటే లింగాన్ని పూజించేవాడు."

ఈ నిర్ణయాలు ఎంతవరకు సమర్థనీయమయినవో అనుశీలించి చూడాలి. పద్యంలో రెండర్థాలు ఉన్నాయని అనుకున్నప్పటికీ ఈ శాసనానికి తర్కంతో కల సంబంధం ఏమిటి,అన్న ప్రశ్న వెయ్యి బుద్ధి వేస్తుంది. వివాదాస్పదమయిన ద్వంద్వార్థాని వదిలివేస్తే తాత్పర్యం ఇలాగ ఉంటుంది— "గుణభరుడనే రాజు లింగారాధకుడు. వ్యతిరేకంగా ఉన్న జ్ఞానం ఇప్పుడు తిరస్కరింపబడింది. ఈ జ్ఞానం ఈ లింగ ప్రతిష్ఠతో విస్తరింపబడుగాక!"

మహేంద్రుడి మతానికి సంబంధించిన ఒక ముఖ్యమయిన అంశాన్ని శ్రీనివాసన్ మన దృష్టికితీసుకువస్తారు. మండగపట్టులోని రాతి గుహాలయం అతని మొదటి శిల్పం. ఇది బ్రహ్మ, విష్ణు, శివులగుడి. తిరుచిలోనిది తరువాత తొలువబడింది. ఇది శివుడికి మాత్రమే అంటే, రాజు, నిర్మించిన ఆలయాలు అతను జైనమతాభిమాని మాత్రమే అని సూచించవు. "శైవానికి విరుద్ధంగా ఉండి ఆ మతానికి తిరిగి వచ్చేసి ఉండినట్లయితే మహేంద్రుడు తనమొదటి గుహలని త్రిమూర్తులకి గాని, పిదప మహేంద్రవాడిలో విష్ణువుకి కాని కట్టి ఉండేవాడుకాదు."

శ్రీనివాసన్ ఇంకా ఇలాగ అంటారు: "బహుశ అతను విశాల దృష్టికల వైదికమార్గానుయాయి అయి ఉంటాడని అనుకోవచ్చునేమో; సమకాలీన సంఘటనల ప్రభావంకింద అప్పటి మత పునరుద్ధరణ ధోరణి ప్రభావంక్రింద అతను తన జీవితం పూర్వార్థంలో శైవుడయి ఉంటాడని అనుకోవచ్చునేమో, అతని గుహాలయాలు మూడూ- తిరుచిరపలి, దళవనూర్, శియామంగళం లోనివి- తక్కిన దేవుళ్ళని వదిలి శివుడికి కట్టబడి ఉండటానికి ఇదే కారణం అయి ఉండాలి."

ఒకవేళ 'విపక్షవృత్తి' అన్నమాటకి, పయిన చెప్పినట్లు రాజధర్మం సందర్భంలో "సదాచారానికి దూరమయిన నడవడి" అన్న అర్థం చెప్పినప్పటికీ గుణభరుడి మతాన్ని గురించి ఊహాలని చొప్పించేందుకు అవకాశంలేదు.

## ఇ) చారిత్రిక అంశాలు

తిరునావుక్కరసర్ కొన్ని శివాలయాలు దర్శించి వాటిలోని ప్రధాన దైవాలని గురించి పాడాడని సంప్రదాయం చెప్తుంది. ఈ ఆలయాలు తొండై మండలంలోని పాలియార్నది ఉత్తరం వైపున ఉన్నవి—అలంగాడు, పాచ్చూర్, కాళహస్తి, తిరువట్రియూర్, తిరువాన్మియూర్, తిరుక్కళుక్కున్రమ్, కాంచీపురం దేవాలయాలు. మహేంద్రవర్మ I కట్టిన శివుడి గుళ్ళు ఎన్నో ఈ ప్రాంతంలోనే ఉన్నాయి. తిరునావుక్కరసర్ ఇక్కడ తిరుగుతూ భక్తితో శివాలయాలని దర్శించుకున్నాడే అనుకుందాము. మరి మహేంద్రవర్మ కట్టించిన ఒక్క గుడికీ అతను వెళ్ళకపోవడం వింతగానే ఉంటుంది. ఈ వింత వైఖరి మరింత ఆశ్చర్యాన్ని కలిగించే దెప్పుడంటే, ఇంకొక సంప్రదాయం ప్రకారం తిరునావుక్కరసర్ మహేంద్రుడిని జైన మతం నుంచి శైవానికి మార్చాడని తెలుసుకున్నప్పుడూ. ఈమార్పు తరువాతనే మహేంద్రుడు శివుడికి ఆలయాలు కట్టడం మొదలు పెట్టాడని తెలుసుకున్నప్పుడూ.

ఈ సందర్భంలో మరొక ముఖ్యమయిన ప్రశ్న ఉదయిస్తుంది తిరునావుక్కరసర్ ఇంతకిముందు చెప్పిన శివాలయాలని గురించి గానం చేశాడనీ, అతను మహేంద్రవర్మ సమకాలికుడేననీ ఒప్పుకుంటే అసలు తిరునావుక్కరసర్ వెళ్ళిన ఆలయాలని ఎవరు కట్టించినట్లు? వారు మహేంద్రుడికి పూర్వం ఏలిన పల్లవరాజులు అయి ఉండటానికి వీలులేదు ఎందుకంటే, వారి ఆలయ నిర్మాణ కార్యాలని గురించి మనకి ఏమీ తెలియదు అవి మహేంద్రవర్మ కట్టించినవేనని అనటానికీ వీలులేదు; అవిఏవీ పల్లవకాలపు ఆలయాల లక్షణాలు కలవి కావు (ఒక్క తిరుక్కళుక్కున్రమ్ గుడితప్ప.) అవి చోళులు.కట్టారా అంటే 6-7 శతాబ్దాలలో చోళుల వంశాన్ని గురించి ఎవరికీ అంతగా తెలియదు. పోనీ ఈ చోళుల సంగం కాలంగా పిలువబడతున్న (క్రీ. శ. మొదటి మూడు శతాబ్దాలు) చోళులని వాదిస్తే రెండు ప్రతివాదాలు ఉదయిస్తాయి. ఒకటి, వారి రాజ్యం ఉత్తరం వయిపు తొండై మండలందాకా వ్యాపించిలేదు; రెండు, ఆకాలంలో శివుడి గుళ్ళు ఏవీ ఉన్నట్లు తెలియదు.

తిరుక్కళుక్కున్రమ్ ఆలయాలు (ఒరుకార్మండపం,వేదగిరీశ్వర ఆలయం) మహేంద్రుడికి తరువాతవి. కొండకిందఉన్న భక్తవత్సల ఆలయం ప్రాకారం లోపల గజపృష్ఠాకారంకల గుడి స్కందశిష్యుడి కాలంనాటిది అని కొందరి అనుమానం (బాలసుబ్రమణ్యం 1968) తిరుక్కళుక్కున్రమ్ మీద తిరునావుక్కరసర్ రాసిన తిరుత్తాండకమ్ ఈ ఆలయాలలో దేనిని గురించి చెప్పదని ఇక్కడ గట్టిగా నొక్కి చెప్పాలి

## 2. తిరునావుక్కరసర్-తిరుజ్ఞానసంబందర్

1895 లోనే సుందరంపిళ్లై తిరునావుక్కరసర్ కాలాన్ని నిర్ణయించటానికి శేక్కిళర్ పురాణా (తిరుమ్మురైక్కండ పురాణా)న్నీ, పెరియ పురాణాన్నీ బాగా వాడుకున్నాడు. కూన్ పాండ్యన్ అనే అతను జైనమతంనుంచి శైవానికి మారటం "సంబందుడి జీవితంలోకెల్లా అతి ముఖ్యమయిన చారిత్రిక అంశం"గా పరిగణింపబడుతోంది. కాల్డ్వెల్ (1875), నెల్సన్ (1868)లు ఇద్దరూ తిరుజ్ఞాన సంబందర్ క్రీ. పూ. 13వ శతాబ్దం (1292) లోనూ, క్రీ. పూ. 14వ శతాబ్దంలోనూ (1320) జీవించినవాడుగా ఊహించారు. సుందరం పిళ్లై ఈ ఊహని ఖండిస్తాడు—వీరి ఊహ "betrays such an absence of the sense of historical perspective as cannot but produce the most amusing and grotesque results" అని ఆయన అంటాడు.

సుందరం పిళ్లై ఉమాపతి శివాచార్యుడి కాలాన్ని తన వాదానికి మూలాధారంగా వాడుకుంటాడు. ఆయన కండరాదిత్యుడి కాలం దాకా చరిత్రని వెనకకి తీసుకు వెడతాడు. తిరుజ్ఞాన సంబందర్ రోజులలోనే తంజావూర్ ఉండేదని ఆయన వాదిస్తాడు; తేవారమ్‌లలో మొదటి పరాంతకుడి ప్రసక్తి లేదంటాడు. చిదంబరం గుడి శాసనాలలో ఈ రాజు గుడికప్పుమీద బంగారు రేకు వెయ్యటం గురించి ఏమీ లేకపోవటం గమనించతగిన విషయం అని ఆయన అంటాడు. అంతే కాక, మొదటి పరాంతకుడి వంశం కోచ్చెంగణ్ణాన్ వంశంనుంచి పుట్టినదే—"బహుశ పాతచోళవంశం, కాంచి పల్లవులతో చేసుకున్న సంబంధంయొక్క ఫలితం—అని కూడా ఆయన అంటాడు." కోచ్చెంగణ్ణాన్ అస్తమయానికీ పరాంతకుడు, కండరాదిత్యుడూ చెందిన కొత్త చోళ వంశంవయికి రావటానికీ మధ్య చాలా కాలంపాటు అయోమయస్థితి కొనసాగినట్లు తోస్తుంది అని ఆయన అంటాడు. అంటే, తిరుజ్ఞాన సంబందర్ కాలాన్ని నిర్ణయించటానికి కోచ్చెంగణ్ణాన్ కాలాన్ని ఒక పరిమితిగానూ, కండరాదిత్యుడి కాలాన్ని మరొక పరిమితిగానూ ఆయన తీసుకున్నాడన్నమాట. ఈ పరిమితుల మధ్యకాలాన్ని మరింత సంకుచితం చేసేందుకు శ్రీ పిళ్లై శంకరాచార్యుల సౌందర్య లహరిలోని "ద్రావిడశిశు" అన్నమాట వాడకాన్ని గురించి రాస్తాడు. 'ద్రావిడశిశు' అన్నమాట తిరుజ్ఞాన సంబందర్‌కి ఉన్న మరొకపేరు "ఆళుడయప్పిళ్ల"తో సమానం అని ఆయన వాదం. ఆదిశంకరాచార్యులు క్రీ. పూ. ఏనిమిదవ శతాబ్దంనాటి వాడనీ, ఆ రోజులలో సంబందుడు సుప్రసిద్ధుడేనని ఆయన వాదిస్తాడు.

సుందరంపిళ్లై ఇదంతా రాసి షుమారు ఏనభయి సంవత్సరాలు అయింది. ఈమధ్యకాలంలో చరిత్ర, శాసనాల విషయంలో చాలా అభివృద్ధి జరిగినదని గమనించటం అవసరం. పాత ఊహలు, నిర్ణయాలని ఎన్నిటినో తిరిగి పరిశీలించటం ఏంతయినా వాంఛనీయం. ఆయన సిద్ధాంతాన్ని ఈ కిందివిధంగా సవరించాలి.

(1) సుందరం పిళ్లై "విలువకల సమాచారాన్ని" శేక్కిళర్ పురాణం, తిరుమ్మురైక్కండ పురాణాలనుంచి తీసుకున్నారు. క్రీ. శ. 14వ శతాబ్దానికి చెందిన ఉమాపతి శివాచార్యుడే రెండింటినీ రాశాడని చాలాకాలంగా భావింపబడింది. కొంతకాలంగా ఈ గ్రంథాల కర్తృత్వం గురించి పెద్ద సందేహాలు బయటపడుతూ వచ్చాయి. రచయిత ఉమాపతి కాడనీ, అసలు ఈ గ్రంథాలు 16/17 శతాబ్దాలకి చెందినవనీ భావించబడుతోంది.

(సదాశివ పండరత్తార్ 1963.)

(2) కూన్ పాండ్యన్ ఎవరు, అన్న ప్రశ్నకి ఇంతదాకా సంతృప్తికరమయిన సమాధానం దొరకలేదు. ఈ పేరుకల పాండ్యరాజు క్రీ. శ. 640-670కి చెందిన మారవర్మన్ అరికేసరి అయి ఉంటాడని కొందరి అనుమానం (సుబ్రమణ్యం 1955) ఈ అనుమానానికి సహజమయిన, పదార్థ నిష్కల ఆధారాలు లేవు. ఇద్దరూ ఒకరే అనటానికి చారిత్రిక సాక్ష్యంకాని శాసనాల సాక్ష్యంకాని లేదు. వెళ్విక్కూడి తామ్రశాసనాలు, ఇరయినార్ అకప్పొరుళ్‌లోని వ్యాఖ్యలు (22, 106, 235, 309 పద్యాలు) మారవర్మన్ అరికేసరి విజయాలని ప్రశంసిస్తాయి. రెండవ గ్రంథం అతని శివభక్తిని మెచ్చుకుంటుంది (పద్యాలు 250. 279) వెళ్విక్కూడిదానం అతను హిరణ్యగర్భ, తులాభార దానాలు చేసినట్లు చెప్తుంది. ఇవి క్షత్రియులు చెయ్యతగిన దానం అని అంటుంది. ఈ సాక్ష్యం అతను జైన మతస్థుడని సూచించదు. ఇటువంటి వ్యక్తిని "కూన్" (గూనె) అనే నిందాపదంతో వర్ణిస్తారా? అతనికి గూనె ఉన్నప్పటికీ? ఇటువంటి సందేహాలు కూన్‌పాండ్యన్, మారవర్మన్ అరికేసరులు ఒకరే కారని సూచించటమే కాక గూనెరాజు కాల్పనికవ్యక్తి అని కూడా సూచిస్తాయి.

(3) తిరుజ్ఞాన సంబందర్ తేవారాలు మొదటి పరాంతకుడి పేరు చెప్పవు. భక్తి ప్రధానమయిన సాహిత్యంలో అందరి రాజుల పేరులూ ఉంటాయని అనుకోవాలా? చిదంబరం గుడికప్పు బంగారం తొడగటాన్ని గురించి శాసనాలలో లేకపోవటాన్ని సుందరంపిళ్లై గమనించారు. తదనంతరం బయటపడిన తిరువాలంగాడు, లైడెన్ తామ్రశాసనాలు తిల్లై దేవాయతనాన్ని బంగారుతోకప్పి అలంకరించటానికి ఈరాజు దానం ఇవ్వటాన్ని స్పష్టంగా పేర్కొంటాయి.

(4) మొదటి పరాంతకుడి వంశం "పాతచోళ", పల్లవ వంశాల మధ్య వివాహం యొక్క ఫలితం అయిఉండాలని సుందరం పిళ్లై అనుమానం. విజయాల ముడికి ముందుకాలంనుంచి మొదటి రాజరాజు కాలందాకా చోళుల చరిత్ర వివరాలు ఏమిటో అంతబాగా తెలియవు. ప్రస్తుతం పల్లవ-చోళ సంబంధాలని గురించి మనకి తెలిసినదికూడా చాలా తక్కువే. అయినా, మనకి లభ్యంఅయ్యే శాసనాలు సుందరం పిళ్లై ఊహని బలపరచటంలేదు. బలపరచకపోగా వాటిలో మొదటి ఆదిత్యుడి కొడుకులలో ఒకడిలో రాష్ట్రకూట రక్తం ప్రవహించిన దనటానికి ఆధారంఉంది (సదాశివ పండరత్తార్ 1967.) మొదటి పరాంతకుడి తల్లిని గురించి మనకి ఏమీ తెలియదు.

(5) కోచ్చెంగణ్ణాన్ అనేరాజు కాలం తిరుజ్ఞాన సంబందర్ కాలానికి దిగువపరిమితి అయిఉండాలనిసుందరంపిళ్లై నిర్ణయించాడు. ఈ కోచ్చెంగణ్ణాన్ తరువాతి చోళుల పూర్వీకుడయి ఉంటాడని ఆయన అభిప్రాయం. ఈ కోచ్చెంగణ్ణాన్ ఎవరు?

నీలకంఠశాస్త్రి (1955) ప్రకారం "కలికాలుడి జీవితం లాగే కోచ్చెంగణ్ణాన్ జీవితంకూడా తన చుట్టూ ఒక కథల మసక తెరని ఆకర్షించుకుంది." ఈ రచయిత మనల్ని చక్కగా హెచ్చరిస్తారు: "సమకాలీనాధారాలలోని యదార్థాలని అనంతర కాలాల నమ్మకాలతో కలిపివెయ్యకుండా జాగ్రత్తపడటం అవసరం." పురనామూరు (74) సంకలనంలో ఈ రాజుపేరు కనిపిస్తుంది. పొయిగైయార్ రాసిన "కలవలి" అనే కావ్యంలోకూడా ఇతనిపేరు వస్తుంది. ఇవి రెండూ సంగంకాలపు రచనలుగా చెప్పబడుతున్నాయి. తిరుజ్ఞాన సంబందర్ తేవారాలలో అతను కనిపిస్తాడు. తిరుమంగై ఆళ్వార్ ప్రబంధాలలోనూ కనిపిస్తాడు. శాసనాలలో అతని పేరుకల అతి ప్రాచీనమయినది (వంశక్రమంలో అతనిపేరు మారుతూఉంటుంది) "10, 11 వ శతాబ్దాల చోళ తామ్ర శాసనాల పౌరాణిక వంశానుక్రమణిక" కలది (సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్ పుట 152-3; 253; 377-9). దీనంతటినీబట్టి మనం గ్రహించగలిగినది ఏమిటంటే, ఈ వ్యక్తికి సంబంధించిన కథలు మొదట సాహిత్యంలోకి ప్రవేశించి తరువాత రాగిశాసనాలలోకి ఎక్కిఉండాలని. రాగిశాసనాలకి ముందే చెక్కబడిన రాతిశాసనాలలోకూడా కోచ్చెంగన్‌పేరు నేరుగ కనిపించక పోవటం గమనించతగిన విషయం.

చోళుల చరిత్రలో కోచ్చెంగణ్ణాన్ సమస్య చాలా గడ్డు సమస్యగా తయారయింది. ఈ సమస్యని పరిష్కరించాలంటే "పురనామూరు" కాలాన్నిగురించి మౌలిక పునరాలోచన చెయ్యవలసి ఉంటుంది. (సంగమ్ సాహిత్యాన్ని గురించి కూడా) అప్పుడుగాని అతను ఎవరో, అతని కాలంఏదో సరిగ్గా తెలియదు-అతను చోళుల పూర్వీకుడా, మనకి తెలిసిన మధ్యయుగపు చోళుడా అన్న విషయం తేలదు. అంతదాకా అతను సమస్యలతోనిండిన ఒక కాల్పనిక వ్యక్తి అనే అనుకోవాలి.

(6) సుందరంపిళ్లై ఆది శంకరుడి కాలం క్రీ. శ. 7 వ శతాబ్దం అంటాడు. ఈ వివాదం ఇంకా తీరలేదు కాని ప్రస్తుతం అత్యధికులు శంకరుడిని 8 వ శతాబ్దంచివరి భాగంలోగాని, 9 వ శతాబ్దం మొదటి భాగంలోగాని జీవించిన వ్యక్తిగా పరిగణిస్తున్నారు. "సౌందర్యలహరి" కర్తృత్వాన్ని గురించి పెద్ద సందేహాలుకూడా వ్యక్తం అయినాయి. రచయిత ఆదిశంకరుడేనా, లేదా పీఠాధిపతులకి ఉండే శంకరాచార్యుడనే పేరుకల మరొక గురువా అని కొందరు అడుగుతున్నారు. ఆధునిక పండిత లోకంలో ఎక్కువమంది ఈ రచన ఆదిశంకరుడిది కాదన్న అభిప్రాయం వయిపే మొగ్గుతున్నారు. (బలదేవ ఉపాధ్యాయ 1950, సచ్చిదానందేంద్ర సరస్వతి 1963.)

అంటే షుమారు 80 సంవత్సరాలకింద చారిత్రిక ప్రమాణాలుగ సుందరం పిళ్లైచేత స్వీకరింపబడిన ఆధారాలు నేడు అనుకున్నంత అర్థవంతంగా కనిపించటంలేదు. అవి పురాణగాథలు కావచ్చు లేదా తమ స్వరూపాన్నీ, సందర్భాన్నీ కోల్పోవచ్చు లేదా పరిణామం చెందవచ్చు. ఈ ధోరణులనీ, మారిన పరిస్థితినీ అర్థంచేసుకోవకుండా తిరుజ్ఞాన సంబందర్ క్రీ. శ. 7వ శతాబ్దంలోనే జీవించాడని పిడివాదంచేసి ప్రయోజనంలేదు.

తిరుజ్ఞాన సంబందర్, తిరునావుక్కరసర్‌లు సమకాలికులు అనుకోవటానికి పెరియ పురాణంలో శేక్కిళర్ చెప్పిన మాటలు తప్ప వేరే సాక్ష్యంలేదు, తిరుజ్ఞాన సంబందర్ బాల్యంలో జరిగిన అద్భుతాలని విని తిరునావుక్కరసర్ శీర్కాళికి వచ్చాడని పెరియ పురాణం కథ; అప్పటికి తిరుజ్ఞాన సంబందర్‌కి షుమారు ఏడేళ్లు మాత్రమే, తిరునావుక్కరసర్ వార్ధక్యంలోకి ప్రవేశించాడు. శేక్కిళర్ చెప్పిన కాల్పనిక కథని బలపరచే ఇతర సాక్ష్యం లభించేదాకా దానిమీద అంతగా ఆధారపడటం మంచిదికాదు.

## 3. నరసింహవర్మ II, సుందరర్

ఈ శతాబ్దం ప్రారంభంనుంచి ఎందరో పండితులు సుందరర్ కాలాన్ని గురించి చర్చించారు. ఇటీవలే దొరైరంగస్వామి (1958), వెళ్లైవరణన్ (1962) ఈ సమస్యని సమగ్రంగా పరిశీలించి తమ అభిప్రాయాలని తెలిపారు. అయినా, సుందరర్ కాలంమీద ఇంకా పరిశోధన, పునరాలోచన జరుగవలసిఉంది. ఈ సాహిత్యాన్ని స్థూలంగా పరిశీలించినట్లయితే సుందరర్ రచనలనే కొంతపక్షపాతంతో ఆధారంగా తీసుకొనటం జరిగినదని తెలుస్తుంది. తేలిన తేదీలు కొన్ని మచ్చుకి ఈ కింది విధంగా ఇవ్వవచ్చు.

1. సుందరర్ నరసింహవర్మ II రాజసింహుడి (క్రీ. శ. 690/1-729/9) సమకాలకుడు.
   మహాలింగం (1969)
   వెళ్లైవరణన్ (1962)
   సదాశివ పండరత్తార్ (1937)
2. సుందరర్‌నందివర్మ II పల్లవ మల్లుడి (క్రీ.శ.731-796) సమకాలికుడు
   నారాయణ అయ్యర్ (1936)
3. సుందరర్ దంతివర్మ (క్రీ శ 796-846) సమకాలికుడు
   శ్రీనివాసపిళ్లై
4. సుందరర్ నందివర్మ III (క్రీ. శ. 846-869) సమకాలికుడు.
   మీనాక్షి (1938)
   రాజమాణిక్కమ్ (1960)

దొరై రంగస్వామి (1958), వెళ్ళైవరణన్ (1962) సుందరర్ రాజసింహుడి తరువాత వాడనే వారి వాదనలని ఎంతో కష్టపడి ఖండించారు. ఈ పనిచేసేప్పుడు, తమ వాదనలని వివరించేప్పుడు రాగావేశాలని అధికంగా ప్రదర్శించారు. ఇది శాస్త్రీయ పరిశీలనలో తగదు.

సుందరర్ ఒకచోట కాడవర్ కోన్‌ని గురించిరాస్తూ "కడల్ సూళ్నద ఉలకెలామ్ కాక్కిన్ర పెరుమాన్ కాడవర్ కోన్ కళర్చ్చింకన్" (సముద్రంచేత చుట్టబడి ఉన్నభూమిని ఏర్‌కాదివ రాజా) అంటాడు. ఇందులో క్రియకి వర్తమానకాలం వాడకాన్ని గమనించాలని వెళ్ళైవరణన్ అంటాడు. "కడల్‌సూళ్నద" అన్న వర్ణన అతిశయోక్తి అని అంగీకరించాలి. ఎందుకంటే, ఏ పల్లవరాజా భారతదేశంయొక్క ద్వీపకల్పాన్ని ఏలలేదు సముద్రం చుట్టూకల భూభాగం ఇదేకదా? ఇక వర్తమానకాలం వాడకం కవి ఛందస్సు కోసం చేసుకునే సర్దుబాట్లనిపట్టి ఉంటుంది. అది సమకాలీన చారిత్రిక సంఘటనకి వర్తిస్తుందనటం సరి కానేకాదు.

ఈ పదజాలానికి ఎంతోవివరంగా, విస్తారంగా అర్థం కల్పించటానికి దొరై రంగస్వామి (1958) ప్రయత్నిస్తారు. రాజసింహుడు బంగాళాఖాతం అవతల చీనా, శ్రీలంకలతో దౌత్యసంబంధాలు కలిగి ఉండవచ్చు; ఆగ్నేయ ఆసియాలో ఇతర ప్రాంతాలతో కూడా అతను దౌత్యసంబంధాలు కలిగి ఉండవచ్చు; అతనికి బలమయిన నౌకాదళం ఉండటానికి మంచి అవకాశాలు ఉండి ఉండవచ్చు; కానీ ఈ ప్రాంతాలన్నిటినీ అతను ఏలాడని నిస్సందేహంగా చెప్పలేము. ముందే ఒక నిర్ణయానికి వచ్చి దానిని సమర్థించటానికి కొంచెంగా తెలిసిన స్వల్పమయిన సాక్ష్యాన్ని కృత్రిమంగా వాడటం అంటే ఇదేకదా? రాజుల విజయాలు, సాహస కార్యాలు కవిత్వంలో అతిశయోక్తితో వర్ణించబడుతూ ఉంటాయి. కవిత్వానికి ఉత్ప్రేక్ష అవసరం అని సంప్రదాయం చెప్తుంది. సుందరర్ వర్ణనలో ఈ గుణం కావలసినంత ఇమిడి ఉంది. కళర్‌చ్చింకన్‌కోసం దీనిని ఇంకా అధికంచెయ్యటం అనవసరం.

ఈ కళర్‌చ్చింకమే రాజసింహుడని నిరూపించటానికి వింత తర్కం వాడబడుతూ ఉంటుంది. రాజు అసలుపేరు చింకన్‌ట, అతని బిరుదు కళగ్ అతని సాహసానికి గుర్తులు. రెండవ నరసింహవర్మన్‌కి రాజసింహ, క్షత్రియసింహ, నరసింహ అనే బిరుదులు ఉండటం సామ్యంగా చెప్పబడుతూ ఉంటుంది. రాజ, క్షత్రియ, నర–అన్న పదభాగాలు 'కళర్'తో సమానం అని వాదించబడుతోంది. (వెళ్ళైవరణన్ 1962)! దొరై రంగస్వామి మహాలింగం కూడా 1969) 'కళర్' అంటే కాలికి వేసుకునే ఒక వీరాభరణం అంటారు. పేరు పొందిన వీరులు ఈ మాటని బిరుదుగా వాడుకునే వారుట. అయితే, ఎన్నో బిరుదులున్న రాజసింహుడు–వీటిలో చాలా అతని శౌర్యాన్ని చాటేవే–కళర్‌చ్చింకన్‌గా (కాలికి వీరాభరణం ధరించిన సింహంగా) ఎక్కడా వర్ణింపబడకపోవటం ఆశ్చర్యం.

సుందరర్, శేక్కిళర్‌లు ఇద్దరూ 'కాడవ' అన్నమాటని కళర్‌చ్చింకన్ విషయంలో సార్థకమయిన బిరుదుగా వాడుతారని అనుకోవాలి. ఈ మాటకే 'కాడువెట్టి' అన్న రూపాంతరం ఉంది. ఈ రెండు మాటలూ పల్లవులని వర్ణించటానికి ఉపయోగింపబడేవని కొందరు వాదిస్తారు. క్రీ. శ. 7, 9 శతాబ్దాలమధ్య కన్నడ శాసనాలు (తరువాతి కాలాని కూడా) పల్లవ, కాడవ వంశాలని వేరుగా పేర్కొన్నట్టు తోస్తుంది, (లిపి. కర్ణా సీరగుండ) బహుశకాడువెట్టి వంశం పల్లవుల వంశపు శాఖ అయి ఉండవచ్చు. ఈ వంశం పల్లవులకి లోబడి ఉన్న వంశం కావచ్చు. ఈ వంశపు రాజులు కొందరి పేరుల చివర "చింకన్" అన్న పదం కనిపిస్తుంది. కాడవ–కాడువెట్టి చరిత్ర ఇంకా రాయవలసి ఉంది. ఇటువంటి పరిస్థితులలో కళర్‌చ్చింకన్‌కోసం పల్లవ వంశాన్ని మాత్రమే గాలించటం ప్రమాదకరం కాదా? పరిశోధన ఇంకా జరుగవలసి ఉందికదా?

సుందరర్ సమస్యకి సంబంధించిన మరొక విషయాన్ని గురించి ఒక వ్యాఖ్య చెయ్యాలి కాంచీపురంలోని కైలాసనాథాలయాన్ని రాజసింహుడు కట్టించాడు, దీని నిర్మాణానికి పూసలార్ అనే భక్తుడి కథకీ సంబంధం ఉంది అని కొందరు అంటారు. (సదాశివ పండరత్నార్1957, వెళ్ళైవరణన్ 1962.) మహాలింగం (1969) అన్నట్టు "వ్యక్తులు ఇద్దరూ ఒకరే అన్న వాదాన్ని సప్రమాణంగా ప్రతిఘటించటానికి కావలసినంత అవకాశం ఉంది. కాడవర్‌కోన్ అయిన రాజసింహుడు కాంచీపురంలో రాతిగుడిని కట్టినమాట నిజం. పెరియపురాణంలోని పూసలార్ జీవిత కథ కూడా ఈ రెండు వివరాలనీ సూచిస్తుంది. కాని, కైలాసనాథుడి గుడిశాసనం రాజసింహుడికి అకాశవాణి వినిపించినట్లు చెప్పగా శేక్కిళర్ శివుడు కలలో కనిపించటాన్ని గురించి మాత్రమే చెప్తాడు. అంతేకాక శేక్కిళర్‌కి ముందు జీవించిన నంబిఆండార్‌నంబి పూసలార్ కట్టించిన గుడిని పేర్కొంటాడు కాని కాంచిలోని పల్లవరాజునీ, అతని రాతిగుడినీ పేర్కొనడు. ఈ ఆలయం ఒక అభూత కల్పన."

## విమర్శ-1

పంతొమ్మిదవ శతాబ్దంచివర, 20వ శతాబ్దం మొదటిలో తమిళనాడులో సాహిత్య, చారిత్రిక కార్యక్రమాలు చురుకుగా జరగటం మొదలుపెట్టాయి. ఈ కాలంలోనే ప్రాచీన సాహిత్య గ్రంథాలు ఎన్నో బయటపడటం, వాటి ముద్రణ జరగటం సంభవించింది. కవిత్వానికి కొత్తకాల్పనికపు రెక్కలు మొలిచాయి. పత్రికలద్వారా తమిళభాష విస్తరించింది. కథ, నవల, నాటకంవంటి కొత్త సాహిత్య ప్రక్రియలు వాడుకలోకి వచ్చాయి. ప్రాచీన నిర్మాణాలని అనుశీలించటం మొదలుపెట్టారు, శాసనాలని చదవటం మొదలు పెట్టారు. పురావస్తు శాస్త్రం, శాసనాల రంగంలో పనిచేసేవారికి శైవ నాయన్మారుల, వైష్ణవ ఆళ్వారుల రచనలు మార్గాన్ని చూపించాయి. ప్రభుత్వంవారు ఉన్నత విద్యాలయాలలో సాహిత్య శిక్షణకి కేంద్రాలు ఏర్పరచారు. సాహిత్యం, సంస్కృతి, చరిత్ర, ఇతర శాస్త్రాలకి ఇవి పంగమ స్థానాలయ్యాయి. తమిళనాడు చరిత్ర పునర్నిర్మాణ ప్రయత్నాలు ఈ వాతావరణంలో జరిగాయి. అప్పటిలో దక్షిణదేశపు

వివిధ భాగాలని పాలించిన రాజవంశాలని గురించి చాలా తక్కువ తెలిసి ఉండేదని మరిచిపోకూడదు. కొన్ని వందల శాసనాలు బయటపడి ఉన్నాయి కాని క్రమరాహిత్యం వలన అవి సమన్వయ పరచబడలేదు: మచ్చుకి ఏవి తీసుకోవాలో ఇంకా బాగా తెలియలేదు. అప్పుడు లభ్యమయిన ఆధారాలు కొన్ని సాహిత్య గ్రంథాలు మాత్రమే – మతానికి సంబంధించినవీ, లౌకికమయినవీ. సుందరంపిళ్ళై పరిశోధనలు (టి. ఎ. గోపీనాథరావు, వెంకయ్య, హుల్ట్‌జ్ మొదలయిన చరిత్ర పరిశోధకులవికూడా) లభ్యమయిన ఆధారాలవలన పరిమితమయి ఉండటం సహజం. 70-80 సంవత్సరాలకింద వారు వెల్లడించిన అభిప్రాయాలూ, నిర్ణయాలూ వేటి సందర్భంలో ''నాణానికి ఒక వయిపుగా'' మాత్రమే తోస్తాయి.

ఒక అర్థ శతాబ్దం పయిగా వెలువడిన చరిత్ర, శాసనాల వివరాలని పాత విషయాలతో కలిపి చూడటం సముచితంగా ఉంటుంది. అప్పుడే ''నాణెం అవతలపక్క'' అర్థం అవుతుంది. మన నమ్మకాలూ అభిప్రాయాలూ, భావాలూ సరయినవో కావో తెలుసుకొనటానికి కూడా ఇటువంటి అనుశీలన అవసరం.

సాహిత్యాధారాలనుంచి గాఢానుశీలద్వారా సేకరించిన ''ఆంతరంగిక సాక్ష్య''నికి చారిత్రిక పరిశోధనలో తప్పకుండా విలువ ఉంది. అయితే, ఒక ప్రశ్న ఉదయిస్తుంది: ''అన్నిరకాల సాహిత్యంనుంచీ నిజమయిన చారిత్రిక సమాచారం వస్తుందని ఎదురు చూడవచ్చునా?'' ఏన్నో భాషల ప్రాచీన సాహిత్యంలో సిసలయిన రచన కొరత ఎంత ఉందో చరిత్ర విద్యార్థులందరికీ తెలుసు. ఒకరాజు, లేక ఒక ప్రభువు లేక ఒక చోటు లేక ఒక సంఘటనని వర్ణించే కథనాలని వదలివేస్తే–వీటిలోకూడా అతిశయోక్తిని తగినంతగా విస్మరించాలి–భక్తికి, తెగలకి ప్రాముఖ్యతని ఇచ్చే పుస్తకాలలో ప్రమాణమయిన చారిత్రికాధారాలు ఉంటాయని ఎదురుచూడలేము. ఒకవేళ ఉన్నప్పటికీ తక్కిన దారాలతో చిక్కుపడిపోయిన చరిత్ర–సూత్రాలని విడదియ్యటానికి ఉపయోగపడే దృష్టి పూర్తిగా వస్తునిష్ఠ రహితమయినదిగా ఉంటూ ఉంటుంది. ఈ పద్ధతిలో పౌరాణిక సంఘటనలు చరిత్రగా తోచవచ్చు, పౌరాణిక వ్యక్తులూ రక్తమాంసాల కల యదార్థ వ్యక్తులూ ఒకరే అని నిరూపించే ప్రయత్నాలు జరుగవచ్చు. కొన్నెప్పుడు పయికి ఎగుర వెయ్యబడిన ఇటువంటి చరిత్రకథనాలు అర్థంమారే పరిమితిదాకా, ఆ పరిమితిని మీరి సాగదియ్యబడిన కొన్ని మాటల సహాయంతో మరింత పయికి ఎగసిపోతూ ఉంటాయి. ఈ ప్రమాదాలదృష్ట్యా శాసనాలు, వాస్తుశాస్త్రం మొదలయిన వాటి ''బయట సాక్ష్యం'' విలువ, స్వరూపం తూచబడినదాకా ఆంతరంగిక సాక్ష్యం పరిశీలనని ఆపి ఉంచవచ్చు.

సాధారణంగా శాసనాలు సాహిత్యంకన్నా నమ్మదగిన సమాచారాన్ని ఇస్తాయని అంటే అతిశయోక్తి కాదు. ఈ ప్రయోజనం ఉంది కనుక ఈ సమాచారంతో కాలక్రమ నిర్మాణం చేసుకుని దానితో సాహిత్యాధారాన్ని సమన్వయపరుచుకోవచ్చు. ఇటీవల జరిగిన పరిశీలనల ఫలితంగా (స్వామి 1972a) ఆలయాలలో ''తిరుప్పదియమ్'' అని చదివే అలవాటు మొదటి పరాంతకుడి కాలంలో మొద

లయినట్టు తేలింది (139 సంఖ్య – 1935, క్రీ. శ. 910; 99 సంఖ్య 1928 29 క్రీ. శ. 942; 111 సంఖ్య 1925, క్రీ. శ. 943). ఇది ఒక ఉదాహరణ. మరొకటి, మొదటి రాజ రాజు కాలంలోనే తేవారం త్రయం విగ్రహాలని ఆలయాలలో ప్రతి ష్ఠించే అలవాటు ప్రారంభం అయినదన్న విషయం (299 అంకె 1917, క్రీ. శ. 995; 68 అంకె 1927/28 క్రీ.శ.1006! 3760. 1920 క్రీ. శ. 1032) వెళ్లై వరణన్ (1952) తిరుప్పద్దియమ్‌ల అర్పణని మొదటి ఆదిత్యుడి కాలానికి తొయ్యాలని అంటారు ఈ ఊహకి ఆధారాలు రెండు రాజకేశరి శాసనాలు; కాని మొదటి ఆదిత్యుడికి ఈ బిరుదు ఉన్నదో లేదో తెలియదు. రెండు శాస నాలూ తిరుచి జిల్లాలోనివే. ఒకటి ఆరాజు పాలనాకాలంలో మూడవ సంవత్సరానికి చెందినది, మరొకటి ఆరవ సంవత్సరానిది. రెండూ గండరాదిత్యుడి కాలానివి అయిఉంటాయి. అందుచేత, తేవార త్రయాన్ని పేర్కొనే విశ్వసనీయమయిన ప్రసక్తి చోళులకాలం ప్రారంభంలోనే, అంటే క్రీ. శ. 10వ శతాబ్దంలోనే కనిపిస్తాయి. (స్వామి 1972a)

ఇంతకిముందే ఈ రచనలో తేవారం త్రయాన్ని సింహవిష్ణు సంతతికి చెందిన పల్లవరాజుల కాలం వారివిగా అంటే క్రీ. శ. 7వ శతాబ్దం వారివిగా, చిత్రించటానికి ఉపయోగపడిన ఆధారాలు నమ్మ తగినవికావనీ, సందిగ్ధ స్వభావం కలవనీ చూపించబడింది. ఒక ప్రశ్న సహజంగా ఉదయిస్తుంది-7-10వ శతాబ్దాలమధ్య ఈ భక్తుల రచనల సంగతి ఏమిటి, అన్న ప్రశ్న. ఈ ప్రశ్నకి సమాధానంగా అభి మానంతో నిండిన కథలు, పురాణ గాథలు చూపించబడుతాయి. తేవారం రచనలు కొంతకాలందాకాపోయి మళ్లీ కనిపెట్టబడ్డాయని చెప్పబడుతుంది!

ఇక్కడ కాలవైరుధ్యంకల విశేషం ఒకటి ఎదురవుతుంది. తేవారం రచనని క్రీ. శ. 985-1014నాటి మొదటి రాజరాజే బయటికి తీసుకువచ్చాడని సాధారణంగా చెప్పబడుతుంది. (నీలకంఠ శాస్త్రి 1955a) అన్నామలై వర్సిటీ వారు మాత్రం క్రీ. శ. 871-907 నాటి మొదటి ఆదిత్యుడే ఈపని చేశాడని అంటారు (వెళ్లైవరణన్ 1962) చిదంబరం నటరాజుగుడి లోని రెండవ ప్రాకారంలో ఒక చోటు చూపించి ఇక్కడే "తేవారా"లు పయురాజు లలో ఒకరిచేత నంబి-ఆండార్ నంబి సహాయంతో తిరిగి కనిపెట్ట బడినట్లు కొందరు చెప్తారు. లోపలి ప్రాకారాలు రెండూ మొదటి కులోత్తుంగుడు (క్రీ. శ 1070-1120), అతని కొడుకు విక్ర ముడి కాలంలో (క్రీ. శ. 1118-1135) కట్టబడినదనటానికి వివాదానికి తావు ఇవ్వని శాసనాల సాక్ష్యంఉంది. సాహిత్యం (ఇక్కడ తిరుమురైక్కండ పురాణం) సహాయంతో చేసిన ఊహ శాసనాల సహాయంతో చేసిన ఊహకి ఎంత భిన్నంగా ఉంటుందో తెలుపటానికి ఈ ఉదాహరణ పనికివస్తుంది. ఈ ప్రాకారాలు అంతకిముందే, మొదటి ఆదిత్యుడికాలంలో, ఉండగా అవి వాటంతట అవే నాశనం అవగా, వాటిని మొదటి కులోత్తుంగుడూ, అతని కొడుకూ పున ర్నిర్మించారనే వాదం పురాణంకథకి సరిపోతుంది కాని చరిత్రకి తగదు.

తమిళ సాహిత్య చరిత్రలని రాసేవారు సంగంకాలపు స్వర్ణ యుగం క్రీస్తుశకపు మొదటి మూడు శతాబ్దాలలో వర్ధిల్లుతూ ఉండగా కాలా భులనేవారు దానిని చెడగొట్టారని చెప్తారు. ఈ కాలా భ్రులు అన్నిచోట్లా కనపడే అజ్ఞాతులనికూడా చెప్పబడుతుంది. వీరు పాలీ, ప్రాకృతాలని ప్రవేశపెట్టిన తమిళభాషా, సంస్కృతుల శత్రువులుగా వర్ణింపబడుతారు. ఆ తరువాతి మూడునాలుగు శతా బ్దాలదాకా ఈ పరిస్థితి కొనసాగిందిట; వారి వెనుకనే క్రీ. శ. ఏడవ శతాబ్దంలో వచ్చిన పల్లవులకి ప్రాకృత, సంస్కృత భాషా పక్షపాతం ఉండేదిట, వారు తమిళాన్ని అశ్రద్ధ చేశారుట (సదాశివ పండరత్తార్ 1957) కాని, ఇదంతా చెప్పినవారే తేవారం త్రయంవారు పల్లవ రాజులమీద వింతో ప్రభావాన్ని చూపగలిగారని చెప్పి తాము చెప్పిన దానిని నమ్మమంటారు. ఈ తేవారం త్రయంవారు తమిళంలో వేలకొద్ది తిరుప్పద్దియమ్‌లు రాశారని వీరివాదం (వెళ్లై వరణన్ 1962.) ఇటువంటి సిద్ధాంతాలని చెప్పటానికి సాక్ష్యం ఏమయినా ఉందా? క్రీ శ. ఆరవ శతాబ్దందాకా ఏమి జరిగిందన్న ప్రశ్న ఇప్పుడు మనకి ముఖ్యం. 7వ శతాబ్దపు పరిస్థితులూ, వాతావరణమూ తేవారాలని పుట్టించినవిగా భావించబడుతోంది. ఈ భావనని మనం పరిశీలిస్తున్నాము. తరువాతి కాలంలో క్రమంగా పేరుకున్న పాత సమాచారాన్ని కొత్త దృష్టితో పరిశీలించినట్లయితే మా తం ప్రస్తుతం చెలామణిలోఉన్న పేచీ – వాదానికి అన్నివిధాలుగానూ భిన్నంగా కనిపించే కథనమూ, పరిస్థితీ కనిపిస్తాయి. వీటితో సంబంధంకల విషయాలని ఇప్పుడు పరిశీలిద్దాము.

(ఇంకావుంది)

(1) వీటిలోకొన్ని:

| | | |
|---|---|---|
| క్రీ. శ. 1200 | హరిహరుడు | శివగణదరగళె లేక పురాతనర రగళె |
| ,, | ,, | అరవత్తుమూవరు పురాతనర కథాగర్భిత సార |
| క్రీ. శ. 1400 | భీమకవి | బసవపురాణ |
| క్రీ. శ. 1425 | లక్కణ దండేశుడు | శివతత్వచింతామణి |
| క్రీ. శ. 1470 | తోంటదసిద్ధలింగ శివ యోగి | పాల్కురికి సోమనాథ పురాణ |
| ... | పండితారాధ్య | గణసహస్రనామావళి |
| ... | పాల్కురికి సోమనాథ | గణసహస్ర నామావ |
| క్రీ. శ. 1500 | నిజగుణశివయోగి | అరువత్తుమూవర తిప |
| క్రీ. శ. 1500 | సురంగుడు | త్రిషష్టిపురాతనచరిత్ర |

# తెలుగు మాస్టారు (నవలిక)

శ్రీ ఇచ్ఛాపురపు రామచంద్రం

తెలుగు మాస్టారు—పిల్లలకి లోకువ.

ఫరవాలేదు. పిల్లలూ దేముడూ చల్లనివారే. తెలుగు మాస్టారికి సహనం అనంతం, అపరిమితం. ఆయన— పిల్లల్నీ క్షమించగలరు, దేముణ్ణయినా క్షమించగలరు.

తెలుగు మాస్టారు—జీవితానికీ లోకువే!

ఇది—బహు బాధాకరమ్.

కలం విసురుకొద్దీ—మీ గుండెలలో గునపాలు (గుచ్చాలనికాదు మాస్టారూ!...నిజంగా...మనస్ఫూర్తిగా ... హృదయాంతరాలనుంచీ ఉబికి వస్తున్న సానుభూతిని—మీ కందజేయాలనే నా తపన. కుదరటం అయితే—క్షమించెయ్యండి మాస్టారూ! మీరెందరిని క్షమించలేదు!

## 1

సాధారణంగా తెలుగు మాస్టర్లందరూ ఒకేలా ఉంటారు. ఫ్యామిలీ ప్లానింగ్ రోజులలో కూడా గంపెడు సంతానమూ, అరిగిపోయిన చెప్పులు (ఉంటే)—సదా చేతిలో గొడుగూ (కుట్లూ, మాసికలూ ఉంటాయి. శ్రమపడి వెదికితే ఓ మూల—మాస్టారి పేరు కూడా కనిపించవచ్చు గొడుగు గుడ్డమీద) — మరొక చేతిలో సంచీ. (చవక రకానిదే. రోడ్డుపక్క చవగ్గా దొరికితే కూరలు కొనుక్కుని స్కూలుకయినాసరే వెంటపెట్టుకు వెళ్ళేందుకు)—మాసిన, నలభయ్యో నంబరుదో, అరవయ్యో నంబరుదో ఖద్దరుపంచె — పొడుగు చేతుల— కంటిమెడ చొక్కా—చామన చాయ—సుమారయిన ఎత్తు—వడిలిపోయిన శరీరమూ—నూటికి తొంభై ఎనిమిదిమంది తెలుగు మాస్టార్లింతే. మిగిలిన యిద్దరూ—తెలుగు మాస్టార్లు కాజాలరు.

మన ప్రాచీన సంస్కృతికి—చిహ్నం తెలుగు మాస్టారు. కాలం మారినా, తెలుగు మాస్టారు మారరు.

వారి స్థానం—సమాజపు తీరుతెన్నులతో నిమిత్తం లేకుండా—సుస్థిరం.

సుడిగాలి—గడ్డిపోచలని ఏమీచేయదు.

సంఘం—తెలుగు మాస్టారి జోలికిపోదు. కయ్యానికయినా, వియ్యానికయినా ఉజ్జీ కుదరాలికదా?

తెలుగు మాస్టారి హృదయంలోకి చూడగలిగితే — నవనీతమో, మంచిగంధమో తప్ప మరేమీ కనిపించదు. అందుకే అనిపిస్తుంది— తెలుగు మాస్టార్లు—పిల్లలే అని.

తెలుగు మాస్టారు—పిల్లలకి చక్కని తండ్రి.

కోప్పడ్డం ఎరగని శాంతమూర్తి. అందుకే పిల్లలకి ఆయనంటే అతి చనువు.

అర్ధాంగికి మాత్రం ఆయనంటే మహా అలుసు.

తెలుగు మాస్టార్లందరూ అపర సోక్రటీసులే ఏమో!

ఒక్కముక్కలో చెప్పాలంటే—తెలుగు మాస్టారు — మరో ఏసుప్రభువు!

ఎంత అమాయకత్వం!

బదిలీచేస్తే—ఊరొదిలి పోడమే తప్ప— ఎవరినో ఆశ్రయించి తన స్థానాన్ని నిశ్చలం చేసుకోడం చేతకాని తెలుగు మాస్టారు! నాగరికత ఎంత విజృంభిస్తున్నా—పేకముక్కలు పట్టుకోడం నేర్చుకోరే! ఎప్పుడేనా ఏ చదరంగమో, సమస్యా పూరణమో! పేకముక్కలతో బేస్తులాట కాకుండా యింకా చాలా ఆడుకోవచ్చునంటే—మందహాసం చిందించి ఊరుకుంటారు.

చెప్పడం మరిచాను.

ప్రాచీన సంస్కృతీ, సంప్రదాయాలకు ప్రతీకగా నిలిచే తెలుగు మాస్టారికి—తప్పకుండా పిలక ఉండితీరుతుంది. ఆ పిలకలో— మందారపూవో, తులసిదళమో చోటు చేసుకుని తొంగిచూస్తూనే ఉంటుంది.

నవ్విపోదురుగాక నాకేటి సిగ్గు.

పిల్లలూ పెద్దలూ, నాగరికతా ఏకమై—నవ్వినా తెలుగు మాస్టారు కించిత్తయినా చలించరు.

నవ్విన నాపచేను—పండాలి.

కాని—పండదు! ఎండిపోతుంది.

ఈ-ఐరనీ ఆఫ్ లైఫ్-ప్రతి తెలుగు మాస్టారిని ఆట లాడించి చివరకు చిత్తుగా ఓడించి వదులుతుంది.

అందుకే-తెలుగు మాస్టారంటే నాకు జాలి.

జీవితానికి తెలుగు మాస్టారంటే ఎందుకు జాలి ఉండదో? అది కూడా ఆయన పాలిటి హెడ్‌మాస్టరయి కూర్చుంటుందేం? ఎంత శోధించినా యీ ప్రశ్నలకు సమాధానం రాబట్టుకోలేక పోయాను.

## 2

తెలుగు మాస్టారికీ-కోరికలుంటాయి!

చిత్రమైన కోరికలు! చిన్న పిల్లల కోరికలు!!

మా తెలుగు మాస్టారికీ చిన్నకోరిక ఒకటుండేది. ఇదీ ఓ కోరికేనా అని నవ్వుకుంటే నేనేమీ చెప్పలేను కాని-నిజంగా, మా తెలుగు మాస్టారికి-హోటల్లో టిఫిన్ తినాలని కోరికుండేది. కోరికలు ఖరీదైనవే అయి ఉండాలని నియమమేముంది? ఆయినా-ఏంతచెట్టు కంతగాలి!

హోటల్లో టిఫీను తినడం-తెలుగుమాస్టారి జీవితానికి కోరికే. ఎప్పుడో ఓసారి — పాఠమధ్యలో — తెలుగు మాస్టారు - శ్రీనాధుడి భోజనం గురించి చెప్తూ-హోటలు టిఫీన్ గురించి ప్రస్తావించారు. వారి మాటలలో...

"హాల్‌ఫూట్ అయ్యారెంత బాగుంటాద్రా, విభూతి పండులా! ఎంతశుచి! ఎంత శుభ్రం!... పళ్లాల్లో లేత అరిటాకులు వేసి మరీ ఫలహారం యిస్తారటగా? ఒరేయ్ ... లేత అరిటాకుమీద తినే ఫలహారానికి కొత్తరుచి వస్తుంది. తామరాకుమీద ఒకలా, మోదుగాకుమీద మరొకలా, లేత అరిటాకుమీద యింకొకలా, రుచి మారుతుంది అదే ఫలహారానికి. అయ్యర్లు నీతి నియమాలుకల మనుషులు. వాళ్లిచ్చే యిడ్లీలు జన్నుముక్కలేనట. ఆ సాంబారు — రోడ్డుమీదకే ఘుమఘుమలాడుతుంది. అయ్యరు హోటల్లో ఆరడజనిడ్లీలు తినని జీవితం దేనికిరా?"

ఒక కొంటె కుర్రాడు లేచి— "మీరెప్పుడూ ఆ హోటల్లో టిఫిన్ చేయలేదా మాస్టారూ?" అంటూ అడిగాడు.

"లేదురా—" ఎంతో నిరాశగా, దీనంగా — దాదాపు గద్గదికస్వరంతో చెప్పారు మాస్టారు.

"నేనురోజూ డజనిడ్లీలు తింటూంటాను మాస్టారూ! —" ఊరించాడు కుర్రాడు.

మాస్టారి ముఖంలోని భావాలను వివరించడానికి ఏభాషా చాలదు. తెలుగు మాస్టారు చెప్పే ఛందస్సంత జటిలంగానూ ఉందా యన భావ ప్రకటన.

భోజరాజుని చూసిన వారికి కవిత్వం వచ్చేదంటారు.

నాకు నమ్మకం అస్సలేదు. కాని —

మా తెలుగు మాస్టారిని చూసిన కుర్రాళ్లందరికీ - జోకులు తెగ ఊరిపోయేవి. ఇది పచ్చినిజం.

మాస్టారు—సరసులు కాకపోలేదు. అయితే — అమాయకుల్ని పట్టుకుని-ఎంత చిన్నతనం ఐతే మాత్రం-ప్రాక్టికల్ జోకులు వేస్తే ఎలా?

ఆకొంటె వెధవ— (నాకు మాస్టారిమీద జాలి కనుక, వాడిమీద కోపం వచ్చింది) ఏం చేశాడంటే...

రోడ్డుమీద-గొడుగు పట్టుకుని నడుస్తున్న తెలుగు మాస్టార్ని చూపి-ఎక్కడలేని భయ భక్తులూ వొలికించి — (మాస్టారు మంచివారు. ఎదుటివాడిది నటనో నిజమో బేరీజు వేయకుండా నమ్మేసే-కల్లాకపటం ఎరుగని అమాయక మూర్తులు)

"ఇడ్లీలు తిన్నప్పుడల్లా మీరే గుర్తుకొస్తూంటారు మాస్టారూ. అంతే-యిక గొంతు దిగదు ఫలహారం. నాతోవచ్చి — మదర్పిత ఇడ్లీ కాఫీలను సుష్టుగా స్వీకరించి — నన్నానందింపజేయగోరు చున్నాను. భవదీయ శిష్యపరమాణువు." అంటూ మాస్టారి కాళ్లా వేళ్లా పడ్డాడు.

అసలే కరుణామయుడైన తెలుగు మాస్టారు కాదనలేక పోయారు. కాళ్లు మొరాయిస్తున్నా — (ఆ రాత్రికి-యింట్లో కూర లేదని ఆయనకి నిశ్చయంగా తెలుసు. తన జేబులో చిల్లికానీకూడా లేదనీ, జేబుకి చిల్లి మాత్రమే ఉందనీ తెలుసు. ఆర్జాంగినీ, బిడ్డలినీ ఆకలికి వదిలి — తాను ఇడ్లీ కాఫీలు — అయ్యరు హోటలులో ఆరగించడం-పంచమహా పాతకాలలోనూ ఒకటిగా ఆయన కనిపించడం అతి వాస్తవం. కాని-శిష్యుడు! వాడి వేడికోలు!) కుర్రవాడి వెంట కదిలాడు.

ఇడ్లీలుతింటూ పారవశ్యంలో మునిగిపోయారు మాస్టారు.

ఆ సాంబారు—అలనాటి-వర్ణనలలోని అమృతంకంటె మిన్నగా భాసించుచుండగా—ద్రాక్షాపాకమూ, కదలీపాకమూ తలుచుకుంటూ, పద్య కవితలో సాంబారు పాకం ఏల ప్రవేశింప జేయలేదు? అని ఆత్మగతంగా విమర్శించుకుంటూ—క్రొంజిగురు రరటి యాకులలో ఆరడజ నిడ్లీలు-కొన్ని నేతితో, కొబ్బరి చెట్నీతో, మరికొన్ని (సరసి తలమున తేలియాడు తెల్లితామరలను సరిపోలు) యిడ్లీలను సాంబారుతో సేవించి-కాఫీ పుచ్చుకుని-గొంతునిండా త్రేన్చినవారై — పారవశ్యము నుండి పైపడి-వాస్తవ ప్రపంచములోనికివచ్చి—కనులువిప్పి చూడగా—

తనని తీసుకు వచ్చిన కుర్రాడికోసం చూశారు.

ఆ కుర్రవాడు—అంతర్ధానమైన విషయం— ఐదు నిముషాలకి కానీ ఆయనకి అర్థం కాలేదు.

అర్థం అయ్యాక-ఆగ్రహం తెచ్చుకోవచ్చునన్న మాటే మరచి-నిస్సహాయుడై-బిత్తరిచూపులు చూస్తూ-కరి, మొసలిబాధను భరించలేక విష్ణువుని ప్రార్థించే ఘట్టాన్ని (చదువుడు-గజేంద్రమోక్షము) మననం చేసుకుంటూ (రాగయుక్తంగా) కుర్చీకీ బల్లకీ మధ్య చిత్రపువులా నిలచి — పైచూపులు చూడసాగారు, పరమాత్ముడు వచ్చి రక్షించడా అని!

పరమాత్ముడు-రాడు.

వచ్చినా-రోడ్డుపక్క సాంబారు హోటళ్లలోకి అసలురాడు.

తప్పని సరైవస్తే - కౌంటరుదాటి అంగుళం జరగడు. మాస్టారి ముందుకువచ్చినవాడు —

సర్వేశ్వరుడు ఏంతమాత్రమూకాదు.

సర్వరేశ్వరుడు!

చేతిలోబిల్లు — మాస్టారి బల్లమీద అంటించేశాడు నీటి చుక్కతో.

తిన్నతిండికి — ఖరీదు కట్టడం — మాస్టారి మనసు చివుక్కుమనకపోలేదు. కాని—ఏం చేయగలరు?

అలవైకుంఠపురంబులో, నగరిలో నామూల సౌధంబులోపల—వెదుకుతున్నట్లు మాస్టారి దీననయనాలు తన శిష్యుడి కోసం వెదుకులాడాయి. శిష్యుడు కనిపించలేదు. ఆశాభంగం ఐంది.

హోటల్ సప్లయర్స్‌కికూడా అనువేనా తెలుగుమాస్టారు?

"వెళ్లి-బిల్లు చెల్లించండి-" కుర్చీ కాళీచెయ్యమన్న శ్లేష ధ్వనించింది మాస్టారికి.

చేతిలో గొడుగుతో కదిలాడు.

చిత్తము చిడిముడివడ, తడబడు నడలతో— తలవంచుకుని —కౌంటరువద్దకు చేరి-

దీన, పరిదీన దృక్కులతో అయ్యరు ముఖంలోకి చూడలేక చూస్తున్నవారై—ఆపాదమస్తకమూ చిరుచెమటలు క్రమ్ముకుంటూండగా—

గొడుగు అయ్యరుముందు పెట్టి—

"నన్ను తీసుకువచ్చిన కుర్రాడు కనిపించడంలేదు. హటాత్తుగా ఏం పని తగిలిందో ఏమో! ఈ గొడుగు ఉంచండి. ఎక్కడేనా అప్పుచేసి— బిల్లు చెల్లించి— గొడుగు తీసుకుంటాను."

అన్నారు మాస్టారు.

బిల్లులు వసూళ్లతో ఊపిరాడని అయ్యరు-క్షణకాలం వారిని పరికించి—"అవసరంలేదు. గొడుగు తీసుకువెళ్ళండి—" అన్నాడు.

అమాయకమ్మేస్టారికి అయ్యరు మాటలర్థం కాలేదు.

అపార్థాలయ్యాయి.

గొడుగు—పాతదే కావచ్చు.

కుట్లువడే ఉండవచ్చు. కాని—

ఊచలు బాగానే ఉన్నాయి. కర్ర బాగానే ఉంది. అంతా కలిసి ఒకరూపంలోనూ ఉంది. ఈ గొడుగు—అర్ధరూపాయ చేస్తుందా, చెయ్యదా అని కాదు. అర్ధరూపాయికి—హామీగా నిలవదూ? తన పదవీ, పరువూ — బొత్తిగా పూర్ణానుస్వారమేనా? ఇప్పుడు ఇక్కడ—తన మొరాలకించు వాడెవడు?

అవమానభారంతో, మరింత అవనత శిరస్కులై నిలిచిపోయారు.

కుర్రవాడు కనిపించనేల?

కనిపించెను పో,

హోటలుకు పిలువనేల?

పిలిచెను పో,

తాను రానేల?

వచ్చెను పో,

యిటుల జరుగనేల?

అని పరిపరివిధముల చింతించుచున్న మాస్టారివంక — పాత్ ఘూటయ్యరు—వరమిచ్చు వేల్పు భక్తునివంక చూచు భంగిమ నభినయించి ప్రకాశముగా యిట్లనియె:

"మాస్టారూ! మీరు నాకు తెలిసినవారే. మా అబ్బాయి మీ శిష్యుడు. మీరు బిల్లు చెల్లించవవసరంలేదు. గొడుగు తీసుకువెళ్ళండి."

మాస్టారి ఆశ్చర్యాని కంతులేకపోయింది.

అంతటి అయ్యరుకి—తెలుగు మాస్టారు తెలియడమా!

తెలిసినా—యింత మర్యాదగా మాట్లాడడమా!!

చివరకి—బిల్లు వద్దకూడా మొహమాటమూ, దయా ప్రదర్శించడమా!!! అయ్యరూ దేముడూ అతికరుణామయులు.

అనుకుంటూ—కృతజ్ఞతాపూర్వకంగా అయ్యరువంక చూసి—కదిలారు.

నన్నాశ్చర్యపరిచింది—జరిగిన సంఘటన ఏంతమాత్రమూ కాదు. ఆ సంఘటనను చెప్పినతీరు!

ఈ వృత్తాంతాన్ని చెప్పినది తెలుగు మాస్టారు!

మందహాస వదనారవిందంతో—

ఉండి ఉండి పొడుముపట్టు దట్టిస్తూ—

ఒక రసవత్తర సన్నివేశాన్ని వర్ణించినంత శ్రద్ధగా చెప్పారే కాని—

ఆ సన్నివేశంలో తనపాత్ర దయనీయమైనదని కాని—

ఆ కుర్రాడిమీద కోపపడుతూ కాని—

చెప్పలేదు.

భగవంతుని లీలలలో ఒకదాన్ని వర్ణించినట్లే దీన్నీ అతి గౌరవంగా కథనం చేశారు. ఒక పాత్రమీద కోపమూ ప్రకటించలేదు, మరొక పాత్రమీద అసహ్యమూ ప్రకటించలేదు.

నావృషిః కురుతే కావ్యం.

కథా కథనాన్ని—ఆత్మకథా కథనాన్ని కూడా రుషితుల్యులై—నిష్పక్షపాతంగా నెరవేర్చగలిగిన తెలుగు మాస్టారూ, మీరు మహర్షులే. మరో వాల్మీకులు!

తెలుగు మాస్టారి జీవితంలో అతి చిన్నకోరిక కూడా తీరకనే మిగిలిపోతుందనడానికి—మరొక్క సంఘటన చెప్పి ముగిస్తాను.

కోరిక తీరడమూకాదు, తీరకపోవడమూ కాదు.

సుష్టుకృతుగా భోజనంపెట్టి—తిన్నబోతూంటే—హృదయం దహించే మాటలు వినపడటమో, మనసు కుమిలిపోయే సంఘటనో జరిగితే—కోరిక తీరినట్లెలా ఔతుంది?

తృప్తి అనేది చాలాచోట్ల—రెండుదశల వ్యవహారం.

మొదటిది శారీరకమూ, రెండవది మానసికమూ.

కోరిక తీరిన అనుభూతిని పొందాలంటే —

బాహ్యేంద్రియాలూ, హృదయమూ రెండిటికీ సమన్వయం కుదరాలి జిలేబీ నోటిలోకి వెళ్ళినంతమాత్రాన కోరిక తీరిపోదు. మనస్సుకి తాకి-అది ప్రకంపించాలి. అప్పుడే నిజమయిన అనుభూతి. అదే పరిపూర్ణ రసాస్వాదన.

రసనేంద్రియాలూ, హృదయమూ తృప్తి చెందితే తప్ప అనుభూతి అసంపూర్ణమే!

వ్యాఖ్యానం అటుంచి- కథలోకి పోదాం.

పై సంఘటన జరిగిన కొన్ని దశాబ్దాలకు—ఆకోణంలో మరో సంఘటన జరిగింది. పరాకాష్ఠ నందుకుంది.

విశాఖపట్నం—నాగరికతకు నిలయం.

అక్కడ హోటళ్ళలో సర్వర్లూ, క్లీనర్లూ కూడా, ఇంగ్లీషే మాట్లాడతారు. ఇంగ్లీషు మాట్లాడేవాళ్ళనే మనుషులుగా గుర్తించి గౌరవిస్తారు. ఇంగ్లీషు మాట్లాడనివాళ్ళు వాళ్ళ దృష్టిలో ద్విపాద పశువులే నేమో!

టిఫిను తింటున్న నేను ఉలిక్కిపడ్డాను.

నాముందు రెండు టేబుల్స్ అవతల గలాటా అనలేను కానీ—కొంచెం చెడిన పరిస్థితి—నెలకొంది.

అవమానకరమైన ఆ సంఘటనలో చిక్కుకున్నవ్యక్తి -తెలుగు మాస్టారేనని అనుమానం కలిగేసరికి, వెళ్ళకుండా ఉండలేకపోయాను.

సందేహంలేదు.

మాస్టారే. తెలుగు మాస్టారే. మా తెలుగు మాస్టారే.

కొంచం కంపిస్తూ నిలుచున్నారు.

నన్ను చూసీ గుర్తించలేదు.

జరిగినది - విన్నాను.

మాస్టారు రెండిడ్లీ చెప్పారు.

ఒకటి తినేసరికి — పచ్చడి మిగలలేదు పచ్చడి తెమ్మని సర్వరుకిచెప్పి-ఊరికే కూర్చోలేక—మిగిలిన యిడ్లీని చిరు చిరు భాగాలు చేసి ఉంచుకున్నారు కాలాన్ని దుర్వినియోగం చేయకుండేందుకని.

ఇంకారాలేదు పచ్చడి.

కుర్చీలో వెనక్కివాలి—గోడమీద సాక్షాత్కరిస్తున్న అర్ధనగ్న అమ్మాయి క్యాలెండరుని చూస్తూ—[illegible] వయాధిని యింత నగ్నంగా సౌందర్య ప్రదర్శన గావించి ఉంటుందా అన్న పరిశోధనలోపడి పోయారు.

తెలివి వచ్చేసరికి—

పచ్చడి రాలేదు.

ఇడ్లీ ప్లేటు క్లీనరు తీసుకుపోతున్నాడు.

"అబ్బాయ్!—" పిలిచారు మాస్టారు.

క్లీనరుకి కోపంవచ్చింది. "అబ్బాయేమిటి? మిస్టర్ అనలేవూ?" ఎదురు తిరిగాడు.

మాస్టారికి కోపం రాలేదు. అవిధేయత సహించలేకపోయారు. పెద్దలను గౌరవించడంచేత కానందుకు క్లీనరుమీద విసుక్కున్నారో, తల్లివంటి మాతృభాషని వదిలి—పరకాంతవంటి ఆంగ్లభాష నాశ్రయిస్తున్నందుకు జాలిపడ్డారో!

"ఫలహారం పూర్తి చేయకుండానే పళ్ళెం తీసుకుపోతావేం?"

"దిక్కులు చూస్తూంటే—యింక తినవేమో అనుకున్నాను. గోడమీద బొమ్మలో లడ్డూలుచూస్తూ—లోకం మరచిపోతే నాదా తప్పు?"

సిగ్గు పడిపోయారు మాస్టారు.

సాధారణంగా వయస్సుకి గౌరవం లభిస్తుంది.

తెలుగుమాస్టారి విషయంలో—ఆ రూలూ వెక్కిరించింది.

రూల్సుకికూడా—తెలుగుమాస్టారంటే వేళాకోళమే.

"కావాలంటే మరో ప్లేటు తెస్తాడులెండి — బిల్లు వెయ్యకుండా–" ప్రొప్రయిటరు వచ్చి అన్నాడు.

మాస్టారి ముఖంలో కత్తివేటుకి నెత్తుటిచుక్కలేదు.

"నేను ముష్టివాణ్ణికాను."

"అదికాదు—"

"మీరు ఊరికే—దయాధర్మంగా నాకు టిఫిను పెట వనవసరం లేదు. "డబ్బులు కౌంటరుమీద పెట్టి—వెళ్లిపోయారు.

అలనాడు — అవమానించబడిన యుగంధరుడు — మాస్టారిలా ఉండేవాడా? అనిపించింది.

నాకు తెలుసు.

ప్రొప్రయిటరు క్లీనర్నేమీ అనలేదు. మందలించలేదు.

సర్వర్స్ యూనియన్. క్లీనర్ల యూనియన్...ఎక్కడచూసినా యూనియన్లు. విద్యుక్తధర్మంనుంచీ, కనీస సభ్యతా ప్రవర్తననుంచీ అధిగమించి అతీతులు కావడానికి ఎనలేని కృషి చేసే యూనియన్లు! యూనియన్ బలంచూసుకునే మాస్టారిపట్ల పొగరుమోతు తనంగా ప్రవర్తించాడు హోటల్ క్లీనరు.

కస్టమర్‌తోపాటు ప్రొప్రయిటరుకూడా విస్తుపోయుడే!

పరుగు పరుగునవెళ్లి పిలిచాను మాస్టార్ని.

పిలుపందలేదో, అందినా అన్యధా భావించారో, తెలుగు మాస్టారు పలకలేదు!

ఆయనకు ఒకప్పుడు నేను అత్యంత ప్రియతమ శిష్యుణ్ని.

నన్నే మరచిపోయారా మాస్టారూ?

ఎంత దురదృష్టవంతుణ్ణి!

## 3

తెలుగు మాస్టారికీ అభిమాన విషయాలుంటాయి.

కొన్ని సరదాలు—తమాషా బలవి ఉంటాయి.

మా తెలుగు మాస్టారూ అంతే.

పరీక్షలు రాకుండానే మా మార్కులు తెలిసిపోయేవి,

ఎలా అంటే—

మా తెలుగుమాస్టారు సంగీతప్రియులు.

సంగీతమంటే—శ్రావ్యమైన సంగీతం.

సాహిత్య పరమైన సంగీతం!

మాతెలుగు వాచకంలో పద్యభాగంలో—భాగవతంలోవీ, భారతంలోవీ, రామాయణంలోవీ, నైషధంలోవీ, అలా ఎన్నో రకాల పద్యాలుండేవి.

మాస్టారు పాఠం చెప్పే పద్ధతి సరదాగా ఉండేది.

ఆయన కంఠం శ్రావ్యంగా ఉండదు.

పద్యాలు వల్లెవేసినట్లుకాక స్వరరాగయుక్తంగా చదివితే ఆయన—జోలపాటకి నిదురించే పసిపాపే అయిపోయేవారు.

అదృష్టవశాత్తూ నాగొంతు మధురంగా ఉండేది. సంగీత జ్ఞానం లేకపోయినా—మాయింటి వెనుక నాటకాల రిహార్సల్స్ జరిగేవి కనుక రాగయుక్తంగా పద్యం చదవగలిగే వాడిని. అందుచేత—మాస్టారికి నేను ప్రియ శిష్యుణ్ని. పేపరెలాగ వ్రాసినా ఫస్టుమార్కునాదే. నాఅంత మధురంగా మరెవరూ పద్యాలు పాడ గలిగేవారు కారుగా! ఈవిధంగా—పద్యాలు చదవగలగడం అనే అంశాన్నాధారంగా చేసుకుని—పేపర్లకు మార్కులు వేసేవారు తెలుగు మాస్టారు.

ఈ పద్ధతి అన్యాయం అని ఒకరిద్దరు కుర్రాళ్లంటే...

"నిజమైన విద్య కాగితాలమీద కనపడదురా. మనిషిలో ఉంటుంది. మునపటి చదువులెలా ఉండే వనుకొన్నారు? పుస్తకాలు చూసి చదవడంకాదు. గురువుగారు నోటిని పాఠం చెబుతూంటే శిష్యులు వల్లెవేసేవారు. అంతే, విద్య అలాగే వ్యాప్తి చెందేది. మనిషిలోనూ మెదడులోనూ నిక్షిప్తమై ఉండేది ఏవిద్య అయినాసరే. మరొక మాటరా అబ్బాయిలూ. సాహిత్యానికి సత్తువనిచ్చేది స్వరం. స్వరం అంటే సంగీతం.

ఉట్టుట్టి అక్షరాలు ప్రాణ రహితాలు. సంగీతం—సాహిత్యానికి ప్రాణంపోస్తుంది. ఉచ్చారణ ననుసరించి ఒకే మాటకు వేర్వేరు ప్రభావాలు కల్పించవచ్చు. అందుచేత—సాహిత్యంకంటె సంగీతమే మిన్న.

వేదాలున్నాయి చూశారూ—"

"చూడలేదు మాస్టారూ—"

"ఔనులే. వేదాలను చూడగలిగే కళ్లు మీకెక్కడివి?— వేదాలు అచ్చుపుస్తకాల్లో ఉండేవికావు. గురువుల కంఠాలలో ఉండేవి. సరి అయిన శ్రుతిలో చదివితేనే వాటిబలం. సామవేదం మచ్చు చూపుతాను. వినండి—"

మాస్టారు సామవేదం అందుకున్నారో — మేమంతా మంత్రముగ్ధులమయిపోయామన్నమాటే. అసలు—సామవేదం సంగీత ప్రధానమట. శ్రుతి, లయ, రాగం, తాళం—అన్నీ జతచేసి—ఎంత అద్భుతంగా చదివేవారు మాస్టారు! మంత్రంకూడా సరిగ్గా జపిస్తేనే తంత్రం ఔతుందట.

మాస్టారు చెప్పినదంతా నిజమే అనిపించేది—ఆయన వేదమో పనసో, అమరమో, శ్లోకమో చదివారంటే. ఆయన—అవి చదువుతూ మమ్మల్నేవో కొత్త (పాత ?) లోకాలలోకి తీసుకు పోయేవారు.

మాస్టారు— తెలుగు మాస్టారవదామని అనుకోలేదట.

వివరో దివాను— సంస్కృత పండితులని కాస్తా తెలుగు మాస్టారిగా మార్చేశారట. భుక్తికోసం—మాస్టరు గిరీని పట్టుకు వేలాడుతున్నారు. ఇంగ్లీషురాదు కనుక—లెక్చరర్ గ్రటా కాలేదుకానీ లేకపోతే విశ్వవిద్యాలయంలో పనిచేయవలసినంత ప్రజ్ఞాశాలే మా మాస్టారు.

అంతెందుకు? ... ఓ కొంటెకుర్రాడు కోరగా—తద్దినం మంత్రాలు పఠించారు మాస్టారు. వింటూ—కిక్కురుమంటే ఒట్టు. మా మాస్టారు తద్దినాలు కూడా పెట్టించగల సమర్థులే. పెద్ద వాళ్ళ యిళ్లల్లో తద్దినాలకు వెళ్లేవారు కూడా!

చెప్పవచ్చేదేమంటే-సంగీత రసజ్ఞులైన మా మాస్టారు—కుర్రాళ్ళు పద్యం చదివే తీరుననుసరించే మార్కులు వేయడం—ఎంతయినా సముచితమే అని. ఇనస్పెక్టరు వచ్చాడంటే—క్లాసులో నా చేత పద్యం పాడించకుండా వదిలేవారా! ఉత్సాహంలో ఆయన కూడా మాంచి పద్యం చదివేవారు—ఇనస్పెక్టరు దంగయిపోయేలా

ఆ కాలంలో—ఏంచేతనో కాని—స్కూళ్ళ యినస్పెక్టర్లు కూడా సాధారణంగా బ్రాహ్మణ్లై ఉండేవారు. వాళ్ళు—మా తెలుగు మాస్టారింటనే భోజనం చేసేవారు. ఉప్పూ పప్పూ—మేమూ, హెడ్ మాస్టరూ సమకూర్చేవారం.

తరువాత—"ఇనస్పెక్టరుగారు భోజనం బాగా చేశారా?" అని మేమడక్కుండా ఉండలేకపోయేవాళ్ళం. మా తెలుగు మాస్టారు చక్కని కథకులు. చెప్పదలుచుకున్న విషయాన్ని—ఎదటివారి హృదయాలకు హత్తుకుని జీవితాంతమూ మరచిపోలేనంత బాగా చెప్పేవారు.

"ఒకానొక బీదబ్రాహ్మణు డుండేవాడ రా అబ్బాయిలూ! పాపం...అతనికి—ఎవరింట్లోనో తద్దినం ఐతే తప్ప భోజనం దొరికేది కాదు. ఆనాడు మాత్రం అతనికి కడుపు నిండేది. ఒకసారి—దేముడు కనికరించక—వారాల తరబడి తద్దినపు పిలుపు రాలేదు. ఏదో ముష్టెత్తుకున్నా—అతని కడుపు కొకమూలకి వచ్చేవి కావు.

రాక రాక—తద్దినపు పిలుపు వచ్చింది.

ఆహ్వానం అందుకుని—తరలి వెళ్ళాడు.

అతనికి వడ్డించలేక—ఆ యిల్లాలి చేతులు నొప్పెట్టాయి; వడుం పీకింది.

ఎట్టకేలకు ఎలా ఐతేనేం, ఆ బ్రాహ్మణుడు భోజనం ఐందనిపించి—త్రేన్చి—లేచాడు.

అతని పొట్టముడతలలోంచి — రెండు సాలెపురుగులూ, ఓ తేలూ, మూడు బొజ్జింకలూ—చచ్చిన నే-రాలిపడ్డాయి. అది చూసిన యిల్లాలి కళ్లు ఆనందంగా మెరిశాయి."

మాస్టారు మౌనం దాల్చేవారు.

అంటే అర్థం-కథ ఐపోయిందని!

మాస్టారు కథ చెప్పడంలో ఎంత చక్కని టెక్నిక్!

మేము నవ్వలేదంటే—మాస్టారికి తెలిసిపోయేది మా బుర్రలకి కథ అర్థం కాలేదని.

కొన్ని నిముషాలాగి-అప్పటికీ మేము మౌనంగానే ఉంటే—నీరసంగా వివరించేవారు—అరసికేషు కవిత్వ నివేదనం శిరసి మాలిఖ మాలిఖ మాలిఖ అని బాధపడుతున్నట్లుగా.

"ఆకలితో ముడతలు పడిన కడుపు. ఎంతలోతు ముడత లంటే తేళ్ళూ, సాలెపురుగులూ నివాసం ఏర్పరచుకునే అంత! ఆ యిల్లాలు పెట్టిన భోజనంతో—కడుపు ముడతలువిడి—సాలె పురుగు, తేలూ బయటపడ్డాయి. అంటే—అంత నిండుగా భోజనం చేశాడన్నమాట. భోక్త సుష్ఠుగా తింటేనే—వండి వడ్డించిన యిల్లాలికి తృప్తి, ఘనతా. ఇప్పుడర్థమైందా?"

కథలను కూడా బోధించేవారు మా మాస్టారు.

అందుకే ఎంతవయస్సు వచ్చినా తెలుగు మాస్టారినీ, వారి కథాకథన చాతుర్యాన్నీ మరచిపోలేకపోవడం.

తెలుగు మాస్టారిలో ఎంత సహృదయత!

తాను చక్కని గాయకులయినా—కుర్రాళ్ళలోని మిడి మిడి గాయకులని మనస్ఫూర్తిగా ప్రోత్సహించేవారు. పిల్లలు బాగా పద్యం చదువుతూంటే—ఆనందంతో తల ఊపేవారు.

శిశుర్వేత్తి, పశుర్వేత్తి వేత్తి గానరసం ఫణిః

సంగీత కళని సాహిత్యం కంటె మరొక మెట్టెక్కించడంలో తప్పేముంది? రాగయుక్తంగా చదవకపోతే ఋగ్వేదమయినా రాణించదట

నిజం మాస్టారూ. నిజం.

## 4

మనం గమనించం కానీ—మన జ్ఞానానికంతటికీ మూల బీజాలు తెలుగు క్లాసులోనే పడివుంటాయి.

మిగిలిన మాస్టర్లలా కేవలం పాఠం మేరకు చెప్పి చేతులు దులిపేసుకోరు తెలుగు మాస్టారు.

జీవితం గురించి పాఠాలు బోధిస్తారు.

జీవిత సత్యాలు బోధిస్తారు.

జీవితంలోని—రసం, సరసం, విరసం—అన్నీ పిల్లల చెవుల్లో నూరిపోస్తే తప్ప నిద్రపట్టదు తెలుగు మాస్టారికి. అజ్ఞానులం కనుక వారి శ్రమని మనం ఛాదస్తంగా తీసుకుని నవ్వుకుంటాం.

''శ్రద్ధగా చదువుకుని బాగుపడరా!''

ఇదేమాట మిగిలిన మాస్టర్లూ చెప్పొచ్చు. కాని—

తెలుగు మాస్టారు చెప్పేతీరులో ప్రత్యేకత.

స్వంతకొడుకు పాడైపోతూంటే ఎంత బెంగపడుతూ చెప్తారో తన విద్యార్థి చదవకపోతే కూడా అంత దిగులా పడుతూ నీతులు చెప్తారు.

బాగుపడమని బ్రతిమాలుకుంటారు.

అవసరమయితే—భయ పెడతారు కూడా!

అంత ఆప్యాయత—తెలుగు మాస్టారికే చెల్లింది. మిగిలిన వాళ్ళు చెప్పే నీతులకంటె—తెలుగు మాస్టారుచెప్పే నీతులకి శక్తి ఎక్కువ. తెలుగు మాస్టారు చెప్పే జీవన సత్యాలు నిత్యాలే.

ఒకసారి—మార్కులు కనుక్కుందుకుని వారింటికి వెళ్ళాను. ముఖం చూస్తూనే నేనెందుకు వచ్చానో పసిగట్టేశారు.

పిల్లల మనస్తత్వం—తల్లితండ్రులకి తెలియకపోవచ్చునేమో కాని తెలుగు మాస్టారికి తెలియకుండా ఉండదు.

''అరవైరెండు చాలా?'' నవ్వారు వారు.

నమస్కరించి శలవు తీసుకోబోయాను.

''ఆగరా అబ్బాయ్...''

ఆగాను.

''నువ్వు కొన్ని మర్యాదలూ, మన్ననలూ నేర్చుకోవాలిరా.''

ఆయనవంక చూశాను.

''కార్యార్థియైనవాడు రిక్తహస్తాలతో చేరకూడదు. కృష్ణ పరమాత్మవద్దకు వెళ్ళిన కుచేలుడు—చివరకి అటుకులయినా తీసుకు వెళ్ళడంలో అంతరార్థ మేమిటంటావ్?''

''......''

''సంప్రదాయం. అంతే. అది లంచంకాదు సుమా!...పెద్దల దగ్గరకీ, గురువులవద్దకీ, పసిపాపలవద్దకీ వెళ్ళేటప్పుడు వొట్టి చేతులతో వెళ్ళకూడదు. కాయో, పండో...శక్తిమేరకు ఎదుటివాళ్ళ చేతిలో పెట్టాలి—''

''క్షమించండి మాస్టారూ!''

''అంతమాటెందుకురా!...నువ్వంటే ఏమిటో అభిమానం. నాకు తెలిసినదంతా నీకు నూరిపోసెయ్యాలనిపిస్తుందంతే. సరే... వెళ్ళు.''

సిగ్గుపడుతూ కదలబోయాను.

వెనక్కి పిలిచి మరోమాట చెప్పారు.

''శోభనం గదిలో—వధువు కొంగుని వరుడు బంగారు కాసెందుకు కడతాడో తెలుసా?''

అడ్డంగా తలూపాను.

''వధువుని డబ్బుపెట్టి కొనుక్కోమని కాదుసుమా! కేవలం వరుడు వధువుపట్ల తనకుకల విలువని ప్రకటించడంకోసం. ఇహా మతులకి విలువే తప్ప ఖరీదు లెక్కలోకి రాదు. మరచిపోకు.''

తల ఊపి వచ్చేశాను.

ఆనాడు మాస్టారు చెప్పిన మాట పాటించడంవల్ల నా కనేక లాభాలు కలిగాయి. మంచీ, మర్యాద తెలిసిన మనిషి వనిపించుకో గలిగాను. నన్ను మనిషిని చేసింది తెలుగు మాస్టారు కాక మరెవరు?

*[ఇంకా వుంది]*

---

# వర్షాసంధ్య

## సాంధ్యశ్రీ

వాన
కురిసి కురిసి
అలసి వెలిసి ...
కాల నిశ్వాసం లా
గాలి క్షణం
చూడు బారు
బొట్టు బొట్టు కారు
చేతు లెత్తిన
చెట్టు చేమల
ఆకు నాకున జాలి భయం...

పుట్ట లోపలి
చీమ లన్నీ
ఒక్కటొక్కటే
విశ్వబ్బపు తొందరలో...
ఏ కాకి లేని
ఆకాశం
ఏ కాకి...!
పాయం ముఖాన
గాయం...,
చినుకు బాణం చురుకున

నేల
నీటి పాయలు
వేల వేల
నెత్తు చుక్కలు...
నూదిగా-నూటిగా కంటిలో...!
జాలిలో
తడిసి చివికిన
సగం మునిగిన
కాగితపుడవ జరుగులో
సగం విరతి - సగం
ధృతి.

# ఆకాంక్ష

## శ్రీ పుదివేడు ప్రభాకరరావు

వియత్తలంలో
విరిగిన అద్దం ముక్కల చుక్కల్ని
గతుకులే క అతుకు పెట్టి
మరో శరచ్చంద్రుణ్ణి సృజించాలనీ....

దాచిన రెక్కలతో
చదలపై విహరించే విహంగాల
పొత్తికడుపుల ఫలకాలపై
పుత్తడి అక్కరాలతో బుక్కులు రచించాలనీ —

ఆ పొత్తికడుపుల స్పందనలు
పుట్టతేనియలై స్రవించి
1 'మధుచ్ఛందసుడు' మళీ బతుకగా
2 'శునశ్శేపుడ' నై చెలిమి చేయాలనీ—

వాలోని 3 'కదల్లేని ఎద్దు'ను కదల్చి
విగళ విమోచనం చేసి
అనర్గళ వాగ్విన్యాసాన్ని ప్రసాదించే
సంధ్యామారిషుని నృత్యం సందర్శించాలనీ—

శరచ్చంద్రుని సుధలతో నిటారుగా పెరిగిన
వృక్షాల చిటారు కొమ్మల చివళ పై
ఏక చక్ర భ్రమణం చేసే 4 'ఏకపాదుడై న అజుని'
సువర్ణ కేశ కాంతుల సరోవరంలో
అవబృథ స్నానం ఆచరించాలనీ—

విహ్వలించే వరాల విపంచికా తంత్రులపై
వివరూ పాడని పాట
సామగాన లా
విశ్వంలో ప్రతిధ్వనింప జేయాలనీ —

ఉవ్వెత్తున లేచే
ఉచ్ఛ్వాస నిశ్వాస తరంగాల
హృదయ సముద్రంపై
వినూత్న సేతువు వినిర్మించాలనీ —

ద్విరేఫాల ఝుంకారం
ఓంకార నాదమై
హోరుమనే సముద్రఘోషలో నిమగ్నమై
నాలోనేనే లీనం కావాలనీ —

సురశ్రీ సుందరీ నృత్య విన్యాసంలో
చరణ మంజీరాల
మధుర మంజుల రవంగా
కరిగిపోవాలనీ —

గంగా తరంగిణీ తళతళలలో ఓ తళుకునై,
నా కల్యాణస్వామి కమనీయపద నఖకాంతులలో ఓ బెళుకునై
నా తల్లి కృపామృత వర్షధారాశిలో ఓ చినుకునై,
నా జాతి రక్తనాడీ స్రవంతిలో ఓ మినుకునై,

గతానై—
వర్తమానానై
భవితవ్యానై—
పోవాలనీ......
కావాలనీ......
మారాలనీ......

---

1. మధుచ్ఛందసుడు – విశ్వామిత్రుని పుత్రుడు. తండ్రిచే శప్తుడు. (ఐతరేయ బ్రాహ్మణము ననుసరించి.) ఛందస్సు మధువువలె స్రవించేది. అదే ఆ ఋషి పేరులోని మాధుర్యం.

ఋగ్వేదం 1 నుండి 11 సూక్తాల వరకు మధుచ్ఛందన మహర్షి ద్రష్ట. (1 మం. 1 అను. – 1 మం.3 అను.)

2. శునశ్శేపుడు – అజీగర్తుని పుత్రుడు. తండ్రిచే త్యక్తుడు. (ఐతరేయ బ్రాహ్మణము ననుసరించి) ఆత్మక్షోభచే బాల్యమందే ఛందోదర్శనం చేసిన వేద ఋషి. ఋగ్వేదం 24 నుండి 30సూక్తాల వరకు శునశ్శేఫ మహర్షి ద్రష్ట. (1మం. 6అను)

3. 'కదల్లేని ఏదు'– "చత్వారి శృంగాత్రయో అస్యపాదా..." చూ. Four Horned Bull An Exposition of Rigueda, IV 58.1.11) Dr. V. S. Agrawala, Bharatiya Vidya, Bombay. 1960.61 (pp.18 ,32)

4. అజఏకపాదః – ఒంటికాలిమేక. దీనికి సూర్యుడని వేదార్థము నిర్ణయించిన వారు Dr. V. S. A rawala. చూ. The One . footed Goat, Brahma Vidya, Adyu Vol XXV, 1.4 1961. (pp 117.122)

---

# పునరుత్థానం

## "ప్రత్యూష"

తూరుపు దిక్కుగుర్రం
పడమటి కొండకు దౌడుతీసింది
రౌతు సూర్యుడు తన అశ్వాన్ని
"సంజె పచ్చిక బీట" మేతకు వదిలాడు
కందిన ముఖంతో స్విన్నమై
బడలిన ఒడలితో
పడమటి కడలిలో స్నానమాడబోయాడు!

నిదుర లేచిన కలువ కన్నెలు
వెన్నెల సుగంధాలు పూసుకొని
చందమామకు హారతి పడుతున్నాయ్!
ఇంతలో
కొంచెం షికారు చేసి వస్తామని
ఎక్కాను నా కవితాకురంగాన్ని
దౌడు తీశాను,
ఒక్క అంగలో లోకమంతా

గ్రుక్కెడు చల్లని అనుభూతుల జలాలు గోలాను
అలా స్వారి చేసి చేసి,
ఆకాశపు ఇసుక మైదానంలో
తివిరి తైలం తీసే మానవత్వాన్ని చూశాను!

కొమ్ములు మొలిచిన కుందేళ్ళు
చిందులు వేయడం చూశాను!
నా కురంగవేగ ధాటికి
కకావికలై పోతున్న
గుడ్డి కొక్కిరాయిల దొంగజపం చూసి నవ్వుకున్నాను
తరుకోటరాల నిదురపోతోన్న
గుడ్లగూబల్ని కూడా
ఆహ్వానిస్తోంది ప్రకృతి వసంతోత్సవానికి!

పడమటి కొండ ఒంగి ఒంగి
ఉదయాద్రి గండపాళిపై ముద్దు పెట్టింది
సంజె కెంజాయల వే వెలుగు
కోమలారుణ కరాంగుళులు
రోదసి శిలాఫలకంమీద ఏదో వ్రాసి
చుక్కలన్నిటినీ వెలుగు గీతలతో కలిపి
రంగవల్లికగా మార్చి
నూత్న మానవునికై ఆవాహన జపించింది

నేను స్వాగతించిన వసంతం,
విరిసిన మానవ పునరుత్థానం!

---

# సంధ్యాలోచన

వెగా నా

ఈ మునిమాపువేళ —

సంధ్యారాగిణి
బలే ఉర ఉరగా
సతారాంబరాన్ని అలంకరించుకొంటూన్నది

నేనూ-సంధ్య
మా యిరువురి మధ్య
కాలం ఆవులించిన గాలివంటి
పలచ పలుచగా ఆవిష్కృతమయ్యే చీకటి

చీకటి సిగలో
కైపెక్కిన వెన్నెల మొగ్గ సన్నని శశి
దీప్తాక్షర త్విషలుగా
వెలిగే చీకటి నేత్రాలవంటి దివ్వెలు

శకుంతలముల కిలకిల ధ్వనులలో
సంధ్యానర్తకి జారుకొన్న ధ్వనుల మువ్వలు

యోగి పెదవులపై
తళుక్కున మెరిసే చిరునవ్వుల్లా

జానపదుల పాటలోని మెరుపుల్లా
అభిజ్ఞానాంగుళీయకముల్లా

గగన తలంపై తారలు !
ఇలాతలంపై నేను!

అప్పుడప్పుడే గతించిన మృతదేహంలా
దినదేహం క్షణక్షణం నలుపెక్కుతూన్నది!

తరుల తలలపై
చీకటి కిరీటాలు

చేతనా స్రవంతిలో భావ తరంగాలవలె
అస్తమానమూ షైళ్ళ మధ్య

తలమునకలుగా తపించి
మునిమాపువేళ బైటపడి

కళ్ళ కిటికీలలో
కాంక్షల కన్నీళ్ళతో
నగరం లోయలో పడుతూన్న జీవితాల ఛాయలు.

రాత్రి సరదాలకు
మునిమాపువేళ మేస్తాబౌతూన్న
నగరంలోని కాగితాల పూలవంటి కన్నులు.

యిరుల కురుల్లో
నలిగిన విరుల రేకులవంటి జీవితాలు
ఈ సంధ్య

వయసును దాచాలనే మనసులతో కలసి
'లిప్‌స్టిక్'గా ఎఱ్ఱబడిపోయింది;
యీ మునిమాపువేళ—

కొండమీది కోవెలనుండి
ఖంగ్ ఖంగ్‌మని బయల్వెరిన ఘంటానాదం
రంగు శబ్దంగా ప్రవహించినట్లు—

కోయిలలు నిద్దురలేచి
గాండ్రించి ఆవులించి

సంజ చిత్రించిన
ఏటిమలుపుల ఎరనీళ్ళపై
కసిగా ఎఱ్ఱగా పేర్చిన చూపుల్లో,
చిరునవ్వుల పిచ్చాపాటి కబుర్లలలో,
నిండుతూన్న నిషాపానీయాల గ్లాసుల్లో
సంజె మత్తుగా నవ్వింది!
మందార పూలపై మంచుబిందువుల్లా
మాధ్యం నుదుట రగిలే కావిబొట్టులా

కోనల్లో, కొండల్లో
స్పందించని గుండెల్లో
చట్టాళ్ళ పొరలలో
కుట్రలలో కుళ్ళులలో
హింసాకాండల్లో
చిక్కని చీకటి
చిందిలించుకొంటూన్నది!

# కనిపించని క్రొత్త 'మూవీ'.....

శ్రీ వి. సంపత్కుమారాచార్య

క్రాలం వేసిన.... ఈ
పెర్మినన్ లేని రోడు మీద
సూర్యుడూ...చందుడూ...నక్షత్రాలూ....
ఎక్కడికి పరుగులెత్తుతున్నారు?....
వాళ్ళని తెలీని
ఏ క్రొత్త 'మూవీ' చూడాలనుకుంటున్నారు? ?...
కాదంటే...అది యీ భూమ్మీద జీవుల భ్రమయే అయితే
మరి...భూమి పరుగు లెక్కడికి??
ఎవరు కదల మన్నారు?....ఎందుకు కదల మన్నారు??
ఎక్కడికి రమ్మన్నారు?....ఎప్పుడాగమన్నారు?? ...

జలపాతాల్లో ఓ కాలూ....సాగరంలో మరో కాలూ ఉంచి
సర్కస్ చేస్తూన్న విశ్రాంతి నెరుగని వదుల్లా
కాలమనే★ పారావారంలో
పుట్టడం....గిట్టడం మధ్య నలుగుతూ....నవ్వుతూ....
భ్రమపడ్తూ

జీవితాన్ని కాలానికి కొలబద్ద చెయ్యడ మెందుకు??
ఆలోచిస్తూ....అలసిన ఎడద సేదతీర్చి
వలసిన జవాబీయడానికి
నాకేం తెలుసు?....నీకేం తెలుసు?? ఆ మాటకొస్తే ఎవరికి
తెలుసు??

[భగవంతుణ్నాదిలెయ్!...వాడి ఊసెత్తకు!!అంతాగజిబిజి!!]
అలాగని...
తెలీదని మౌనంగా కూర్చోనీక
ఎదలో ముల్లు
పుండుమీద కారంలా నలుపుతూ — మండుతూ.. మండిస్తూ
వర్తమానాన్ని చంపి గతానికి పంచుతూ....
భవితని పుట్టించి అనుగతంలో కలుపుతూ....
వెనక్కి తిరిగిన మొహాన్ని మొట్టి...ఆ గతాన్ని చూపిస్తూ
ఇలా విచిత్ర విచికిత్సలో ముంచుతూ!!...

---

★జననమపారం.
మరణం పారం!

## వి ఖి ల్

# 1. చావును తన్నిన గాలి

గాలివాకిట
తలుపుతట్టిన చావు
కనుగుడ్లలోనే
గూడుకట్టిన రోజు
తలుపు దగ్గర నక్కలా కాచుకుంది కాస్సేపు
భయంతో మాటపడిపోయి
స్తంభించిపోయింది సమీరం.
బ్రతుకు భారంతో
మహానగరంలో
తప్పిపోయిన నిరుద్యోగిలా
చీకట్లో మేడల మధ్య
దిక్కులేని శ్వాసవదులుతున్న పేదవాడిలా
కొన్ని నిమిషాల కొనఊపిరితో గాలి.
ఇల్లు ఖాళీచేయాలంటే దారిలేదు
పుట్టముంచి వెళ్ళిపోవడం సులభంకాదు
మమకారాల స్నేహాల హాహాకారాల ముందు
గుండెలోని ప్రేమసాగరాల ఉప్పెన ఎదుట
అంతే అకస్మాత్తుగా తిరిగి వెళ్ళింది చావు
బాల్చీ తన్నకుండానే నిలుచుంది గాలి
మృత్యుముఖంలోంచి వీచిన సమీరం
మానవ ప్రాంగణంలో
తన లయకే తాను చిందులేస్తున్నది.

# 2. మౌనం

ఈ రోజు ఈ లోపలి మౌనం
అవ్యక్తంగా
అతిదీనంగా
ఎంతో ప్రయత్నించినా
నిరసించి సొమ్మసిల్లి
తనచుట్టూ
తన ఇటుకలను తానే —
పేర్చుకుంటూ మిగిలింది.

అర్ధరాత్రి
అకస్మాత్తుగా
కళ్ళు బతుకుని తల్చుకుంటున్నప్పుడు
తలకింద తలగడలా వున్న చెయ్యి
దిష్టి బొమ్మ చెయ్యిలా
నాదికాదన్నట్టుగా
మెత్తగా రబ్బరు ముక్కలా
తలచుకుంటేనే భయంకరమైన అనుభూతి
అదే ఈనాడు పక్షవాతం వచ్చిన
మౌనంలా
లోపలే కళ్ళుమూసుకొని వుంది.

# 3. పాము

విద్యుత్ తీగలు చేస్తున్న రాగప్రస్తారం
వ్యాపించిన నిస్తబ్ధత
ప్రేమ తృష్ణ - హాయి
విస్తరించిన ఆకాశం కింద
నినాదాల మీద
ఎన్ని భ్రమలు ఎన్ని క్షణికాలు!

వాస్తవాల మీద కమ్మే పొరలు
సద్దుమణిగిన ఆర నాదాలు
కాలి పొగచూరిన గుడిసెలు
శీలంపై నమ్మకాలు చెదరిన మానాలు
అహంభావాలకుల నిర్మాణాలు
కూలినా - మాడినా
అధికారుల - ధనమాత్సర్యాల
పాము బుసకొడుతూనే వుంది.

# ఆఖరి లేఖ

## విహారి & శాలివాహన

నిన్న మీరంపిన ఆహ్వానం అందింది
నే వచ్చే సరికే సంబరం జరుగుతోంది
అప్పటికి మీరంతా ఆహ్లాదాల 'ఊగు' 'తూగు'లో వున్నారు

అప్పుడు

అలసిన మీ కనురెప్పలు - అడక్కుండానే చెప్పిన
అభ్యాంతరన్యాసలు విన్నాను

అక్కడ

మీరు ఏర్పాటుచేసిన ఖరీదైన వేర్పాట్ల 'కార్పెట్లు',
భేషజాల పచ్చి తాటాకు పందిళ్ళు,
పరస్పర గానాల షామియానాలు,
మెహర్బానీ నవ్వుల రంగు కాగితాల తోరణాలు,
మీ మేధస్సుల ట్యూబ్‌లైట్లు,
మీ సంభాషణల బాక్ & వైట్లు,
వింతో ఆత్రుతతో — మీ ద్వారపాలకుడు ఆర్భాటం చూపిన
అతిశయాల మెట్లు-అన్నీ,
అన్నీ వివరంగా చూశాను.
కళ్ళు చెదరినై, ఒళ్ళు తూలింది.
అప్పుడు చప్పున స్ఫురించింది
ఆహ్వానం తీసి మరోమారు చూసుకున్నాను
అవును — నా పేరే చెక్కవుంది.
కర్తవ్యం శరీరానికి బోధ చేసింది,
'సభ్యత'లాంటి భావన వారించింది,
అయినా—కాళ్ళు వెనక్కే మళ్ళేయి!
అశాంతి నివాసంలో—అమరలింగేశ్వరుడిలా
ఆగక పెరిగిపోతున్న విషాద విగ్రహావిష్కరణోత్సవానికి
అన్నన్నా...ప్రవేశార్హత లేనివాణ్ణి!
ఆహ్వానం పంపటంలో దొర్లిన మీ పొరపాటుకు
నేనే క్షంతవ్యుణ్ణి!! చిత్తగించండి!!!

# గీతప్రవాహం!

శ్రీ నందిని సిధారెడ్డి

కిరణాల చేతులో,
నా సూర్యుడు
వంగి కలాన్ని కదిలిస్తున్నాడు.
సముద్రం బుడ్డిలోంచి
సిరా నింపుకొన్న మేఘం పాళీ
సూర్య స్పర్శకు ఉలిక్కిపడి
కాగితపు భూమ్మీద
సిరాబిందువుల్ని ప్రసవిస్తోంది!

ఆ క్షణంలో...
కొండలమీద పడిపోయిన
సిరాబిందువులు
ఒక్కొక్కటే కలిసి
పైనుండి క్రిందికి జారుతూ
అక్షరాల సెలయేళ్ళుగా ద్రవీభవిస్తాయి!

ఆ సెలయేళ్ళ
స్నేహకలయికలో
పదాల ఉప నదీ పదాలు
పరవళ్ళు త్రొక్కుతాయి!
పిల్లనదుల సంలీనంలో
గొంతులేస్తున్న మహానదిలా
నా గీతం అనంత వేగాన్ని పుంజుకొంటూంది!

ఈ మహాగీతం విశాలంగా ప్రవహిస్తూ,
గుడిసెల్నీ; చెట్టూ-చేమల్నీ స్పృశించి,
బ్రతుకు మోళ్ళలో ఆశల్ని వెలిగించి,
వాటమీద తన గురుతుల్ని నాటుకుంటూ
సముద్రపు జాతిలోకి
చొచ్చుకుపోతూ
ఆ సముద్రానికే అంకితమౌతుంది.

అప్పుడు—
కొన్ని నిమిషాలు చలనం స్తంభించినా
నాలోని సూర్యుడు మళ్ళా కృషించి
మేఘాన్ని సముద్రంలో ముంచుకుంటూ
సిరాచుక్కలు నేలపై వదులాడు!
ఆచుక్కలు రానురాను
దశలోకి రూపరుతూ
మళ్ళా మహానదిగా ప్రవహిస్తాయి!

అందుకే—
ఈ మహానదికి మరణం లేదు.
ఈ గీతానికి మరణం లేదు.
ఈ నదీగీతం అన్ని వేళల్నీ
ఆవిష్కరించుకుంటూ ప్రవహిస్తూంది!!
జాతి సముద్రంలోంచి...
జాతి సముద్రంలోకి!!

శ్రీ ఏరూరు సీతారామశర్మ

శ్రీ జానమద్ది హనుమచ్ఛాస్త్రిగారు 1976 ఫిబ్రవరినెల భారతిలో ప్రకటించిన 'జైనపురాణములు–జైన సంప్రదాయములో రామ కథ' యను వ్యాసమును జదివితిని. వారందు విశేషము లొకటి రెండు దెలిపినారు. ఎన్నియో విశేషాంశములుగలవు. వాటిని తెలుగు వారికి పరిచయము చేయ గుతూహలముగలిగినది. తెలుగువారికి వాల్మీకి రామాయణము చక్కగా తెలియును. జైన రామాయణములు తెలుగు నాట బహువ్యాప్తిలోలేవు. అందులకే తెలుగువారికెక్కువగా తెలియవు. అందులోని కథాభేదము, పాత్రల చిత్రీకరణమునందు భేదము, సన్నివేశములందు భేదము లెన్నియోగలవు. అందు కొన్నిటిని వ్రాయ బూనుచున్నాను.

శ్రీ మచ్ఛాస్త్రిగారు విమలసూరి కృత 'పవుమచరిఅ' లోని రామకథయందుగల మార్పులను గురించి విపులముగ దెలిపియున్నారు. "ఈ రెండు పురాణములలో వ్యత్యాసము గానవచ్చుచున్నది. మొదటిది దిగంబర సంప్రదాయము. రెండవది శ్వేతాంబర సంప్రదాయమునకు జెందినది" అని విశేషాంశములను వివరించుటకే పూనుకొని, "తక్కిన రెండు రామాయణములు జైన సంప్రదాయమున కనుగుణమైన మార్పులతో రచింపబడినవి" అని ముగించి విమలసూరి రామకథా విధానమును వ్రాయ మొదలిడిరి. శ్రీమచ్ఛాస్త్రిగారు ప్రారంభించిన కార్యమును కొనసాగించుటకు ప్రయత్నము చేయుచున్నానని సవివరముగ తెలుపుకొనుచున్నాను.

జైనరామాయణములందు ప్రధానముగా రెండు సంప్రదాయము లున్నట్లు గానబడును. ఈరెంటియందు కథావిధానమున భేదముకలదు. మొదటి సంప్రదాయము విమలసూరి ననుసరించినరీతి. రెండవది గుణభద్రాచార్యుని పద్ధతి. దేవచంద్రాచార్యుడు యీ రెండు సంప్రదాయములను సమన్వయించుకొని రచన సాగించినట్లు 'కన్నడకవి చరితె' వలన దెలియుచున్నది. "సకలజినశాస్త్రక థెగళం సంబంధిసి రామకథావతార" మును వ్రాయుటకుబూనుకుంటాడు దేవచంద్రుడు.

ప్రాకృతభాషలో 'పవుమచరిఅ' పురాణములు రెండు కలవు. మొదటిది చౌముహకవి వ్రాసినది. ఇతడీ కావ్యమును వ్రాసినట్లు పదియవ శతాబ్దివాడగు ధవళకవి తాను వ్రాసిన 'హరివంశపురాణము' నందు పేర్కొన్నాడు. స్వయంభుదేవుడను మఱియొక కవి వేరొక 'పవుమచరిఅ' ను వ్రాసినట్లున్నది. ఈ గ్రంథము పూర్తియగుటకు మునుపే అతడు పరమ పదించుటతో నతని కుమారుడు త్రిభువన స్వయంభువను నతడు పూరించెను. కాని కాలవాహినిలో నీతడు వ్రాసిన భాగము నశించిపోయెనట! లుప్తమైన నీభాగమును 'జసకిత్తి భట్టారకుడ'ను నాతడు పూరించెనట. ఇట్టి రెండవ 'పవుమచరిఅ' గ్రంథము కవి త్రితయకృతమై 12000 శ్లోకములు గలిగి విరాజిల్లు చుండినదట. పై రెండు గ్రంథములు దుర్లభములైనట్లుగా సాహిత్య పరిశోధకులు తెలుపుచున్నారు. ప్రాకృతభాషలోని యీ రెండు గ్రంథములు విమలసూరి సంప్రదాయమునకు జేరినవిగా నూహింప బడుచున్నవి.

సంస్కృతభాషలో విమలసూరి సంప్రదాయమునకు జెందిన గ్రంథములు గలవు. అందులో రవిశేణుడు వ్రాసిన 'పద్మపురాణం' లేక 'మహారామాయణం' అను కావ్యమొకటి. హేమచంద్రుడు వ్రాసిన జైనరామాయణము యింకొకటి. ఈ కవి కృతమగు 'త్రిషష్టి శలాకా పురుష చరిత' మందలి ఏడవ సర్గలో నీ రామ కథ కలదు. దేవ విజయగణి రచించిన 'రామకథావతారం' అను గ్రంథము సంస్కృత భాషలో వెలసిన మఱియొక గ్రంథము.

విమలసూరి ననుసరించి కన్నడకవులు కొందరు రామాయణము లను రచించియున్నారు. వారిలో పేర్కొనదగినవాడు నాగచంద్రుడు. ఇతడు 'పంపరామాయణము'ను వ్రాసియున్నాడు. చంద్రసాగరవర్ణి వ్రాసిన 'జినరామాయణము' గలదు. ఈ గ్రంథమంతయు షట్పదీ ఛందస్సులో వ్రాయబడినది. దేవచంద్రుడింకొక మహాకవి. ఇతని గ్రంథము 'రామకథావతార' మనునది. 'రామ విజయచరితె' యను నది మఱియొక కన్నడ భాష రామాయణముగలదు. ఏతద్గ్రంథకర్త దేవప్ప. ఇవిగాక షట్పదీ ఛందమునగల 'కుముదేందు రామాయణము' అను గ్రంథమొకటిగలదు.

ఇట్లు ప్రాకృత, సంస్కృత, కన్నడ భాషలలో విమలసూరి, 'పవుమచరిఅ' ననుసరించి బయలుదేరిన గ్రంథముల వివరము నను తెలిపికొంటిమి. ఇంక "ఉత్తర పురాణ" కర్తయగు గుణభద్రా చార్యుని పద్ధతిననుసరించి బయలువెడలిన రామాయణములనుగూర్చి తెలిసికొందము.

గుణభద్రుని 'ఉత్తర పురాణము' నందు 'మునిసువ్రతజిను'ని కథను చెప్పు సందర్భమున అరువది ఎనిమిదవ అధ్యాయమున రామ చరిత కలదు. ఇక్కడి రామకథ విమలసూరి రామకథకంటె భిన్నముగా నున్నది. దీనిని తరువాత వివరించెదను. గుణభద్రు ననుసరించి వచ్చిన రామకథల వివరములు :— ప్రాకృతభాషలో పుష్పదంతుడు రచించిన 'తిసట్ఠి మహాపురిస గుణాలంకార' యనునది యొకటి. ఇందు రామకథ గలదు. సంస్కృతభాషలో (1) రామచంద్రముముక్షుడు వ్రాసిన 'పుణ్యాస్రవ' కావ్యము, (2) కృష్ణకవి కృతమగు 'పుణ్యచంద్రోదయ పురాణము' ముఖ్యములైనవి.

కన్నడభాషలో పుణ్యాస్రవ కావ్యమును నాగరాజు అనువదించెను. ఇంక చావుండరాయని కథయొకటి కలదు.

ఉదాహృతములైన గ్రంథములన్నియు గుణభద్రాచార్యుని పద్ధతి నవలంబించినవి. ఇవిగాక బంధువర్మ రచితమైన 'జీవసంబోధనె' లో రావణుని కథ గలదు. ఈ కథ పై రెండు సంప్రదాయములకు భిన్నముగా నున్నది.

గుణభద్రాచార్యుని రామకథ యీవిధముగానున్నది :

రత్నపురమునకు రాజు ప్రజాపతి. అతని యర్ధాంగి గుణకాంతి. వీరికి చంద్రచూళుడను నొక్క కుమారుడు పుట్టెను. మంత్రికుమారుడగు విజయుడు. చంద్రచూళునకు పరమస్నేహితుడు. ఆ రత్నపురమునందు కుబేరనామకుడగు నొక గొప్పవాడు కలడు. అతని కూతురు రూపయవ్వన సంపన్న. చంద్రచూళ విజయు లిర్వురు ఆమెను కామించిరి. ప్రేమకలాపము లోకకొంత గూఢముగా జరిగినవి. కాని చివరకు బయలుపడిపోయెను. అభియోగ మధికారుల దృష్టికి దీసికొన రాబడినది. విచారణ జరిగినది. నేరస్థు లిరువురకు దేశభ్రష్టత్వము శిక్షగా విధింపబడినది.

వారిరువురు దేశభ్రష్టులై పరిభ్రమించుచుండగా మహాబలుడను నొక జైనముని వారికి దర్శన మిచ్చెను. వార లాతని పాదములపై బడి తమ వృత్తాంతమంతయు విన్నవించుకొనగా నాజైనముని వారిని గరుణించి, యుపదేశమిచ్చి, దీక్షనుగూడ నొసంగెను. అప్పటినుండి వీరిరువురు మూడు జన్మలెత్తిరి. నాలుగవజన్మమున వీరు కాశీ విషయమున వారాణసీ పురమునేలు దశరథమహారాజునకు రామలక్ష్మణులను పేర్లతో బుత్రులుగాబుట్టిరి. వీరి జననము తరువాత దశరథుడు తన రాజధానిని సాకేతపురమునకు మార్చెను. దశరథుడీ క్రొత్త రాజధానియందు భరత, శత్రుఘ్నులను పుత్రులబడసెను.

రావణుని తండ్రి లంకాధిపతియగు పులస్త్యుడు. తల్లి మేఘశ్రీ. మణిమతియను నొక సుందరాంగి తపస్సుచేయుచుండగా రావణుడామె సౌందర్యమునకు నిర్భాంతుడై మోహించి తన మనస్సామెకెఱింగించెను. దానికామె క్రుద్ధయై, వాని సంహార నిమిత్తము వాని భార్యయగు మందోదరి గర్భమందు చేరి యామెకు గూతురుగా నుదయించెను. మందోదరి కీవిషయమంతయు దెలిసినది. ఆమె వెంటనే పుట్టిన బిడ్డను దూరముగా బారవేయుడగువారలనియోగించెను. వారు బిడ్డనొక పెట్టెలోబెట్టి మిథిలానగర సమీపమునగల యొక తోటలో బారవేసిరి. మిథిలానగరరాజు, జనకుడు యజ్ఞము చేయనెంచి భూశోధనము గావించుచుండగా నీపెట్టె దొరికినది. అందలి బిడ్డ వారికి దక్కినది. ఆమెయే సీత.

సీతారాముల వివాహము జరిగినది. రాముడు సీతా లక్ష్మణ సహితుడై వారాణసీ పురమున కొంతకాలము వినోదించుచుండెను. ఇంతలో నారదుడు రావణుని కడకేగి సీతాదేవి సౌందర్యమునుగూర్చి వర్ణించి వానిని సమ్మోహితుని జేసెను. వాడు శూర్పణఖయను నామెను సీత మనస్సు తెలిసికొని రావలసినదిగా నాజ్ఞాపించి పంపెను. ఆమె వారాణసీ సమీపమునగల చక్రకోటోద్యానమున రామునితో విహరించు సీతనుగాంచి, వృద్ధస్త్రీవేష ధారియై, సమీపించి సీతతో ప్రసంగము మొదలిడి, రావణుని గుఱించి చెప్పెను. సీతతో సంభాషణము ప్రయోజనకారి కాకపోగా, నామెచే తిరస్కృతురాలై మఱలిపోయెను. రావణుడీవార్త విని, సీతాపహరణ నిమిత్తము మారీచుని మణిహరిణముగజేసి సీత చెంగట దిరుగునట్లు చేసెను. రాముడు దానిని వెంబడింపగా నది చాలదూరముగా పోవును. ఇంతలో రాముడు రామవేషధారియై పుష్పక విమానమును పల్లకిగామార్చి, తానత్యారూఢుడై 'సాయంకాలమైనది, నగరమునకు బోవుదము, రమ్ము, పల్లకి నధిరోహింపు' మనిచెప్పి సీతను లంకానగరమునకు గొనిపోవును. రావణుని మోసమెఱింగి, రామలక్ష్మణుల క్షేమ వృత్తాంతము తెలియువఱకు అనశనవ్రత మాచరింప మొదలిడెను. ఈ వ్రత సమాప్తమగువఱకు రావణుడు సీత పొందు అలభ్యమనిదలంచి యూరకుండవలసివచ్చెను.

రామలక్ష్మణులు సీతను వెదకుచువచ్చి సుగ్రీవ హనుమదాదుల మైత్రిని సంపాదించిరి. లక్ష్మణుడు వాలిని చంపును. హనుమంతుడు లంకకుబోయి సీతాన్వేషణము గావించుకొనివచ్చును.

మందోదరి కేదోయొక యజ్ఞాత హృదయవాణి, సీత తనచే త్యజింపబడిన పుత్రికయని చెప్పినట్లు తెలిసికొనెను. సీతను విడిచి పెట్టి రామునకిచ్చి రమ్మని రావణుని ప్రార్థించును. రావణుడంగీకరింపడు. విభీషణుడు రాముని పక్షము వహించెను. యుద్ధమనివార్యమైనది. రావణుడు యుద్ధభూమికి రావలెనను తలంపుతో లంకానగరమును హనుమంతుడు కాల్చివేయును. అప్పుడాతడు గిరియందు రావణుడు నియమబద్ధుడై వ్రతమాచరించి, చిత్ర విచిత్ర శక్తు లనేకములు సంపాదించుకొని యుద్ధభూమిని ప్రవేశించెను. రావణుడు మాయాసీతను సృష్టించి యుద్ధభూమిలో ఆమె శిరశ్ఛేదము గావించెను. ఆ దృశ్యముజూచి రాముడు ఖిన్నుడయ్యెను. చివరకు లక్ష్మణుడు చక్రాయుధముతో రావణుని చంపివేయును.

రాముడు వారాణసికి మఱలివచ్చి రాజ్యము చేయుచుండి, వృద్ధుడైన తరువాత, 'కేవలి'[1] యగును. లక్ష్మణుడు పంక ప్రభా నరకమున బడిపోవును.

గుణభద్రుని కథలో సీతమందోదరి కూతురు. అద్భుత రామాయణమునందు కూడ సీత మందోదరి కూతురు.

రామకథ భారతీయులకు ప్రీతిపాత్రమైన కథ. ఈ కథ హిందూ, బౌద్ధ, జైన ప్రాచీన సంప్రదాయములందు పలువిధములుగా ప్రచలితమైనది. ఈనాటికి వాల్మీకి మహాముని రచించిన రామాయణమే మొట్టమొదటిదని విద్వాంసులెల్లరు అంగీకరించియున్నారు. వాల్మీకి రామాయణము తరువాత రామకథ మహాభారతమునందు, బ్రహ్మపురాణమునందు, పద్మపురాణమునందు, అగ్నిపురాణమునందు, వాయుపురాణమునందు, అతిస్వల్ప విభేదములతోను, సంగ్రహింపబడియు వ్రాయబడినది. ఇవిగాక ఆధ్యాత్మ రామాయణము, ఆనందరామాయణము, అద్భుత రామాయణములందు యీ రామకథ కలదు. ఇట్లులనే జావా, సుమత్రా ద్వీపములందు రామాయణకథ అనేక రూపములను దాల్చి ప్రచారము చేయబడినట్లున్నది.

పైపేర్కొనబడిన రామాయణము లన్నిటికంటె, బౌద్ధుల రామాయణకథ భిన్నముగా నున్నది. బౌద్ధ రామాయణకథ 'దశరథ జాతక'మునందుగలదు. ఈ రామకథ ప్రకారము, బుద్ధుడు తన పూర్వ జన్మలలో నొక్కటియందు రాముడై జన్మించెను. ఇతని తండ్రి కాశీ రాజగు దశరథుడు. దశరథునకు పదునారువేల భార్యలు. వారిలో పట్టపు రాణికి రామలక్ష్మణులు పుత్రులు సీత పుత్రిక. రామలక్ష్మణ సీతలు వీరి తల్లి గతించిన తరువాత పట్టపు రాణియైన యామె యందు భరతుడు జన్మించెను. భరతునికి రాజ్యమిప్పించవలచి యతని తల్లి, రాముని అడవుల కంపెను. చెల్లెలగు సీతతోగూడి రాముడు హిమాలయమునైపునకు బోవును. రాముని అరణ్యవాసము తొమ్మిదేండ్లు గడచిన తరువాత దశరథుడు మరణించెను. భరతుడు రాముని తిరిగి రమ్మనికోరుట, అతడు నిరాకరించుట, వనవాసానంతరము రాముడు పట్టణ ప్రవేశము చేయుట జరిగినది. రాముడు సీతను—తన చెల్లెలిని - వివాహము చేసికొని పదునారేండ్లు రాజ్యపాలన మొనరించెను. ఈ రామాయణకథలో రావణుని ప్రస్తావనయే లేదు. శుద్ధోదనుడు పూర్వజన్మమున దశరథుడు. అతని రాణి, రాముని తల్లి. రాహులుని తల్లి సీత.. బుద్ధుడే రామచంద్రుడు. అతని ముఖ్యశిష్యుడగు ఆనందుడే భరతుడు. బుద్ధుడు జన్మమెత్తిన శాక్యవంశమందు అన్న చెల్లెలిని వివాహమాడు సంప్రదాయ ముండినట్లూహించుట కవకాశమున్నది.

బౌద్ధజాతక కథలలో 'సామజాతక' మొకటి. దీనియందు దశరథుని శాపవృత్తాంతము విపులముగా జెప్పబడినది. 'వత్సాంతర జాతక'మను మఱియొక కథగలదు. ఇందు రాముడు సీతనడవికి రావలదని పలువిధములుగ జెప్పును; కాని సీత రాముని యొప్పించి అడవికేగు వరకుగల కథ వర్ణింతము. 'వంబుల జాతక' మింకొక కథ. శూర్పణఖి రాముని మోహించుట, ముక్కు చెవులు కోయించుకొని భంగపడుట యను ఘట్టము ప్రధానముగా వర్ణింపబడినది. 'లంకావతారసూత్ర' మను బౌద్ధ గ్రంథమొకటి కలదు. ఇందులోని రావణుడు మహాతపస్వి. జితేంద్రియుడు. కరుణామయుడు, ధర్మమార్గానువర్తి. రావణుడు బుద్ధునితో చర్చచేయును.

ఇట్లు ప్రాచీన బౌద్ధ సాహిత్యమునందు రామాయణకథకు సంబంధించిన వానిలో సురక్షితముగా నున్నవి రెండు జాతక కథలు. అందులో మొదటిది "జాతకట్ట వణ్ణనా" అనునది. ఇందులోనే దశరథ జాతక కథ కలదు. రెండవది "సుత్తపిటక"యనునది.

ఇంతవఱకు కథాభేదములు, సన్నివేశ భేదములగూర్చి చెప్పితిని. ఇంక పాత్ర చిత్రీకరణ భేదమును వివరింప నెత్తింతును రామాయణములో ప్రతినాయకుడు రావణుడు. అతని పాత్ర చిత్రణలోగల భేదములను పరిశీలింతము.

వాల్మీకి రామాయణములోని రావణుడుద్ధతుడు ఉద్ధతమనగా పైకెగురుటయని యర్థము. ఉద్ధతునిలో నీ యెగురుట కంతేయుండదు. ఎన్నిసార్లు దెబ్బతిన్నను ఎగురుట మాత్రమాగిపోదు. ఉద్ధతుడైన రావణునకు ఆత్మస్తుతి, పరనింద, ఎదుటివారిని చులుకనగా చూచుట మొదలగు దుర్గుణములు కలిగియుండుట విపరీతముగాదు. కొంత చపలత్వ మలవడియే యుండును. వాల్మీకి తీర్చిదిద్దిన రావణునకు మాత్సర్యము మెండు. మదము, పరహింసయందు సంతోషము మొదలైన గుణపుంజములకు రావణుడు ఆకరము. కుబేరునివంచి లంకానగరమును గొను విషయమున నీతని కుటిలత్వము, యుద్ధత గమనింపవచ్చును. కుబేరుని తరువాత వరుసగా కొందరు మహాబలవంతులను జయించినాడు. రావణుని జీవితములో అతనికి ధ్యేయములుగా నున్నవి రెండు విషయములని చెప్పవచ్చును. ఒకటి అతడు పరాక్రమ నిధియగు వీరుడు అనుభావము. వాలిచేతను కార్తవీర్యార్జునిచేతను పరాజయము పొందియు నీతని వీరత్వ మాగలేదు సన్నగిల్లలేదు. రెండవది స్త్రీ కాముకత - అన్యస్త్రీవాంఛ. రెండవ ధ్యేయమే అతని మరణమునకు గారణమైనది. రావణుని అనుచిత ప్రవర్తనకు లొంగి బాధపడినవారు వేదవతి, మఱియు రంభ.

జైనరామాయణములలో ప్రసిద్ధమైన విమలసూరి రామకథలోని రావణుడు మనకు చాల భిన్నుడుగా కనపడును. అతని చరిత్రని విధముగా వ్రాసినాడు చూడుడు:—

ఇంద్రుడొకసారి విద్యాధరునితో పోరిలో నోడిపోయి అలంకార పురము - పాతాళలంక—లో దాగియుండెను. అతని కక్కుడ రత్నశ్రవుడను పుత్రుడు గలిగెను. అతడు యుక్తవయస్కుడై యున్నప్పుడు కైకసి యను కన్యను వివాహమాడెను ఈ దంపతుల ప్రథమ పుత్రుడే రావణుడు. ఇతనికి భానుకర్ణుడు విభీషణుడను తమ్ములు. చంద్రనఖియను చెల్లెలు గలరు. రావణుని వంశముతో యదవాహనుని వంశము. కైకసి తన బిడ్డ చక్రధర సమాన వైభవుడు, అశేష యశోవిశాలుడు, రణకేళీ కలహాభిలాషి యగునని తెలిసికొన్నదో. రావణుడు బాల్యమునందే సకలశాస్త్ర పారంగతుడై, తమ్ములతో గూడ దపమాచరించి, ఆకాశగామి విద్య మొదలగునవి సాధించెను. చంద్రహాసమును బడసెను. రావణుని పరాక్రమ వైభవములను విని మయుడు తన కూతురు మందోదరినిచ్చి పెండ్లిచేసెను. వైశ్రవణుని జయించి లంకనాక్రమించి, పుష్పక విమానమును కైవసము గావించుకొనెను. త్రిజగద్భూషణమను భద్రగజమును గడిసి దాని

పర్వుడగించెను. కైలాస పర్వతమును కదలించి, పర్వత రాజును మెప్పించి అతని వలన శక్త్యాయుధమును బడసెను.

రావణుడు జైనుడు. యుద్ధములు క్రూరకర్మములని తెలిసియు అతడనేక యుద్ధములు చేసెను. అతడు యుద్ధములను రాజ్యాభిలాషతో చేయలేదు, దిగ్విజయ యాత్ర కౌతుకమాత్రమే. అతని పరాక్రమ ప్రకటన, ప్రచారము వఱకే పరిమితమైనది. అతడు చాలదయామయుడు. జైతయాత్రలో శరణాగతిపొందిన రాజులను కరుణించి కప్పము గైకొని విడిచిపెట్టెను. ఇతని చేతిలో మృతి బొందిన వారెవ్వరులేరు. మహిష్మతీపురాధిరాజగు సహస్ర బాహుని నిర్జించి యుండగా జైన మునులతని విడిచిపెట్ట వలసినదిగా కోరిరి. వారి కోరిక మన్నించి సహస్రబాహుని విడిచిపెట్టెను. వరుణుని చెరపట్టినప్పుడు, రాజ్య ప్రజలకోరిక మేరకు రావణుడు వరుణుని విడిచిపెట్టెను. ఇంద్రుని చెరపట్టగా, అతనితండ్రి సహస్రాక్షుడు రావణుని ప్రార్థింపగా ఇంద్రుని విడిచిపెట్టును. ఇట్లు విమలసూరి రావణుడు దయాగుణ సమన్వితుడు.

అష్టాపద శైలముందు రావణుని సామంతరాజ్యముకలదు. దానికి సమీపమున దుర్లంఘ్యపురమున్నది నలకూబరుడు దానికి రాజు. రావణుని జైతయాత్రను విని తన కోటను దుర్భేద్యముగ నొనరించుకొనెను. రావణుడు కోటను ముట్టడించెను. సాధ్యము కాలేదు అప్పుడు చిత్రమాలియను నలకూబరుని భార్యయగు ఉపరంభ దూతిక రావణుని దగ్గరకువచ్చి, తన యజమానురాలు తమయందు బద్ధానురాగయై యున్నదనియు, తమరు ఆమె కోరికదీర్పవలయుననియు దెలుపగా నతడు చెవులు మూసికొని తన శీలసంపదకీనాడు అపవాదు వచ్చినందులకు చింతచేసి, రూపవతులగు వేశ్యలనే కన్నెత్తి చూడని తాను పర స్త్రీ కోరిక నెరవేర్చుటెట్లని విచారించును ఎంగిలివలె పరనారి వర్జనీయమని వచించును. కాని, రాచకార్యవిదులైన మంత్రులయనుమతిమీద ఉపరంభను తనదగ్గరకు రావలసినదిగా కోరును. ఆమెవెంటనే రావణుని సమీపించును. కోటను భేదించు నుపాయమడుగగా, ఆమె ఉపాయము చెప్పగా దాని ప్రకారము దుర్లంఘ్యపురమును జయించును. ఉపరంభ తన కోరిక నెరవేర్పగోరగా "తల్లీ నీవునాకు గురువు. కోటను పడగొట్టు విద్యను నేర్పిన గురువు గనుక నీవు నీభర్త నలకూబరునితో సుఖముగనుండు" మని నలకూబరునకు రాజ్యమును యిచ్చివేయును.

విమలసూరి రావణుడెంతటి పరస్త్రీ పరాఙ్ముఖుడో మనకు దెలియును. జైతయాత్రలో అనంత వీర్య కేవలుల[1] దర్శించి వారి సన్నిధియందు 'పర మహిళా విరతి' వ్రతమును స్వీకరించును. ఇట్లు విమలసూరి రావణుడు, ధార్మికుడు, సుజనుడు, దయా, క్షమాగుణ భూషితుడు. ధన్యజీవి. కాని యిట్టి రావణుడు సీత నిమిత్తము దశరథ రామునిచేత నిహతుడగునని నైమిత్తికులు చెప్పగా తెలిసికొనెను.

రావణుడు ప్రయత్నవాది. కనుక దశరథ జనకులను సంహరింప నుద్యోగించెను. వారిరువురు చనిపోయినచో సీతయెక్కడ, రాముడెక్కడ, రావణవధ యెక్కడిది. ఇట్లు అతని యూహలు ప్రబలినవి. దశరథ జనకులు నారద ప్రేరితులై తమ తమ స్థానములను విడిచి తలదాచుకొనిరి. రావణునకు విధి యెదురైనది. సీతారాముల జననము, వివాహము, అరణ్యవాసము మొదలగు నవన్నియు జరిగినవి. అడవిలో లక్ష్మణుడొక వెదురు పొదను చూచును. అందు చంద్రహాస మొకటి కనుపించెను. దానిని తీసికొని ఝళిపించుచుండగా చంద్రనఖి కుమారుడు కత్తి కెరయై మరణించును. దానితో ఖరదూషణునితో లక్ష్మణుడు యుద్ధమునేసి చంపును. రావణునకీ వార్త తెలిసివచ్చి, సీతను చూచును. మోహ పరవశుడై రావణుడు సీత నపహరించును.

ప్రాణి హింస చేయకూడదని మరుత్తుని యజ్ఞమునే నిలిపివేసిన రావణుడు సీత సహాయార్థమొచ్చిన సర్వ ప్రాణులను సంహరించెను. అతని పరమహిళా విరతి వ్రతము పటాపంచలైనది. తుదకు సీతకారణముగా లక్ష్మణునిచే నిహతుడగును.

ఇట్లు వాల్మీకి రావణుడు, విమలసూరి రావణుడు ఎంతో భేదము కలిగిన పాత్రలుగా గనిపింతురు.

కథావిధానమునందు, సన్నివేశములందు, పాత్ర చిత్రణము లందనేక భేదములు కలిగియున్న నీజైనరామాయణాలను త్రవ్విన కొలది విశేషములు బయలుపడుచునే యుండును.

---

1. 'కేవలి' యనగా కేవల జ్ఞానము కలవాడు. అనగా దేశ కాలముల కతీతమైన సర్వజ్ఞత్వము కలవాడు. ఈ సర్వజ్ఞత్వము తీర్థంకరులకు, గణధరులకు దప్ప యుండును. కనుకనే వారు కేవలులు. ఈ పదము జైనధర్మమున వాడబడిన పారిభాషిక పదము.

# నా జీవితం

**నాగార్జున శ్రీ**

కను బొమ్మ విల్లులుగ
కనుచూపు తూపులుగ
కను రెప్ప కాపుగా

కనుపాప లొత్తులుగ
కళ్లు ప్రమిదలు కాగ
కన్నీరు చమురుగా

కను వెలుగులో నాకు
వెలుగు లిచ్చిన తల్లి
తండ్రులకు అంకితం

# సంగీత సాహిత్యాల సంబంధం

శ్రీ వాడపల్లి లక్ష్మీనారాయణాచార్యులు

"మాణిక్యవీణా ముపలాలయంతీం మదాలసాం మంజుల వాగ్విలాసాం! మాహేంద్ర నీలద్యుతి కోమలాంగీం మాతంగ కన్యాం మనసాస్మరామి॥"—

అని ఇలా సరస్వతీ స్తుతి చేసినవాళ్ళంతా ముందుగా ఆమెను వీణాపాణిగానేచూచి, ఆతర్వాతే వాగ్రూపిణిగా ధ్యానించేరు.

సాహిత్యానికీ సంగీతానికీ అవినాభావ సంబంధంవుంది!

ఈ రహస్యాన్ని ఆకళించుకొనే ఎవరోచాలా చమత్కారంగా—

"సంగీతమపి సాహిత్యం సరస్వత్యాః స్తనద్వయం।

ఏక మాపాత మధురం అన్యదాలోచనామృతమ్ "—

అన్నారు. ఈ శ్లోకాన్ని జాగ్రత్తగా పరిశీలించాలి! ముందుగా ఈ శ్లోకంలో ప్రథమస్థానాన్ని సంగీతాని కివ్వడాన్నీ; యథాక్రమంగా సాహిత్య వైశిష్ట్యాన్ని 'ఆలోచన' అనే పద సభంగశ్లేషలో— 'ఆలోచన' అంటే 'Thought' అనీ, 'ఆలోచన' అంటే 'కన్నులవిందుగా' అనీ రెండర్థాల్ని సమ్మిళితంచేసి—చెప్పడాన్నీ గమనించాలి.

అంతేకాదు—సరస్వతి మనకు తల్లికదా! తల్లిపాలు మాత్రమే పిల్లలకి మేధస్సునీ, శక్తిసామర్థ్యాల్నీ కలుగజేస్తాయని వైద్య శాస్త్రం చెప్పేమాట! అంచేత—శ్లోకంలోని 'ఆపాత మధురం' అనే పదం శారీరక శక్తి సంబంధము తద్వారా రసనా విషయకమనీ; 'ఆలోచనామృతం' అనే పదం మేధస్సంబంధిత దృగ్విషయకమూ అని గుర్తించాలి. కాబట్టి ఆ తల్లి స్తనాల్లో ఏది కరువైనా మనం మన లేమన్న సంగతి నిశ్చయంగా తెలుస్తోంది.

ఇంకో చమత్కారంకూడా వుంది శ్లోకంలో! స్త్రీకి రెండు స్తనాలుండడం ప్రకృతి సహజం! అలా 'ప్రకృతి' అనే శిల్పి తన సృష్టియైన సమస్త స్థావర జంగమాత్మక సౌందర్యసృష్టికీ పరాకాష్ఠ నందిన సౌందర్య సృష్టిగా మానవస్త్రీమూర్తిని తీర్చి దిద్దుకొన్నాడు. అంచేత—సరస్వతీమూర్తిలో ఏకస్తనత నాశించడం ప్రకృతికే విరుద్ధమవడమేగాక; అటు సరసతకీ—ఇటు వాత్సల్యతకీ; అటు మూర్తిమత్వానికీ—ఇటు మాతృత్వానికీకూడా తీరనిలోటు!

నాటి ఋషుల మొదలు నేటి శ్రీశ్రీ వరకూ కవితారూప నిర్వచనం చేసినవాళ్ళందరూ సంగీత సాహిత్యాల అవినాభావ సంబంధాన్ని వొప్పుకొన్నవాళ్ళే!

"కిన్నెర మెట్ల బంతి సన్న తంతిపై పసం దిపుటారెడు గోటమీటు బల్ ప్రోతలు నుంబలె హారువు మెత్తని గావలె నచ్చ తెన్గు లీలతిగ" అని అంటూ— "మృదంగా తతతేహిత హిత హీ ధిత థంధాణు ధింధిమి ప్రాతఃయానుకూలంగా — కింకిణీ నూతన ఘల్లలా చరణ నూపుర ఝూంఝుళ్వంగా" కవిత్వం వుండాలన్న పెద్దన్నకీ; "నా ఊళ కేదారగీళ!—" అని అంటూ— "నుడుల తీగలపై సాగిన నాదబ్రహ్మపు పరిచుంబనాల్ని" ప్రతిబింబిపజేస్తూ— తనను "మంతించిన సమ్మోగ్ధంగావించిన ఆ గాంధర్వానికి" దాసోహమంటూ— "నానాగానానూనస్వానావళితంగా" కవితా సాక్షాత్కారాన్నందిన శ్రీశ్రీకీ; "పురాణవైణవికునట్లు — విధుర ప్రియశవో విధుల మంగళస్వాదు వాక్యముల నూదగలను" అన్న కృష్ణశాస్త్రికీ ఈ సాహితీసంగీత నిత్యసంబంధం తెలును!

"సంగీత భరితమైన ఆలోచనే కవిత్వ"మన్న కార్లైల్‌కీ; "కవిత్వానికి లయ నియత ధర్మమేగాక—సహజ ధర్మ"మన్న హడ్సన్‌కీ; "సౌందర్యానికి—లయాన్విత సృష్టి చేయడమే కవిత్వమంటే!" అన్న పోకీ ఈ సంబంధం తెలుసు! ఇక—"ఉన్నత కవిత్వం ఛందోవిహీనంగా కూడా వుండచ్చు—అన్న కోలరిడ్జి భావంలో సంగీత సమేత రచనమే వుంద"న్న లైహంట్ ప్రతిపాదనకూడా ఇక్కడ స్మరించాలి.

తొలి నాళ్ళ మానవునిలో తొలిగా రేకెత్తినది కూనిరాగమే అనీ; ఆతర్వాతే మాట పుట్టిందనీ పురాతత్వ విదుల సిద్ధాంతం! అంచేత జన్మతఃకూడా సంగీతానిదే అగ్రస్థానం!

మానవుని వివిధ మానసిక స్థితులలోంచీ: శోక కోపానురాగాది భావనలలోంచీ; అప్పుడప్పుడూ మానవుడు ప్రకృతిలోని విభిన్న పరిస్థితుల్లో—కోలాహల ప్రభంజనాది ధ్వనుల్నిచూసి ఝడిసీ మురిసీ వేసిన కేకలలోంచీ—వివిధ రాగాలు పుట్టేయి!

ఆమాటల్ని ఈరాగాల్లో మేళవించుకొని పాటల్ని అలుకొని; మానవుడు తనలోని కవన ప్రకంపనల్ని సార్థకం చేసుకొన్నాడు.

పాట అంటే నైసర్గిక సంగీత భరిత రచన.

జానపద గీతాల బాణీలలోంచీ,డప్పు జాజర—వేణువు మొదలైన వాటిలోంచీ—వొక నాగరికుడు శాస్త్రీయ మౌళిక సంగీతాన్నీ మద్దెల—వీణ—సన్నాయిలలాంటి వాద్యసృష్టి నీచేసుకున్నట్టే—మరొక

నాగరికుడు వివిధరాగ రసాన్వితంగావున్నజానపద గేయ రచనలలోంచి క్రమక్రమంగా వివిధ మాత్రాజాతి వృత్తాది ఛందస్సృజననీ, వివిధ శబ్దార్థాలంకార పరికల్పనలనీ చేసుకొని పద్యాన్ని తయారుచేసుకొన్నాడు.

క్రమక్రమంగా నాగరికత పెరిగిపోతున్నకొద్దీ నాగరికుడైన మనిషికి అనాగరికుడైన మానవునితో ఇతర రంగాల్లో ఎలా పొత్తు కుదరక దూరం పెరుగుతూ వచ్చింది. ఫలితంగా సంగీతవిద్వాంసుడు జానపదుల పాటల్నీ, డప్పులాంటి వాద్యాల్నీ ఈసడించుకొన్నట్లే— పండితుడు నిసర్గ సంగీత ప్రధాన జానపద గీత రచనలనీ, వాటితో ప్రత్యక్ష సంబంధంగల మాత్రా ఛందస్సునీ క్రమక్రమంగా ఈసడించుకొంటూ విమాత్రానంత ఛందోజననానికి దారితీసేడు.

పండితుడు ఛందస్సుతో ఎంతెంతటి గారిడీలు చేసినా తాళ—లయానుగుణంగానే చేసుకొని వస్తున్నాడనీ; ప్రపంచాన ఏఛందోభరిత కవిత్వ ప్రక్రియకైనా మూల కందం జానపద గీతమేఅనీ; ఆ జానపద గేయానికి మూలబీజాలు—ఆవేశిత మానవ ముఖ వినిర్గతాలైన నైసర్గిక పదాల్లోనూ, ఆవేశిత మానవ మనో వినిర్గత సంగీతంలోనూ వున్నాయని విస్మరించకూడదు.

ఇలా చిట్ట చివరికి పండితుడు సామాన్యుడికి అర్థంకాకుండానూ సామాన్యుడు పండితుడికి అర్థంకాకుండానూ కవితా సృజన గావించుకొనే స్థితి ఏర్పడింది: ఒకవేళ సామాన్యుని గోడు పండితునికి వినిపించినా వినిపించవచ్చునేమోగాని; పండితుని సాముగరిడీలు ఏంతమాత్రం సామాన్యుని తలకెక్కకుండా తయారయ్యాయి. దీనికిగల ముఖ్య కారణాలు—ముందుకు సాగేవాడు వెనుకనున్న వాడిని పట్టించుకోక పోవడం అనే మానసిక గుణం మొదలు వివిధ రాజకీయ, సాంస్కృతిక, సాంఘిక పరిణామాలవంటి ఆనుషంగిక గుణాల వరకూ ఎన్నోవున్నాయి.

పండితుని సాము గరిడీలకు వుదాహరణలుగా— ప్రాచీన గ్రీకుల పురాణ కాలాన్నీ క్వాంటిటీ ఫూట్‌వంటి మాత్రాఛందో వైవిధ్యాలనీ; జాంబిక్ ఫూట్, పెక్టైలిక్, స్పాండాయిక్ మొదలైనవృత్తాలలాంటి ఛందస్సులనీ; ఆంగ్లేయుల ఎలిజబెతెన్ ఏరానీ డిమీటర్, ట్రిమీటర్, ఒక్టామీటర్, బ్లాంక్‌వెర్స్, అన్‌రెమ్స్ట్ ఇయాంబిక్ మీటర్ లాంటి వాటినీ; ఆర్యుల వేదకాలంనాటి అనుష్టుప్ లాంటి మాత్రాఛందోగతులూ, పురాణ కావ్యయుగాలనాటి వివిధ వృత్త ఛందస్సుల్నీ; ఆంధ్రుల కవిత్రయ యుగాన్నీ, నన్నయచేసిన వాగను శాసనత్వంతో బాటు వివిధ సంస్కృతి వృత్త స్వీకరణనీ—ఎన్నుకొని పరిశీలించవచ్చు.

అయితే, ఇలా—సామాన్య ప్రజానీకానికి అన్నిరకాలా దూరమైన పండితుడు సమయం వొచ్చినప్పుడల్లా కేవలం స్వార్థ ప్రయోజన సాఫల్యంకోసం సామాన్యుణ్ణి ఎలాగైనా తనతో కలుపుకొని తీరాలని ఆశిస్తూనే వొచ్చేడు. ఈ ఆశాసాఫల్యానికి కవిత్వాన్ని మించిన సాధనం మరోటి లేదనీ; ఆ కవిత్వానికి సంగీతం ముఖ్యోప కరణమనీ నిక్కచ్చిగా పండితుడు తెలుసుకొన్నాడు.

విడిపోవడం తేలికేగాని తిరిగి కలవడం కష్టం — అన్న నీతికుదాహరణలుగా యావత్ప్రపంచంలోని నాగరక—సామాన్యవర్గాలమధ్య జరిగిన, జరుగుతువ్న, జరుగనున్న సంబంధ ప్రయత్నాలన్నీ కన్పిస్తాయి.

తానాశించిన మత వ్యాప్తికి సామాన్యుని అండదండలూ, మందిబలం అత్యవసరంఅని గుర్తించినప్పుడల్లా దానికి సాధనం సాహిత్యమే అని గుర్తించిన పండిత వర్గం — తననాటి కవిత్వంవల్ల అది సాధ్యంకాదని తెలుసుకొని; తన దృష్టిననుసరించి ఏదో వొక రీతిగా దాన్ని సామాన్యుడికి సన్నిహితంగా రూపొందించడానికీ — తన్మూలంగా తనధ్యేయ సాఫల్యతని సాధించడానికీ తన సాయశక్తులా — పాటుపడుతూనేవుంది. -

ఇలాంటి ఈ పండిత వర్గాన్ని అర్థంచేసుకోవాలంటే వాళ్ళ సమకాలీన సమగ్ర సాంస్కృతిక, సాంఘిక పరిస్థితుల్ని మన దృష్టిలో వుంచుకొని; బహుయోజనాల దూరం ఎన్నో తరాలబట్టి వచ్చేసిన పండిత వర్గంలోంచి - తన లక్ష్యసాధనకోసం ఆయాపండితులు విడివడి ఆ సామాన్యుని గూడేల్లో చేరడానికి ఎలా ప్రయత్నించారో; ఎంతగా తమనాటి సాంప్రదాయిక వర్గంతో ఘర్షణాదులు పడివుంటారో సదవగాహనతో మనం చూడాలి!

పై పేరాలలో పండితుడు చేబట్టిన స్వార్థప్రయోజనాలనీ, అందుకై అతడు చేసిన పనులనీ ఆంధ్ర సాహిత్యపరంగా పరిశీలిద్దాం.

ఆంధ్రదేశంలో అలనాటి నన్నయమంచి నేటి విప్లవ రచయిత వరకూ అందరూ తమ మత ప్రచారానికై సంగీత సమేత సాహిత్యాన్ని సాధనంగా వుపయోగించుకు తీరాలన్న కిటుకు తెలిసినవాళ్ళే!

దేశంలో జైన బౌద్ధాలు విశృంఖల విహారం చేస్తుంటే తమ నమ్మిన, తన ఏలిక నమ్మిన వైదిక మతప్రచారానికై బద్ధ కంకణుడైన నన్నయ తత్సమ పదబాహుళ్యంతో, వివిధ వృత్త భరిత ఛంద స్వీకరణతో తాను అనుశాసించిన తెనుగులో—కవిత్వాన్నిచెప్పి; తద్వారా స్వమత ప్రచారాన్ని సాధించుకోవాలనుకొన్నాడు.

తనకు ముందువ్న పండితవర్గం ఆదరించే ఆంధ్ర కవిత్వంలో లేని నాదత్వాన్నిమాత్రం—తను ఉపయోగించాలనుకొన్న తెనుగునకు—సాయశక్తులా నన్నయ తీసుకొచ్చాడన్నది నిజం. కాని, అతనికిముందే నాగరికునికీ అనాగరికునికీ మధ్య చాలాదూరం ఏర్పడిపోయి; జానపదాంధ్రంలోని నైసర్గిక సంగీతం ఎన్నో మార్పుల్నిపొంది నన్నయనాటికుందనీ—అలాంటి ఆ పండిత వ్యవహృతంగావున్న తెలుగునే నన్నయ సంస్కరించాడని మనం మర్చిపోరాదు.

తననాటి సంఘంలో సాహిత్య సాధనంతో స్వమత ప్రచారాన్ని విశృంఖలంగా సాగిస్తున్న జైన బౌద్ధుల అంతరార్థాభిప్రాయాలని అంతంత మాత్రంగానే నన్నయ గ్రహించేడుగాని; వాళ్ళు పామరులకి అత్యంత సన్నిహితంగా జరిగిపోడానికై రాజభాషా ప్రతిపత్తి సంస్కృత భాషనుసైతం త్రోసి రాజని, ప్రాకృత భాషలలోనూ పాళీ, పైశాచి

న్యుల చేరువకు చేర్చవలసిన అగత్యం పండితునికి తిరిగి కలిగి; అంతా క్రొత్త; ఎన్నెన్నో సమస్యలు - అంటే - సరిగ్గా మునుపటి తరాలవారి నాటివే—ఎదురైనాయి.

పూర్వీకుల అడుగు జాడల్లోనే వీళ్ళు సాగిపోతే అవలీలగా గమ్యాన్ని చేరివుందురేమో! కాని; పాత అంతా రోత అనుకోడం; ఏమాత్రం పాశ్చాత్య సాహిత్యావగాహన - అనే కారణాలవల్ల వీళ్ళు ఎప్పటి కప్పుడు ఎవరిమట్టుకు వారు తమకు తోచినదారిలో సాహితీ కన్యను నడిపి సామాన్యునికి సన్నిహితంచేయ సమకట్టేరు.

కొంతమంది తమలోవున్న సాహిత్యాన్నే యథాతథంగా కొద్ది పాటి సంస్కారంతో పామరుని కర్ణమయేలా భాషను కొంచెం సవరించి; ఆ సామాన్యుని ఆకర్షించే—అతని కత్యంత ప్రియమైన సంగీత రాగాలాపనలను ఆ సాహిత్యానికి జోడించి ఆంధ్రసాహితీ కన్యచే నాట కాలాడించి, తమ ధ్యేయాన్ని సాధించుకోవాలనుకొన్నారు!

కాని; వీళ్ళు వాడుకొన్న భాషగానీ, సంగీతంకానీ—వీళ్ళను కొన్నంతగా సామాన్యునికి దగ్గిరది ఎంతమాత్రంకాదు. కేవలం సంగీతపు మత్తుతో ఆకర్షితులైన సామాన్యులు—తమకే తెలియకుండా తమ గొంతుకలతో చాలా కృతకంగా ఆ అపరిచితరాగాల్ని సాగదీసుకొంటూ ఆ లయతో వూగిపోతూ చేతులాడిస్తూ—వీళ్ళ మాటల్ని పేలుతుండడమే తప్ప; ఆ మాటల్లో దాగిన అంతరార్థాలమాట అటుంచి అసలర్థాలుకూడా వాళ్ళ అంతరేంద్రియాలకి ఎంతమాత్రం ఎక్కేవిగావు.

ఈమాత్రపు పనినైనా వాళ్ళచేత పండితుడు చేయించుకోడానికిగల కారణం కేవలం సంగీతమేలనీ; వీళ్ళు కూడా మునుపటి తరాల పండితులలాగే ఏమాత్రం కంఠోక్తిగా 'సామాన్యులకోసమే ఈ రాద్ధాన్తమంతా!'- అని చెప్పుకోకపోయినా నిజంగా ముమ్మాటికీ అందుకే తమ సాహితీ జీవితాలంకితం చేసేరనీ; వీళ్ళ దృష్టిలో పాశ్చాత్య దేశాలలో నాటకాలు సాధించిన ప్రగతి స్పష్టంగా వుందనీ గమనించాలి.

ఇదిలా నీరుకారిపోవడంతో ఈ ప్రయత్నంలోగల లోటుపాట్లని బహిరంగంగా, చర్చామూలకంగా తెలుసుకొనీ; పలురకాల ప్రణాళికల్నీ సమీకరితం చేసుకొనీ, ప్రచారితం చేసుకొని ఇతర దేశాలలోని పండితుడు సామాన్యుని చేరేందుకు వేసిన, ఫలింపజేసుకొన్న ప్రణాళికల్ని పరికించుకొనీ 'కేవలం ఈ కవితాకన్యను వాళ్ళలోకి పంపేయడానికే ఈ చేయనున్న పనంతా!''-అని సుస్పష్టంగా చెప్పుకొని మరీ కలంపట్టిన పండితులంతా రంగంలోకి దిగేరు.

అటు సాహిత్యాన్నీ ఇటు సంగీతాన్నీ వీళ్ళు సంస్కరించి; తిరిగి జాతీయ ఛందస్సులోకే దూకినా పూర్వీకులలాగా కాకుండా మాత్రా ఛందస్సులోకి దూకడంతో ఎంతో మేలు జరిగి వుండాల్సింది!

కాని; పూసలపేర్లు మాత్రమే పరిచితమైన సామాన్యునికి కవితాకన్య మెడలోని ముత్యాలసరాలూ, ముప్పేట గొలుసులూ ఏమాత్రం మనస్కరించలేదు!

ఇంత ఆలోచించి చేసిన పనికూడా పనికిరాలేదని తిరిగి ఆలోచించిన మరొక పండితుడు ఛందస్సంటూ ఏమాత్రంవున్నా అది వొక ఎబ్బెట్టుగా-నాగరికచిహ్నంగా సామాన్యునికి కన్పిస్తోందని గుర్తించి; ఆ సర్పపరిష్వంగాల్నీ వొదిలించేసి, లయను మాత్రమే స్వీకరించి, అప్రయత్నంగా తానుచ్చరించే పదాల వెనుకా వాక్యాల వెనుకా వొక రకమైన నాదాన్ని సాధించి-కవితా కన్యని మోడర్న్ మేకప్‌తో సింపుల్‌గా సామాన్యుని చేరువకు పంపి; తన పనిని తాను చక్కబెట్టుకోవాలనుకొన్నాడు!

కాని; ఇదికూడా సామాన్యునివద్ద ఏపాటి సత్ఫలితాన్నీ సాధించకపోడం శోచనీయం! పైగా-ఇందుకుగల ముఖ్యకారణాలుకూడా తిరిగి సంగీత, శబ్దాలే అవడం మరింత శోచనీయం!

ఛందస్సు సర్పపరిష్వంగాల్ని వూడలాగిందెందుకు — తలవని తలంపుగా 'భుజంగ ప్రయాతా'ది వృత్తాల నడకల్లో కవితా కన్యని 'స్పర్ధ' పై 'కవిరాజ విరాజితం'గా 'భజగోవిందం' అనిపించడానికా?! 'తోటకం' నడక, 'మాలిని' నడక-ఇలా ఎన్నో నడకల హొయలు వచ్చామెకు?! పైగా - మునుపటివాళ్ళు నేర్పని 'Semanatics steps' కూడా వచ్చా పిల్లకి?!

నిఘంటు శ్మశానాల పుంఖానుపుంఖ శబ్ద వాసన ఆమె మేని కంటకుండా చేసిన దెందుకు - జీతాసువుల చ్యుతాశయుల హృతాశ్రయుల హతాశుల కంపు సోకించడానికా లేక దుర్గతి - దుర్గతి - దుర్మతి ధుర్మృతి అని అనడానికా?!

వ్యాకరణాల సంకెళ్ళు విడిపించడం — రథచక్రపుటిరుసులలో ఆమెను కదలగనైనా చాలని రీతిగా త్రోయడానికా లేక సఖుల వలన పరిచ్యుతుల్ని చూపి ఏడవ కండేడ వకండి అనడానికా—సద్దణగిన నడిరాతిరి చూపించడానికా?!

తనని తాను చెప్పుకొంటూ నాదొక స్వర్గం అంటూ; అనర్గళం అనితర సాధ్యం నామార్గం అంటూ; డప్పుల మోతల్ని ఎన్నుకోడం తగ్గించి; రథచక్ర గమనంలో నానా గానా నూపురస్వానావళితంగా పాటగా పాడిన ఆ కవితా కన్య మాట సామాన్యుల చెవుల కేపాటి ఎక్కుతుంది- అసలు వాళ్ళెలా అర్థం చేసుకోగలరు!

మునుపటి పండితులు చేసినవనే వీళ్ళూ చేసేరు! అయితే- వాళ్ళు స్పష్టంగా చెప్పుకోలేదు-వీళ్ళు చెప్పుకొన్నారు; వాళ్ళకన్నా సామాన్యునికి మరింత దగ్గిరగా వెళ్ళి ఆగడానికైనా తగిన తరతరాల ప్రగతీ, అనుకూల వాతావరణం వీళ్ళకున్నాయి - వాళ్ళకి లేవు.

దీనితో విసిగి వేసారిన పండితుడు తిత్తొక్కిన మతితో ముందాలోచన అన్నది లేకుండా; సమస్త ప్రకృతిలోనూ కనిపించే నగ్నతని అలావే చూపించాలిగాని-దానికేమాత్రం అచ్ఛాదన వున్నా ఫలితం

కాదిఅప్రభంశ భాషాగీతాల్లోనూ తమ మత ప్రచారాన్ని సాగించి చాలా మట్టుకు కృతకృత్యులైనారన్న నిత్య సత్యాన్ని నన్నయ ఆకళింపుకోక పోడం గ్రామ్య భాషనిగాని-దేశీయ ఛందస్సుల్నిగాని ఆదరించకపోడం వొకరకంగా ఆంధ్రుల దురదృష్టం!

కాని; వర్ణాశ్రమధర్మ సంరక్షణమే ప్రధాన ధ్యేయంగాగల వైదికధర్మ ప్రచారానికై బద్ధకంకణుడైన నన్నయ దృష్టిలో-అలగాజనానికి చోటులేకపోవడం ఏమంత తప్పిదం కాదని మనం గుర్తించాలి.

అంతేకాదు-నన్నయ తన దృష్టిని మత సిద్ధాన్త కారణంగా తప్పనిసరిగా చాతుర్వర్ణ్యానికే పరిమితంచేసి; ఆ నాలుగు వర్ణాలవారికి కూడా ఏమాత్రం అందుబాటులో లేదని తనకు పూర్తిగా అనిపించిన తన వెనుకటి తరాల ఆంధ్రభాషను-ఆ నాలుగు వర్ణాలవారికీ అర్థమయే తీరులో తీర్చి దిద్దేడన్న యధార్థాన్ని మనం గ్రహించి సంస్కృత పండిత ప్రాబల్య ప్రభావాలు ఇబ్బడి ముబ్బడిగావున్న ఆనాటి క్లిష్ట వాతావరణంలో తొలి తెలుగు గ్రంధాన్ని మొండి ధైర్యంతో వ్రాయబూనుకొన్న అతగాడి ధైర్యాన్ని మనం అర్థంచేసుకొని-నిజంగా అతనికి నీరాజన మెత్తితీరాలి!

నన్నయ పనిలోని లోటుపాట్లను పూర్తిగా ఆకళించుకొనే తన హరిహరాద్వైత మత ప్రచారానికీ, రాజకీయైక్యతా సాధనకీ, శాంతి స్థాపనకీ నడుం బిగించి గంటం పట్టిన తిక్కన-వాడవాడలా తిరిగి, అప్పుడు తెనుగుతనాన్ని ప్రోగుచేసి, పల్లెపల్లెలా తిరిగి తెలుగు జాతి ఛందస్సును ప్రోదిచేసి-తన రచన కానిచ్చేడు.

ఆ కవి బ్రహ్మ చేసినపని ముమ్మాటికీ మానవ మాత్రునికి సాధ్యంకాని పనే!

కాని; సామాన్యుడికి తమ పలుకుబళ్ళే అచ్చంగా వినిపిస్తున్నా; 'తమలో మనిషే' అనే నమ్మిక రేకెత్తిస్తున్నా-ఆ ఉభయ కవి మిత్రుడు తమ దగ్గరకు పంపిన ఆ భారతికన్య తమకేం చెప్తోందను కొంటోందో కూడా సామాన్యుడికి అర్థంకాకుండా పోయింది! దీనికి గల వొకేవొక ప్రబల కారణం-తెలుగు మాటకన్నా విశిష్టంగా సామాన్యులు భావించే-తెలుగుపాటకు చేరువుగావుండే-తెలుగు సంగీతానికి చేరువగా ఆమెగొంతు అంతగా అమరకపోడమే-అనాలి.

వీరవైష్ణవ, వీరశైవులు వొకరకంగా బౌద్ధ జైనుల అడుగు జాడల్లో మెలకువగా మెలిగిన వాళ్ళే అనాలి.

నన్నయ తిక్కనలు ఎలా పామరుడికి అర్థంకాకుండా దూరమైనారో ఇట్టే పసిగట్టినవీళ్ళు-అమాంతంగా ఆనాటివరకూ పండిత వర్గంలోవున్న ఛందోభేదాల్ని అన్నింటినీ కాలరాసి; జానపద సంగీతాని కంతటికీ మూలకందమైన పదకవితను చేపట్టేరు. మారుమూలల నుంచీ తెనుగు పదాల్ని ఏరుకొచ్చేరు. ద్విపదలో అంతర్లీనంగావున్న సంగీతంతో వీళ్ళు అంతకు మునపటివారెవ్వరూ చేరదీయనంతటి అలగాజనాన్ని కూడదీసుకొని; స్వమత వ్యాప్తిని గొప్పగా సాధించేరు.

ఇంతటి విపరీత పరిణామాల్ని చూచిన తరువాతి తరాల వారందరూ పదకవిత నాదరించడంతోబాటు-ఇంకా లోలోపలి గూడేల్లోకి చొచ్చుకుపోయి యక్షగానాలు, జావళీలు, సుద్దులు, వచనాలు లాంటి ఎన్నెన్నో దేశీయ ఛందస్సుల్ని స్వీకరించి; వాటిలోవున్న సంగీతంతో తాము సేకరించిన దేశీయ పదజాలాన్ని కలగలిపి తమ తమ ఉద్యమ ధ్యేయాలైన భక్తి, శృంగార, వీరాది భావనల్ని ప్రజల్లో వెదజల్లుకొన్నారు. వాళ్ళంతా ఛందోవిషయకంగా-అంటే సంగీత పరంగా సామాన్యులలో ఇంచుమించు కలిసిపోయినట్లేవున్నా భాషా పరంగా కొంచెం వెనకబడివున్న కారణంగా సంపూర్ణంగా వీళ్ళు సామాన్యులతో ఐక్యం కాలేకపోయేరు. సంగీతపరంగా వీళ్ళు తిక్కన కన్నా ఎక్కువ పనినే సాధించినా; భాషాపరంగా అతనిపాటికూడా వీళ్ళు చేయలేదు. కొందరు చేయబూనుకొన్నా అంతపని గంగారాణించలేదు.

తమతో ఆడుతూ పాడుతూ, దరువులు వేస్తూవున్న కవితా కన్య పాడుతున్న పాటేమిటో తెలీయక పదేపదే పామరుడు వెఱ్ఱిగా ఆమెవైపు చూచేవాడు!

నన్నయనుంచీ పైవాళ్ళవరకూ అందరూ పైన చెప్పినట్లు సామాన్యుడికి దగ్గరగా జరగడమన్న పనిని-నేటి ఉద్యమ కర్తలలాగ ఇదమిత్థమని సుస్పష్టంగా చాటుకోకుండానే-చేసేరు. కొందరు తమ తమ ఆశయాల్నీ, లక్ష్యాల్నీ చెప్పకోడంలో తమకేతెలియకుండా చూచాయగా తమపని చెప్పకొన్నారు. ఏదేమైనా ఇంతటి విపులావకాశాలున్న, ఇంతటి సంస్కారమున్న ఈ రోజుల్లో ఈనాటి కవులూహించినదాన్నే మన పూర్వులూ వూహించారనీ, వొకరకంగా వీళ్ళకన్నా మెఱుగ్గానే సంగీత సాహిత్యాల్ని సామాన్యపరం చేసేరనీ తెలుసుకోవాలి.

ఇలా ఇంతటి ప్రగతి వొక పక్క సాగిపోతున్నా; మరోపక్క పాండిత్య స్ఫోరక ప్రబంధాది ప్రక్రియలూ, శాస్త్రీయ సంగీతభరిత వివిధ ఛందోరీతుల్నీ పండితుడు పోషిస్తూనే వొస్తున్నాడన్న సంగతి మరువకూడదు.

సామాన్యునికి చేరువవాలనే ప్రయత్నం అలానే ఇంకా కొన్ని తరాలబాటు కొనసాగితే ఎలా ఏం పరిణమించేదో గాని; అమాంతంగా అన్యపాలన దేశాన్నంతటినీ వొక్కసారి తన కబంధ హస్తాలతో ఆక్రమించుకొంది. ఫలితంగా ఇతర రంగాల్లోని మన ప్రగతి విస్మృతిలో విలీనమైనట్లే మన సాహిత్య ప్రగతికూడా వెనకడుగువేసి అడుగంటి పోయింది.

తిరిగి జాతీయోద్యమంనాటికి-సాహితీకన్య సామాన్యుని చేరే దేశీయ మార్గాలన్నీ పూర్తిగా మర్చిపోయి వుంది. ఈ వీలుకోసమే వేచివున్న పండితుడు తిరిగి ఆమెను తన మేడల్లోకి లాక్కుపోయి; అసూర్యం పశ్యగా ఆమె మనుగడను యథాస్థితికి తీసుకొచ్చేడు!

జాతీయోద్యమావసరంగా దేశభక్తి, జాతీయోన్నత్యావగాహనాదులను సామాన్యునిలో రేకెత్తించడానికై కవితా కన్యను సామా

దక్కాదన్న ఆలోచనతో కవితాకన్యని దిగంబరంగా పంపుతూ; ఆ సామాన్యుని దగ్గిర నోటికొచ్చినట్లల్లా మాట్లాడి వాళ్ళని తన మాట వినేవాళ్ళుగా మార్చి రమ్మన్నాడు!

ఇక్కడ-సమస్త ప్రకృతి ఆచ్ఛాదనా విరహితంగానే వుంటుం దన్నది నిత్యసత్యమే అయినా మానవుణ్ణి మిగిలిన ప్రాణికోటినుంచి వేరువరుస్తున్నది కేవలం ఈ అచ్ఛాదనా-మాటా అనేవే అని పండితుడు గుర్తించకపోడం; మానవుని ఆలోచన్ని తట్టి లేపగలిగితే వాడే మైనా చేసితీరతాడు గాబట్టి-ఆ ఆలోచన్ననే తట్టి లేపగలిగే శక్తి, అతని నిత్యవ్యవహారంలోని సాదాసీదకం సంభాషణలకన్నా పాటలోని శైలిలో వుందనీ, ఆ పాటకి ప్రాణం సంగీతంలో వుందనీ పండితుడు గుర్తించకపోడం చాలా దారుణం!

ఇందువల్లే ఇతడాశించినదిగాని, ఆజ్ఞాపించినదిగాని ఆ అలగా జనానికి ఏమాత్రం వినిపించలేదు-ఒకవేళ వినిపించే అవకాశాన్ని కూడా సరిచూసుకున్నా తలకెక్కనూలేదు-ఈ పండితుని పని నెరవేరలేదు

ఇక్కడ మరో రెండు ముఖ్యవిషయాలని గుర్తించాలి!

తరతరాలబట్టీ ఈ పండితుడు ఇలా వెనక్కీ ముందుకీ వూగిసలాడుతున్నాడేగాని; ఆ సామాన్యుడుమాత్రం తనకు వినిపించినంతమేరలో ఆయా ఉద్యమాల పిలుపుల్ని పసిగట్టి; తన మేథ కంగినంతమేర దాన్నర్థం చేసుకొని; తన సంస్కారానికి తగినంతగా దాన్ని తన భాషలో మలుచుకొని; తన కనువైన బాణీలో దాన్ని పాడుకొంటూనే సాధ్యమైనంతలో సాహిత్య సాధనంతో తన మనుగడని బాగుచేసుకొంటూనే-మరోప్రక్క పురోగమించివస్తున్నాడన్న సంగతి గమనించాలి.

చరిత్రకందినంత మేరలో పై సత్యాన్ని పరిశీలిద్దాం.

జంగందేవర పాటలలాంటి పాటలకున్న ప్రచారం ద్విపద వాఙ్మయాని కెక్కడుంది? కాటమరాజుకథ, బొబ్బిలిపాట; పల్నాటి పాటలలాంటి పాటలవల్ల సాధితమైన వీరరసో దేకం శ్రీనాథాదులేపాటి సాధించేరు? సీత సమర్త, మైరావణ కథ, లక్ష్మణమూర్ఛ లాంటి గేయాల్లోని కల్పనా చమత్కృతులకి రంగనాథ రామాయణం లాంటివే తలొగ్గలేదా! కుశలవులకథ, కీచకవధ, పాండవుల విషయమైన పాటలకున్న ఆదరణ ఈ పురాణ పఠనంవల్ల నెరవేరుతోందా? చల్ మోహనరంగా లాంటి పాటలలోవున్న నిసర్గ ప్రణయ శృంగారాలు ప్రబంధాల్లో వున్నాయా? వీరబ్రహ్మంగారి పాటలకున్న ప్రచారం పండిత సృష్టియైన అనంత వేదాంత వాఙ్మయానికుందా? 'పడిపేల'లాంటి పాటలు రాసినవాళ్ళూ, బుఱ్ఱకథలు పాడినవాళ్ళూ చేసిన పాటిపనైనా సాయుధ రథభీభత్సుని రథసారథులు చేయగలిగేరా?!

జానపద గీతాలలోని నిసర్గ మధురవర్ణనలగాని, గుండెల్ని కదలించేమ్మా పనిచేయించే-మనసును మైమరపించే సంగీతంగాని;

తేలికగా వుంటూనే చక్కగా సన్నివేశానికి అమిరిపోతూ వింతవింత అర్థాలిచ్చే పదజాలంగాని-ఈ యావదాంధ్రసాహిత్య గంధాల్నీ దుర్భిణీ యంత్రం పెట్టుకు వెతికినా కనిపిస్తాయా కనిపించినా కదిలిస్తాయా -కదిలించినా మైమరపించి పనిని చేయనిస్తాయా?!

కేవలం ఆంధ్రదేశానికేగాక సమస్త ప్రపంచానికీ ఈ పై వ్యాసస్థ విషయం చెల్లుతుంది.

ఇంతటి ఉత్కృష్ట ప్రయోజనాల్ని సంగీత సాహిత్యాల కలయికవల్లే పామరుడు సునాయసంగా - తనకే తెలీకుండా సాధించుకొంటున్నాడన్న సంగతి పండితుడు సాకల్యంగా అవగాహన చేసుకు తీరాలి.

ఇటు సంగీతాన్ని - అంటే పాటను తయారుచేసేటంతపాటి ఛందస్సునూ; అటు భాషాదులనూ - అంటే సామాన్యుని మనసును తట్టి లేపేటంతటి ఎత్తుకే ఎగరగల భాషాలంకారాదులనూ పండితుడు ఆకళించుకోవాలి.

అలా ఆకళించుకొన్ననాడు సాహిత్యం సంఘంలో నేటిలాగా పావువంతునకే పరిమితమై వుండిపోకుండా మిగతా ముప్పావు వంతుకూ కూడా జీర్ణమౌతుంది.

సాహిత్యంద్వారా పండితుని పిలుపువిన్న సామాన్యుడు తన సర్వస్వాన్నీ వొడ్డి పంఘ సంస్కరణాది కార్యకలాపాల్లో పాల్గొని; లోక శ్రేయస్సును సంపూర్ణంగా సాధించేలాచేసి తీరతాడు.

కాని; వెన్వెంటనే మునపటిలాగా వాడికిగాని; ఆసాహిత్యానికిగాని తిలోదకాలివ్వకూడదు. నిస్వార్థంగా కలకాలం పండితుడు ఇక్కడి తన భిధానాని ఎత్తేసి, ఆ గూడేల్లోనే మాతంగి కన్యలోబాటు కాపుండిపోవాలి!

1 ప్రపంచ ప్రసిద్ధులైన బ్రెక్ట్; ఇంకా ఎందరో రూసీకవులు చేసినదిదేలవి; ఆ గూడేల్లోకి చొచ్చుకుపోయి వారి పాటలవెనకదాగిన సంగీత సాహిత్యాల్ని పసిగట్టి వాటితో తమ సిద్ధాన్తాల్నీ కలిపి తిరిగి ఆ సామాన్యులకి అందిచ్చి ఆయాకవులంతా ఎంతో ప్రగతిని సాధించేరని గుర్తించాలి.

అలా పండితుడూ పామరుడూ చెట్టపట్టాల్వేసుకు నడచిననాడు తరతరాలబట్టీ కవిత్వంవల్ల సంఘంలో పావువంతుకే గుత్తగా అబ్బుతున్న హృదయ వైశాల్యం, సంస్కారం, నిశితాలోచనా, కృత్యాకృత్య విచక్షణాజ్ఞానం, మానసికానందం; దేశప్రగతికి కృషిలాంటి సద్గుణ సంపత్తులన్నీ మొత్తం ఉమ్మడి సొత్తులుగా మారితీరతాయి.

ఆనాడు సంగీతసూత్ర గ్రథిత సాహితీ సుమమాలతో నిసర్గ సుందరంగావున్న ఆంధ్రకవితా మాతంగకన్య లోక కల్యాణానికై గొంతెత్తి పాటపాడి తీరుతుంది.

పై రకంగా సంగీత సాహిత్యాల సత్సంబంధాలతో జనతా సత్సంబంధాల్ని ఆశిద్దాం!

# గ్రామీణ ఆర్థిక వ్యవస్థ:
# ఆర్థిక సంక్షోభము

శ్రీ యిమ్మానేని సత్యసుందరం

భారతదేశంలో ఆర్థిక సంక్షోభమునకు గ్రామీణ ఆర్థిక వ్యవస్థను నిర్లక్ష్యము చేయుటే ముఖ్యకారణమని పెక్కుమంది అభిప్రాయము. సుస్థిరమైన ఆర్థికాభివృద్ధిని సాధించుట ఇప్పటివరకు సాధ్యపడలేదు. ధరల పెరుగుదల, నిరుద్యోగము మొదలగు సమస్యలు వికృత రూపము దాల్చినవి.

భారతదేశం ప్రధానంగా వ్యవసాయక దేశమైనప్పటికి, ఆహార ధాన్యాల దిగుమతి గతంలో తప్పనిసరి అయినది. 1970-1975 మధ్యకాలంలో 14 59 మిలియన్ల ఆహార ధాన్యాలను దిగుమతి చేసికొనుట జరిగినది. ఆహార సమస్య క్లిష్టంగావున్న రోజుల్లో సంవత్సరానికి 500 కోట్ల రూపాయలు ఆహార ధాన్యాలపై ఖర్చుచేయుట జరిగినది. 1965-1973 మధ్యకాలంలో దిగుమతి చేసుకున్న ఆహారధాన్యాల విలువ 2634.82 కోట్ల రూపాయలు. గతంలో ఏ విధంగా భారతదేశం ఆహార ధాన్యాలకు ఇతర దేశాలపై ఆధారపడినది. ఈ దిగువ పట్టిక తెలపుచున్నది.

## పట్టిక 1

### ఆహార ధాన్యాల సరఫరా (మిలియన్ టన్నులలో)

| సంవత్సరం | ఉత్పత్తి | దిగుమతులు | మొత్తం |
|---|---|---|---|
| 1970 71 | 108.40 | 2.05 | 110.45 |
| 1971-72 | 105.20 | 0.45 | 105.65 |
| 1972-73 | 95.20 | 3.61 | 98.81 |
| 1973-74 | 103.06 | 3.61 | 106.67 |
| 1974-75 | 104.50 | 4.87 | 109.37 |
| మొత్తం | 516.36 | 14.59 | 530.95 |
| ఐదుసంవత్సరాలకు సగటు | 103.27 | 2.92 | 106.19 |

గ్రామీణ ప్రాంతాలలో దారిద్ర్యాని బట్టి చూచినట్టయితే, వ్యవసాయాభివృద్ధికి, గ్రామీణాభివృద్ధికి మనము చేసిన పెట్టుబడి చాలా తక్కువని తెలియుచున్నది. ప్రజలలో 70 శాతం గ్రామీణ ప్రాంతాలలో వుండుటచే, ఇటువంటి పరిస్థితి మిక్కిలి శోచనీయం. గ్రామీణ ప్రాంతాలలోవున్న అతి బీద ప్రజల జీవన ప్రమాణంలో తరుగుదల కన్పించినది.

వ్యవసాయరంగాన్ని నిర్లక్ష్యం చేయుట ప్రజలలో ఎక్కువ మందికి, అంటే గ్రామీణ ప్రజలకు బాధ కల్గించుటయేగాక, దేశం ఇతర దేశాలపై ఆహార ధాన్యాలకు కూడ ఆధారపడవలసిన పరిస్థితి ఏర్పడినది. ఇతర దేశాల అభివృద్ధి వ్యూహాలను అనుసరిస్తూ, పారిశ్రామికీకరణకు అతి ఎక్కువ ప్రాముఖ్యం నిచ్చి, వ్యవసాయరంగానికి తగినంత పెట్టుబడి సమకూర్చుట జరుగలేదు. వాస్తవంగా, వ్యవసాయరంగంలో ప్రభుత్వ పెట్టుబడి శాతం తగ్గుతూ వచ్చినది. ఇది ఈ దిగువ పట్టికలో చూపుట జరిగినది.

## పట్టిక 2

### నాలుగు పంచవర్ష ప్రణాళికలలో ప్రభుత్వ పెట్టుబడి (కోట్ల రూపాయలలో)

| అంశము | మొదటి ప్రణాళిక | రెండవ ప్రణాళిక | మూడవ ప్రణాళిక | నాల్గవ ప్రణాళిక |
|---|---|---|---|---|
| 1 వ్యవసాయము | 290 | 549 | 1089 | 4328 |
| అనుబంధరంగము | (14.8) | (11.7) | (12.7) | (17.4) |
| 2 నీటిపారుదల | 434 | 430 | 665 | 1087 |
| వరదలనిరోధకం | (22.2) | (9.2) | (7.8) | (4.4) |
| 3 ఇంధనము | 149 | 452 | 1552 | 2523 |
| శక్తి (Power) | (7.6) | (9.7) | (14.6) | (10.1) |
| 4 చిన్నతరహా | 42 | 187 | 241 | 853 |
| పరిశ్రమలు | (2.1) | (4.0) | (2.8) | (3.4) |
| 5 పరిశ్రమలు | 55 | 938 | 1726 | 5388 |
| మరియు | | | | |
| ఖనిజములు | (2.8) | (20.1) | (20.1) | (21.4) |

| | | | | |
|---|---|---|---|---|
| 6 రవాణా మరియు ఉత్తర ప్రత్యుత్తరములు | 518 | 1261 | 2112 | 4157 |
| | (26.4) | (27.0) | (24.6) | (16.7) |
| 7 ఇతరములు | 472 | 855 | 1492 | 6596 |
| | (24.1) | (18.3) | (17.4) | (26.6) |

(బ్రాకెట లోవున్న సంఖ్యలు మొత్తం పెట్టుబడిలో శాతంను తెలుపుచున్నవి.)

నాల్గవ పంచవర్ష ప్రణాళికలో సాధించిన విషయాలు చెప్పుకో దగినవిగా లేవు. నాల్గవ పంచవర్ష ప్రణాళికలో అభివృద్ధి రేటు 5.7 శాతము వుండుటకు బదులుగా 3.5 శాతం మాత్రమే వున్నది. నాల్గవ పంచవర్ష ప్రణాళిక (1969-1974) ఆరంభంలోవున్న ఆహార ధాన్యాల ఉత్పత్తికి, ఆ ప్రణాళిక చివరలోవున్న ఆహారధాన్యాల ఉత్పత్తికి అంతగా భేదంలేదు. రెండవ పంచవర్ష ప్రణాళికనుండి పరిశ్రమలకు, ముఖ్యంగా భారీ పరిశ్రమలకు అత్యధిక ప్రాధాన్యత ఇచ్చి నప్పటికి, పారిశ్రామికరంగం విజయాలుకూడ పరిమితంగానే వున్నవి. ఈ కారణంగా ఆర్థిక వ్యవస్థలో ధరలు విపరీతంగా పెరిగి, ప్రజలకు పెక్కు ఇబ్బందులు కల్గించినవి. 1949తో పోల్చినపుడు 1974లో రూపాయి విలువ 29.07 పైసలుగా అంచనా వేయబడినది. భూమిలేని శ్రామికుల శాతం మొత్తం శ్రామికులలో 1961లో 16.7 వుండగా 1971 లో అది 25.76కి పెరిగినది. ధరలు పెరిగినప్పటికి ప్రజలవద్ద కొనుగోలు శక్తి తగ్గుటవలన, పెట్టుబడి పెరగలేదు. ఆర్థిక వ్యవస్థలో విచిత్రంగా ద్రవ్యోల్బణ స్తంభీకరణ (Economie Stagflation) ఏర్పడినది. ఆర్థిక వ్యవస్థలో గుప్త ధనం విపరీతంగా పెరుగుటవలన, ధనవంతులు ఎక్కువగా అనవసరపు ఖర్చులను పెంచుట జరిగినది.

ప్రణాళికలను అమలుపరచుటలో అనేక ఇబ్బందుల సంగతి అటుంచి, అసలు ప్రణాళికా వ్యూహములోనే కొన్ని లోపాలు ఉన్నట్లు తెలియుచున్నది. ఇందులో అతి ముఖ్యమైన లోపమేమిటంటే గ్రామీణ సమస్యలను నిర్లక్ష్యము చేయుట, పట్టణ సమస్యలపై ఎక్కువ శ్రద్ధ చూపుట. ఉదాహరణకు, మనదేశం ప్రధానంగా వ్యవసాయిక దేశమైనప్పటికి, మొత్తం ఇంధనము (Power) ఖర్చులో పారిశ్రామిక రంగము వాటా 70 శాతము, మరొక విశేషమేమిటంటే పారిశ్రామిక రంగంలో ప్రైవేటు పెట్టుబడి పెరిగినప్పటికి, వ్యవసాయ రంగంలో పెరగలేదు. ఫలితం: ఇతరదేశాలనుండి ఆహార ధాన్యాల దిగుమతి. వ్యవసాయ ఉత్పాదకాల ధరలు విపరీతంగా పెరుగుటచే సన్నకారు రైతులకు ఆహారధాన్యాల ఉత్పత్తిని పెంచుట సాధ్య పడలేదు.

వ్యవసాయోత్పత్తి, ప్రభుత్వం రైతులకిచ్చే ప్రోత్సాహంపై ఆధారపడి యుండును. సేకరణ ధరలలో (procurement prices) మార్పులేదుగాని, రైతులు కొనే ఇతర అత్యవసర వస్తువుల ధరలు మాత్రం విపరీతంగా పెరిగినవి. మార్కెట్టులో ఆహారధాన్యాల ధరలు ఎక్కువగావున్న, మధ్యవర్తులు లాభం పొందారేగాని, రైతులుకాదు దీనినిబట్టి చూస్తే, గ్రామీణ రంగంలో జనాభా పెరుగుదలకు తగినట్లుగా సంపద పెరగలేదని తెలియుచున్నది.

1960-61 ధరలలో, వ్యవసాయరంగంలో సగటు ఆదాయం 1960 61 లో 189.5 రూపాయలు, 1969-70 లో 184.1 రూపాయలు వ్యక్తికి 5 రూపాయలు తగ్గుదల. అయితే ఆర్థికవ్యవస్థ మొత్తానికి చూచినట్లయితే, 33 రూపాయల పెరుగుదల కన్పించినది. అంటే అభివృద్ధి ఫలితాలు గ్రామీణ రంగానికి తగినంతగా చేరుటలేదన్నది స్పష్టము. చైనా గ్రామీణ ఆర్థిక వ్యవస్థకు అత్యధిక ప్రాధాన్యత నిచ్చినది. మొత్తం ప్రభుత్వ ఆదాయంలో ఆ దేశంలో 60 శాతం గ్రామీణ రంగంనుండి ఏర్పడినది. మనదేశంలో గ్రామీణ ప్రజలలో ఆదాయపు పన్నుకట్టే ఆర్థిక స్తోమతగల వారి సంఖ్య అతి తక్కువ. ఒక అంచనా ప్రకారం, గ్రామీణ కుటుంబాలలో 0.79 శాతం వాటికి మాత్రమే సంవత్సర ఆదాయం 20,000 రూపాయలుగాని అంతకు మించిగాని వున్నది పైగా ఈ కుటుంబాలు ఎక్కువగా పంజాబ్, హర్యాయానా, రాజస్థాన్, మహారాష్ట్ర, మైసూరు, మధ్యప్రదేశ్‌లలో కేంద్రీకృతమైనవి. భూకమతాలపై గరిష్ఠ పరిమాణం నకమంగా అమలు పరచనంతకాలం, భూమి కొంతమంది చేతులలో కేంద్రీకృతమగుతప్పదు. ప్రణాళికలను రూపొందించువారు గ్రామీణ ఆర్థిక వ్యవస్థ సమస్యలను స్వరూప స్వభావాలను సరిగా అవగాహన చేసికొనవ... అవసరం కనబడుచున్నది. ఇలా జరగక పోవుట వలన ఇప్పటి వ... మనదేశంలో గ్రామీణ ప్రజల అవసరాలను తీర్చుటకు మన... తీసికొన్న చర్యలు ఆశించిన ఫలితాలను సాధించలేదు. కొంత అభివృద్ధి సాధించినా, దాని ఫలితాలు వారికి అందలేదు.

విచిత్రమేమిటంటే, మనదేశం బీదదేశమైనప్పటికి, అత్యవసర వస్తువుల ఉత్పత్తి కంటె అనవసరపు వస్తువుల ఉత్పత్తి గత

కాలంలో విపరీతంగా పెరిగినవి. చైనా అభివృద్ధి వ్యూహంలో, సామాన్యులు వినియోగించే వస్తువులకు అత్యధిక ప్రాధాన్యత ఇవ్వబడినది.

పారిశ్రామికంగా దేశాన్ని అతిత్వరలో అభివృద్ధిచేయాలన్న ఆశతో మనము గ్రామీణ ఆర్థిక వ్యవస్థను నిర్లక్ష్యంచేయుట జరిగినది. బాగా అభివృద్ధి చెందిన దేశాల వ్యూహాములు మనదేశానికి సరిపోవు. జనాభా పెరుగుదల మనదేశంలో ఎక్కువగా వుండుటవలన, దారిద్ర్యము ఎక్కువగా వుండుటవలన కేవలం పారిశ్రామికీకరణ వలనే ఈసమస్యను సాధించుట వీలుపడదు. ప్రస్తుతం అభివృద్ధిచెందిన దేశాలు కూడ ఒక అభివృద్ధిస్థాయిని చేరిన తరవాతే పారిశ్రామికీకరణకు అత్యధిక ప్రాధాన్యత ఇచ్చినవి. ఆసమయానికి ఆ దేశాలలో వ్యవసాయ రంగం బాగా అభివృద్ధిచెంది ఆహారధాన్యాలలో మిగులు వున్నది. కాని మనదేశంలో పారిశ్రామికీకరణను తీవ్రతరంచేసేనాటికి, ఆహార సమస్య, జనాభా సమస్యలుకూడా వున్నవి.

బాగా అభివృద్ధిచెందిన దేశాలలో ఆహార ధాన్యాల దిగుమతి ఒక సమస్యకాదు. పారిశ్రామిక వస్తువులను ఎగుమతిచేసి ఆహార ధాన్యాలను దిగుమతి చేసికొనగలవు. కాని మనదేశంలో ఈ అవకాశం లేదు. కారణం, పారిశ్రామిక రంగంకూడా వెనుకబడివుండుటయే. మన ఎగుమతులు ప్రధానంగా వ్యవసాయక వస్తువులే. అంతర్జాతీయ మార్కెటులో వాటికి గిరాకి తక్కువ. దిగుమతుల ధరలు పెరుగుట వలన విదేశీమారక ద్రవ్య సమస్య క్లిష్టతరమైనది. ప్రపంచ ఎగుమతులలో మన ఎగుమతుల శాతం 1963 లో 1.2 శాతం వుండగా 1973 నాటికి అది 0.6 శాతానికి తగ్గినది. అంతేకాదు. అభివృద్ధిచెందిన దేశాలు ప్రధానంగా వాటితో అవే వ్యాపారం చేసుకొనుటవలన, వెనుకబడిన దేశాలు వ్యవసాయ రంగంను అభివృద్ధి చేయుటలో ప్రత్యేక కృషి చేయవలెను. ఉదాహరణకు చైనాలో ఆహార ధాన్యాల ఉత్పత్తి 1962-63 లో 180 మిలియను టన్నులు. 1967-68 నాటికి అది 214 మిలియను టన్నులకు పెరిగినది. మనదేశంలో ఆహార ధాన్యాల ఉత్పత్తి తక్కువగా వుండుటయేగాక అది విపరీతమైన ఒడుదుడుకులకు గురియైనది. ఇతర విధాలుగా అనేక లాభాలు వుంటేనేతప్ప (ఉదాహరణకు చమురు ఉత్పత్తి) వెనుకబడిన దేశాలు వ్యవసాయ రంగమును ఏంతమాత్రం నిర్లక్ష్యం చేయకూడదు. సహజ వనరులున్నప్పటికీ, మనము వాటిని పూర్తిగ వినియోగించుకొనుటలేదు. చైనామాత్రం వున్న సహజ వనరులను పూర్తిగా వినియోగించుకొనుటద్వారా అభివృద్ధి చెందుచున్నది. అలా అభివృద్ధి చెందుటకు కొంతవరకు రాజకీయ కారణాలకూడ తోడ్పడినవి. (చైనా కమ్యూనిస్టు దేశంకదా)

వెనుకబడిన దేశాలు ఇతరదేశాలపై ఆధారపడవలసిన అవసరం వున్నప్పటికీ, వున్న వనరులను పూర్తిగ వినియోగించుకోవలసిన అవసరమును మరువరాదు. ఉదాహరణకు, మనకు నీటిపారుదల వసతులు తక్కువ. అయితే ఉన్న నీటిపారుదల శక్తిని పూర్తిగా వినియోగించుకొనుటలేదు. సుమారు 40 శాతం నీటిపారుదల శక్తిని (Irrigation potential) మాత్రమే మనము వినియోగించుకొనుచున్నాము. అంతేకాదు, నీటిపారుదల వసతులు కొన్ని ప్రాంతాలకే పరిమితమైనవి. ఈకారణంగా ఎకరోత్పత్తిలో రాష్ట్రాలమధ్య వ్యత్యాసమున్నది. ఉదాహరణకు, ఒరిస్సా, మధ్యప్రదేశ్ బీహారు రాష్ట్రాలలో వరిపంట హెక్టారుకు 1000 కి. గ్రా. లోపుగావుంటే పంజాబ్, తమిళనాడులలో 2000 కి. గ్రా. పైగా వున్నది.

వ్యవసాయరంగంలో ఇటీవల కాలంలో వచ్చిన సాంకేతికమైన మార్పులవలన, వ్యవసాయ ఉత్పాదకాలు, ముఖ్యంగా ఎరువులకు గిరాకీ విపరీతంగా పెరిగినది. అయితే వీటి ఉత్పత్తిలో పెరుగుదల తగినంతగా లేనందువలన, రైతులు ఎరువుల కొరతవంటి సమస్యలకు గురిఅయిరి. హరిత విప్లవము (Green Revolution) వలన ప్రయోజనాలు రైతులందరు పొందుట జరగలేదు. రైతులకు సరియైన సమయంలో ఉత్పాదకాలను తగినంతగా సరఫరా చేసినచో ఎకరోత్పత్తిని విపరీతంగా పెంచవచ్చును. ఉదాహరణకు పంజాబులో ఆహారధాన్యాల ఉత్పత్తి 1966-67 లో 41.79 లక్షల టన్నులుండగా 1968-69 కి 62.52 లక్షల టన్నులకు పెరిగినది. అంటే రెండు సంవత్సరాలలో పెరుగుదల శాతం 50. మనదేశంలో జాతీయ ఆదాయం పెరుగుదల వ్యవసాయోత్పత్తిపైనే ఆధారపడియున్నది,

ఇటీవల కాలంలో మనదేశంలో ధరలు పెరిగినా, కొన్ని వరిశ్రమలలో గిరాకీ తగ్గినది. దీనిని inflationary recession అందురు. వ్యవసాయదారుల ఆదాయాలు తగ్గుటవలన కొన్ని వస్తువులకు గిరాకి తగ్గుట సహజము. వ్యవసాయరంగం అభివృద్ధి అంటే కేవలం ఆ రంగంలో సాంకేతికమైన మార్పులు తెచ్చుటయేకాదు. వ్యవస్థాపూర్వకమైన మార్పులు చాలా అవసరం. అయితే కొన్ని రాజకీయ కారణాలవలన ఇప్పటివరకు వ్యవస్థాపూర్వకమైన మార్పులను

# 'హనుమదింద్రగంటి' వారి కవితా వైశిష్ట్యము

**శ్రీ శివలెంక ప్రకాశరావు**

కవిగా, సాహితీవేత్తగా, వ్యాసకర్తగా, బహుముఖ ప్రజ్ఞాశాలిగా ఆంధ్రదేశమంతటను పేరెన్నికగన్నవారు శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారు.

ఒక నదీప్రవాహమువలె 'మొట్టమొదట బ్రహ్మసమాజ' పు ఉరవడితో బయలుదేరి, ఆగి వ్యక్తిగత భావుకుని పరివేదనలో రాటుదేరి – నవ్యసాహిత్య ప్రణయ ప్రకృతి ఆరాధనలలో గడుసుదేరి – అభ్యుదయ కవితామార్గాన మాటకు, మనసుకు పదను, వేడి సంతరించుకుని రచనా వ్యక్తిత్వాన్ని శ్రీ శాస్త్రిగారు సంపాదించుకున్నారు!

పెక్కు పద్యములు, గేయములు, వచన కవితలు, వ్యాసములు, కథలు, నాటికలు వారు రచించి 'హనుమదింద్రగంటి'గా జగద్విఖ్యాతి గాంచినారు. శ్రీ శాస్త్రిగారి షష్టిపూర్త్యుత్సవ సందర్భముగా ప్రచురింపబడిన దక్షారామాది పద్యకవితా సంకలన మాధారముగా జేసికొని, వారి కవితా వైశిష్ట్యము నెన్నుటయే ప్రస్తుత వ్యాసోద్దేశము.

విద్యార్థి దశలో రచింపబడి, ప్రముఖ మాసపత్రిక 'భారతి' (1929 - అంగిరస సం॥) లో ప్రచురింపబడిన శాస్త్రిగారి ప్రథమ పద్యరచన 'స్మృతికణాలు'.

విశాఖ జిల్లాలోని 'బిడ్డాది' పూర్వము విరటరాజు రాజ్య రాజధానీ నగరమని ప్రతీతి. కాని నేడా వైభవము నశించి శిథిలావస్థలోనున్న ఆవీడును చూచి శాస్త్రిగారు పొందిన ఆవేదనయే స్మృతికణాలుగా రూపొందినవి.

> 'ఇదియట మత్స్య భూమీశుని పెనుకోట
> మంటిదిబ్బలుగ మా కంటి కనురె
> ఇది యట మత్స్య రాజేంద్ర పీఠమ్ము
> బలుసు తుప్పల బరాబరుల నేడు
> ఇది యట యుత్తరా సుదతి నాట్యపుశాల
> నక్క త్రొక్కుడులు మానాటి మాట
> ఇది యట కీచకోర్వీశు పాపపుజాడ
> ఎఱ్ఱ కంకరగుట్ట పఱ్ఱలిపుడు
> ఇది యట దురంత కౌరవుల్ చెదరిమేము
> గోవులనుబట్టి యనికి డీకొనిన తావు
> కఱకు ముండుల తుమ్మవృక్షములతోడ
> గ్రాలె నొక్క బయలుగ మా కాలమునకు.'

అని చరిత్ర గర్భమున దాగియున్న సత్యములను వివరించి, కీచకుని 'వైషయేచ్ఛ', 'ధర్మేశు నుదుట' 'రక్తధారలురలిన ఫలము 'ఒడ్డాది మసి' యగుటకు కారణములని వేదనాశ్రువులను రాల్చినారు శ్రీ శాస్త్రిగారు.

ఇందు భావమున ఉద్వేగము, ఉద్రేకము ఉన్నవి కాని పుష్టి సంపూర్ణముగ లేదు.

1929–49 వరకుగల రచనలలో వారి మనస్సులో చెలరేగిన ఆదర్శాల పెనుతుఫానులు, ఆవేశాల ఆర్భాటాలు, భావాభ్యుదయోద్యమాల ప్రభావాలు చోటు చేసికొన్నవి. 'దక్షారామ' సుమ సందర్శన భాగ్యముతో 1949 నుండి ఇంద్రగంటివారి హృదయ క్షేత్రమున ఆధ్యాత్మిక సువాసనలు గుబాళించి, వారి సాహితీ గమనము క్రొత్తపుంతలు బట్టినది. ఈ సంపుటిలో ఉన్న పద్యములనుబట్టి చూడగా 1950–70 మధ్య కాలములో ఆధ్యాత్మిక చింతనా బలముతో కవిత లల్లినట్లు కన్పించును. మొత్తముమీద పరిశీలించగా మొదటి రెండు దశాబ్దములలో 'ఒక ఆవేశ స్వభావుడు, భావుకుడు', తరువాతి కాలమున 'ఆధ్యాత్మికత, భావనా విస్తృతి భాషాపాండిత్యము, నైశిత్యము, స్మితచిత్తత'గల ఒక సత్యాన్వేషకుడు శాస్త్రిగారిలో రూపుదాల్చినారని చెప్పవచ్చును. అందువల్లనే మొదటి దశలో భవభూతి, రెండవ దశలో కాళిదాసు, వాల్మీకివారి కభిమాన కవులుగా హృదయపీఠ మలంకరించినారు.

1932న రాజమండ్రి వాసమేర్పడు వఱకును శాస్త్రిగారి కవితా వ్యాసంగము శైశవావస్థలోనే ఉన్నదని చెప్పవచ్చును. అప్పటినుండి సుమారు పదునాఱు సంవత్సరాలు అనగా 1948 వఱకు 'కొత్త అన్నదల్లా నెత్తిని పెట్టుకుని' కలిగిన నవ్యసాహిత్యోద్యమ ప్రభావముచే ఏర్పడిన భావ తీవ్రత, పూర్వ సంప్రదాయములనుండి బయటపడుటకు అనుభవించిన అంతర్మథనము ఇంద్రగంటివారి రచ

నిర్లక్ష్యము చేయుట జరిగెను. గ్రామీణ ఆర్థిక వ్యవస్థలో అసమానతలను తొలగించుటకు వ్యవస్థాపూర్వకమైన మార్పులు (భూసంస్కరణలు) గ్రామీణ ప్రజలకు ఉత్పత్తిని పెంచుటలో తగిన ప్రోత్సాహం కల్పించును.

భూకమతాలపై గరిష్ఠ పరిమాణమును పెంచినచో ఉత్పత్తిని పెంచుటకు ఎక్కువ అవకాశమున్నదని కొందరి అభిప్రాయము. అయితే ప్రస్తుతము వ్యవసాయ రంగంలో ఉత్పత్తి పెరుగుదల ఉత్పాదకాల సరఫరాపై ఆధారపడియున్నదిగాని, కమతాల పరిమాణంపై కాదు. జపానువంటి దేశాలలో చిన్నకమతాలలోకూడా ఉత్పాదకత ఎక్కువగా వున్నది. మన దేశంలో కొన్ని పరిశోధనల వలన చిన్న కమతాలు మిక్కిలి సమర్థవంతంగా పనిచేయుచున్నట్లు తెలిసినది. (ముఖ్యంగా హరిత విప్లవమునకు గురిఅయిన ప్రాంతాలు) నీటిపారుదల వసతులు తగినంతగా వున్నచో, చిన్నకమతాలుకూడ ప్రస్తుత పరిస్థితులలో లాభసాటిగా వుండును. వ్యవసాయాభివృద్ధి విషయంలో సన్నకారు రైతులు ఎక్కువ శ్రద్ధ చూపించగలరు. గ్రామీణ ప్రాంతాలలో బలహీన వర్గాల ఆర్థిక పరిస్థితులను మెరుగు పరచుటకు ప్రత్యేక కృషి అవసరము. మన రాజకీయ నాయకులు పట్టణ ప్రాంతాలనుండిగాని గ్రామీణ ధనికులనుండిగాని వచ్చుటచే, గ్రామీణ పేదరికమును రూపుమాపుటలో తగు శ్రద్ధ చూపించుటలేదు. మన దేశంలో సుమారు 8 మిలియన్ల భూమిలేని వ్యవసాయ కుటుంబాలు వున్నవి.

మిగులుభూమి భూమిలేని వారందరికి పంచుట సాధ్యపడదు. ఇది అందరికి తెలిసిన విషయమే. అయితే ఇది ఒక సమస్యకాదు. అయితే భూకమతాలపైన గరిష్ట పరిమాణం విధించుటద్వారా మాత్రమే గ్రామీణ ప్రాంతాలలో వ్యక్తుల మధ్య సంబంధములను పెంచుట సాధ్యపడును. మనదేశంలో భూమివున్న వారికి సాంఘిక హోదా వున్నది. భూమిలేని శ్రామికుడు పొందే కొద్ది భూమిద్వారా అతని సాంఘికహోదాను విపరీతంగా పెంచును. లాభసాటిగాలేని భూకమతాలను లాభసాటిగాగల భూకమతాలుగా మార్చుటలో ప్రభుత్వం శ్రద్ధ చూపవలెను. హరిత విప్లవమువలన అందరు ప్రయోజనాలు పొందలేకపోవుటకు రైతులకి ప్రోత్సాహం లేకపోవుట కారణంకాదు. ఉత్పాదకాలు (inputs) తగినంతగా లేకపోవుట ముఖ్యంగా వ్యవసాయరంగానికి లభించే పరపతి సౌకర్యాలు చాలా తక్కువ.

గ్రామీణ ప్రాంతాలలో లాభదాయకమైన ఉద్యోగావకాశములను కల్పించుట ఒక ముఖ్యసమస్య. వ్యవసాయరంగంలోవున్న ప్రచ్ఛన్న నిరుద్యోగమును (కావలసిన వారికంటే ఎక్కువమంది పనిచేసే పద్ధతి) లాభసాటిగా వుపయోగించుకొనుట అవసరము. చైనా ఆ విధముగా చేసినది. మొత్తం శ్రామికశక్తిలో వ్యవసాయ కార్మికుల శాతం 1961లో 16.71 వుండగా 1971 నాటికి 25.76కి పెరిగినది. గ్రామీణ ఆర్థిక వ్యవస్థ అభివృద్ధికి కేవలం వ్యవసాయరంగంపైనే ఆధారపడరాదు. ఆ ఆర్థిక వ్యవస్థను విస్తృతం చేయవలసిన అవసరం వున్నది. వ్యవసాయరంగం అభివృద్ధితోపాటు చిన్నతరహా పరిశ్రమలు, కోళ్ళపెంపకం, పశువుల పెంపకము మొదలగు వాటిని అభివృద్ధి చేయవలెను. గ్రామీణ ఆర్థిక వ్యవస్థను పటిష్ఠం చేయుట ద్వారా, జాతీయ ఆదాయమును పెంచుటయేగాక, దేశంలో ఆర్థిక సాంఘిక అసమానతలను తొలగించుట సాధ్యపడును,



నదలలో సాక్షాత్కరించును.

1940 సం.కు ముందు కలముబట్టిన కవులందరిపైన భావకవిత్వ ప్రభావము మిక్కుటముగా నున్నది. వీరికి ప్రేయసి, ప్రకృతి ఆరాధ్యములు. ఈ ప్రభావమునకు శ్రీ ఇంద్రగంటివారు కూడ లోనుగాక తప్పలేదు.

శ్రీ శాస్త్రిగారి ప్రేయసి 'మృతప్రాయుని'గానున్న తనను మేల్కొల్పిన 'గరిష్ఠ తపః ఫలసిద్ధిమూర్తి' యట! 'నీల గగనాంత వికస్వరతారకాసుమ వ్యాపియమాణ దేహ' యట! 'గీతిగన్మాధుర్య కేళీ కళా సోపానమ్మట! ఈమె జయదేవుని గీతామకరందము, పండిత రాయల భావవిలాసము, భవభూతి రసోన్మీలనము ముప్పిరి గొన్న ఒప్పులకుప్ప, శాస్త్రిగారికి స్వర్గమును దెచ్చి వాకిట నిలిపి 'నవ జీవనము' ప్రసాదించిన 'మనోరాగిణి'.

అందువల్లనే 'ఎవతెవోగాని లోలాక్షి! కవికుమారు నమృత భావాలనొక నోయారమొలుక నిగుడెంచితి దిశలు వెల్గించుకొనుచు ప్రాత రుత్ఫుల్లలసదుషోబాలవోలె' అని పొగుడుచు 'నీలికనులెత్తి చూడుము - చాలునాకు' అని అంటారు 'తపస్సు' అను ఖండికలో!

అంతేకాదు. తన ప్రేయసి 'నేత్రాంచలాల మళుపులో ప్రేమలకు ఓనమాలుగల' వంటారు 'జ్ఞాపకము' అను చిన్న శీర్షికలో.

తన ప్రియురాలిని గూర్చియేగాక తన స్నేహితుని ముఖములో కనబడు సంతోషమునకు 'ఏ కలల వెలుంగు 'ఊర్వశి' ముఖాముఖి ముద్దుల' నిచ్చినదో తెల్పినవో ఒక 'చంపకమాల'ను బహుమతిగా ఇస్తెదవంటారు. ఇక్కడ కృష్ణశాస్త్రిగారి ప్రేయసి 'ఊర్వసి'ని. స్ఫురింపజేసినారు శ్రీ ఇంద్రగంటి.

ప్రేయసీ ప్రియత్వము తరువాత భావకవులకు ప్రకృతిపూజ యెన్నదగిన విషయము. దీనికి సంబంధించినవే 'గోదావరి', 'నదీలక్ష్మి', 'మన్మథా', 'చంద్రరేఖ' అను శీర్షికలు.

ఆంధ్రదేశమునకు అన్నపూర్ణ గోదావరినది. శాస్త్రిగారు బాల్యమునుండి ఆ నదీమతల్లి చెంతనే నివసించుటచే ఆ నదిమీద ఆయనకు మాతృభావ ముదయించినది.

శ్రీనాథుని సీసములను తలపింపజేయు 'త్ర్యంబకాచల దివ్య రాజీవ కర్ణికాసవ దద్భుతర మాకరంద ధార'వంటి పద్యములచే కొనియాడి, వారు తమకున్న భక్తిభావమును చాటుకొనినారు.

భవభూతి గోదావరీ తీరమున 'పెరిగిన జంతువృక్షములను గూడ బంధువులుగా' మురిసి తన తల్లిగా బుట్టినిల్లుగా భావించి ఆ నదిపైగల వాత్సల్యమును జూపినాడు. అందులకే తనను భవభూతితో ఉపమించుకొని తృప్తిపడినారు శాస్త్రిగారు. 'మౌనయాత్రా విధినేగక నిలిచి 'దేవ చరితలు దెలిసి యాశీర్వదింపు'మని అర్థించుతారు గోదావరి తల్లిని.

ఆకసమున శ్రావణ మేఘము లావరించుసరికి భూభాగమున నదులు పొంగిపొరలును. అంతవరకు దాహముతో బీటలవారిన భూదేవి హృదయము చల్లబడును. సంధ్యాకాలములో చక్కగా అలంకరించుకొని పేరంటమునకు బయలుదేరిన తెలుగు పడుచువలె 'నదీలక్ష్మి' ఉన్నదట!

హృద్యమైన ఆ పద్యము చూడుడు-

'పడమటి సంజ్ఞకొంబసిడి పావడ దాల్చి దినేశ కుంకుమం
బిడి నుదుటనే కపోలముల నించుక పుప్పొడులద్ది తీర్చి, కీ
ల్జడ సుమవల్లులందురిమి శ్రావణ సంధ్యను పేరటమ్మకై
వడినడ తెంచెనొక్కొ నవవార్షుక వాహిని మోహనాకృతిన్

నదీ లక్ష్మిని మహాకవి కావ్యముతో ఉపమించుట శాస్త్రిగారు చేసిన మరియొక విశేషము.

అనంగుడైనను మన్మథుడే సర్వజీవకోటికి 'నవచైతన్యమిచ్చు ప్రేమమూర్తి'. అందులకే 'అరువదియేండ్ల పండువయసైనను కుచ్చుల పూలరంగడౌ'నని మన్మథుని శక్తియుక్తులను కొనియాడినారు శ్రీ ఇంద్రగంటి.

అట్లే సుఖానుభూతికి, శైత్యమునకు ప్రతీక అయిన 'చంద్రరేఖ'ను పార్వతీశ్వరుని జడలోని 'వింతమొగలిపువ్వు'గా, మన్మథుని విల్లుగా, 'గగనపాదప'మున విరిసిన చిగురుగా, 'సాంధ్యనారీనితంబ సీమను'న వెలసిన 'నఖరక్షతము'గా భావించినారు శ్రీ శాస్త్రిగారు.

ఇంతలో కాళిదాసు స్మృతిపథములో మెదలినాడు. వెంటనే ఆతని మేఘుడు హృదయాకాశమును ఆవరించినాడు. దానితో శాస్త్రిగారు 'ఓహోహో నవశ్యామల నీల శకల వ్యూహాకృతీ! నత్సుయోవాహ' అని మేఘుని కొనియాడుచు 'నీలి నీలికొండల వెక్కసేల? వేల్పు వాలి నవమేఘ! కోటివరాలనిమ్మ'!ని అర్థించినారు.

'జ్ఞాపక మాగదోయి వినుగాంచిన చల్లని వేళ' అని మేఘ కావ్యములోని ముఖ్యమైన ఘట్టములను శ్రీ హనుమచ్ఛాస్త్రి వివరించినారు 'ఆషాఢస్య ప్రథమ దివసే' అను శీర్షికలో.

ఏ క్షణమున యక్షుని విరహవేదన కాటుపట్టియున్న మేఘునందే శమును ముట్టాకొనిరో గాని శ్రీ శాస్త్రిగారి 'జీవిత కావ్యమే' దుర్భర వేదనా పూరితమయినది. హృదయమున వారికి శాంతి నశించినది. బతుకుబాటలో ఎన్నియో కంటకములు గ్రుచ్చుకొన్నవి. 'శాంతిదేవత మృదుపద స్పర్శలేక'పోవుటచే మనుగడ నిలుకడలేక 'రాపిరంపానబెట్టె'నది.

అందులకే ఏ కర్షకునిగానో, పేదబానిసగానో జీవచ్ఛవములా బతుకక తానొక కళారాధకునిగా జీవించుట ఎందులకని ప్రశ్నించుకొని హనుమచ్ఛాస్త్రిగారు 'ఈ యాత్మకేల తరిమి బతుకెల్ల కాల్చు సౌందర్యచింత?' అని వేదనను ప్రకటించినారు. 'విషపు నవ్వులు

కంటక వీక్షణములు పతిపరిచ్ఛేదమున అడ్డుపడుటచేత 'ఈ ప్రపంచమే అర్థహీన గూఢ మూర్ఖ కావ్యమ్ముగా గోచరించి'నది శ్రీ శాస్త్రిగారికి.

విందులకనగా 'భవాని'తో కలిసి 'తొలుకారు వేళ' పుష్పాల కోసము పరువులెత్తుట, 'నీలమేఘముఖ' నవ్వుచు సత్కరించుట ఇత్యాదులు ఇసుపసం కెలల బిగువు 'తెలియని' నవయౌవన తీవవేళలలో పొందిన సుఖాను భూతులు 'ఏనాటి మాటలో' కాగా శాస్త్రిగారి జీవితములో 'దురంత నిదాఘము' ఆక్రమించినది. దానితో పూర్వపు కథలను, గాథలను త్రవ్వుకొని బాధపడవలసివచ్చినది. దీనికి తోడు తాత తండ్రులనాటినుండి నివసించిన 'మాడుగుల' వదిలిపోవలసి వచ్చెను. ఆసందర్భములో

'అమ్మా! మాడ్గుల! తాత తండ్రుల గృహవ్యావర్తి లక్ష్మీ! ఇదే
క్రొమ్మా నాకడసారి వందనము నీకున్ మాక తీరెన్ ఋణ
మ్మమ్మా! ఊమ్మనదార్చి ప్రోచితివి లోపాలోపమున్ దీర్చియా
మమ్మున్ తండ్రులతాతలన్, తుదకునంబా! భారమ్మై, పోతిమే!

'సెలవా నాకిక పోయివచ్చెద గృహశ్రీదేవి'... వృద్ధ దుమావళులారా! సెలవిందు మీతుహినబాష్పచ్ఛన్న పత్రాళులన్', మరిలేదు పాదమిట నిల్పాగభాగ్యము జన్మజన్మకున్' 'పండిన దోసతోటవలె పండుల వంగిన మావివోలె మేముండిన రోజు లేమయిపోకద! అని వీక్షించిన శాస్త్రిగారి ఆవేదనను పరికించినచో ఆ ప్రదేశమెంత వారికి ప్రాణ ప్రదమో తెలియగలదు. ఇందులో ప్రత్యక్షరమునను వారి అనుభూతి, అనుభవము ప్రత్యక్ష మగును. ఇట్లే సత్యమును పేరు గల తమ్ముడు మరణించినపుడు 'ఒకండవు తమ్ముడ మాయమైతివే!' అను శాస్త్రిగారి 'శోక శ్లోకము' హృదయపు లోతులను కుదిపి వేయును. అందులకే 'ఏమి మహాప్రభూ! ఇటు విధించితివీ పరవాస వేదనాస్తోమ కథా ప్రవృత్తి... 'ఇంక నటింపగలేను చిత్తము-దేమొ వివారపుం బరువు నిండె నికన్ తెరదించుపుమో విభూ' అని శాస్త్రిగారు వీక్షించుట వారి జీవ నాటకము'నకు భరతవాక్యము పలికినట్లుగా భావించవచ్చును. మానసికముగా ఎదుర్కొన్న వ్యక్తిగత సమస్యలకు తోడై, సహజసిద్ధముగానున్న తీవ్రవాద ధోరణి శాస్త్రిగారిని అభ్యుదయ సాహిత్యోద్యమమువైపు నడిపించినది.

ఆ సమయములోనే ఇంద్రదగంటివారు

'కలమా! లెమ్మిక నిద్ర జిమ్ముకొని నీకన్ లోక కళ్యాణపు
వ్కల మాంద్యమ్ముల నీడిపోయినవి రక్షః కృత్య పాండిత్యముల్
కల మా నాగరిక ప్రభావములు సంఘంబెలెడిన్ దీయగా
కలమాన్నంబులు నిత్యనాథులకు జిక్కన్ బక్కకూలారెడిన్.'

అని 'మేలు కొలుపు' పాడినారు.

కలలలో, 'భావ హర్మ్యాలలో దేలక, 'కనువేలచి నగ్న సత్యలోకమ్ము చూడు' మని, ప్రబోధించినారు. ప్రబంధములలోని 'కల్పనాయనికలు' ప్రక్కకునెట్టి, శ్రమజీవుల గాథలను వాస్తవిక కావ్యములుగా నల్లుమని తన లేఖినికి ఆదేశించినారు శ్రీ శాస్త్రిగారు.

దానితో శాస్త్రిగారి జీవిత నాటకమున క్రొత్త అంకము ప్రారంభమయినది. భావకవిత్వపు పోకడలు పోయి ఇదే సమయమున వీరి లేఖినినుండి

'పగుల దన్నుము వ్రణకవాటములను
అవులించి తింౘడి చు సింహాలనదిమి
బొబ్బలెత్తింపు కృతసటా స్ఫోటనమున
యువక! నీస్వగ్ర హృదయమ్ముడికెనేని'

నాటి అగ్నిధారలు వెలువడినవి. 'అతడు పద్యాలు వ్రాస్తాడు' వంటి ముక్తాయింపులు' వినిపించినవి వ్యంగ్య ధోరణిలో!

'ఏమిటి జీవనంబిది క్షీనవనాగరి కంపు కంపు' అను వైరాగ్య చిత్తమే శాస్త్రిగారిని ఒక సత్యాన్వేషకునిగా మార్చి, ఆధ్యాత్మిక దృష్టి నిచ్చినది.

అప్పుడే వారి కలమునుండి 'భావలహరి', 'ఊహాలహరి'వంటివి వెలువడినవి.

ఒక నేకువ జామున ఏదో ఒకధ్వని వినబడి పరువెత్తి జూచినాడు కవి. ఏకాలి గుర్తులును కనబడలేదు. సర్వాతీతమైన ఒక విశ్వమయ రూపము వెలుగుగా కనిపించినది. ఈనాటి ప్రపంచపు పోకడలను ఆ విశ్వ ప్రభువునకు నివేదించుకొనుటయే 'భావలహరి'. ధ్వని గర్భితమైన చక్కని విమర్శకు ఇది ఉదాహరణముగా గ్రహించవచ్చును. క్షాత్రిక నటనము, అధర్మ ప్రవర్తనము, కొంగజపములు, కామవాంఛాసక్తి, నాస్తిక వాదము ఇత్యాది విషయము లిందు ప్రస్తావింపబడినవి.

'ప్రతివాడొక్కొక వేదమూర్తి', 'అందరు పుణ్యకార్యకరణాభిరతుల్ 'పరమార్థచింతనాస్పంద వివాగచిత్తులు' ఇత్యాదులలో శాస్త్రిగారి వ్యంగ్యవిమర్శనము గమనింపదగును.

'వట్టిది వట్టిది భువన వాటికయొక్క యెడారి'. 'నా బతుకంత సంశయము', 'రంగుల ఇంద్రజాలమువలరా! నగరాయత వాసి వాసనా రంగము' 'అకల్ మాయవు, కోపమాగదు, వృధాహంకార ఝంకారముల్' ఇత్యాదులలో శాస్త్రిగారి కేర్పడిన వైరాగ్యము, విరసన ప్రతిబింబించినవి.

'అలసితినయ్యదేవ! ఇక నాత్మబలమ్మున హంక్రియార్భటీ ఫలితములేదు', 'నా హృత్సిరేజముత్వత్కృపాకిరణ సంపృక్తమ్ముగావింపవే' ఇత్యాదులలో 'నీవే తప్ప ఇతఃపరంబెరుగ' అను శరణాగతి ధ్వనించుచున్నది.

'ఏలన యా దయాజలనిధీ! యిటు దాగుడుమూతలాట?'... 'నా పోలిక నీ యెడన్ గనను పొమ్మిక సత్యము చాటుమందువా' ఇత్యాది ఊహాలహరి'లో శాస్త్రిగారు సత్యాన్వేషణలో వారికి కలిగిన భావ సంఘర్షణమును తెలిపినారు.

ఇదే సమయములో 'తీసికొనిపొమ్ము! నీ శాంతిధామమునకు' అను గిరిసి పిన్న పరమాత్ముడు దయదలచి 'దక్షారామక్షేత్ర' సందర్శన భాగ్యము శాస్త్రిగారికి కలిగించినాడు.

1949లో జరిగిన ఈ సంఘటనము మానసికముగా ఇంద్రగంటివారి జీవన విధానములోనే గొప్ప మార్పును తెచ్చినది. కలిగిన భక్తిపారవశ్యమే, అనుభూతి ప్రభావమే మూడు దృశ్యములుగానై 'దక్షారామ కావ్యము'ను తీర్చిదిద్దినవి. దీనికి శ్రీనాథుని భీమఖండాది కావ్యములు ఊతనిచ్చినవి.

ఈ కావ్యము పురాణ, చరిత్ర, ఆధునిక గాథలకొక సమన్వయము గూర్చుటచే ఇంద్రగంటి వారి పేరు' దీనివలన జగద్విఖ్యాతమైనది. 1950 నుండి 70 వరకు 5 మార్లు ముద్రింపబడుటయే ఈ కావ్య ప్రశస్తి కొక నిదర్శనము.

'రావోయీ! అధునాతనాంధ్రకుమారా!' అని 'ఆ ముఖము'లో ఆహ్వానించి 'అదిగో దక్షపురము...'నయన పర్వమ్మౌ విలోకింపుమా' అని 'దర్శనము' చేయించినారు కవి. ప్రథమ దృశ్యమున త్రిపురాసుర సంహారము, సప్తమునులు సప్తగోదావరమును దెచ్చుట, స్వార్య ప్రతిష్ఠ ఇత్యాది విషయములు చెప్పబడినవి.

ద్వితీయ దృశ్యము శిష్యసమేతుడై కాశిని బాసివచ్చిన వ్యాస మహర్షికి అగస్త్యముని ఆహ్వానము, కుశల ప్రశ్నలు, వ్యాసుని ఆవేదనము వర్ణింపబడినవి.

ఇక్కడనే కవి 'నైగమ శిఖాపరమార్థ విబోధ శాంతినీ కమరును బ్రహ్మము తముల నారసి గేయుము దక్షవాటికన్' అని అగస్త్యముని వ్యాసమహర్షిని ఆదేశించినట్లు కల్పించి కావ్యమునకు వన్నె గూర్చినారు.

మూడవ దృశ్యమున శ్రీనాథుడు అన్నయ మంత్రికి భీమఖండమను కృతినిచ్చుట అప్పుడు జరిగిన కవి సన్మానము వర్ణింపబడినవి. ఇందుకూడ కృతిస్వీకార మహోత్సవమను ఘట్టము కవి గావించిన స్వకపోల కల్పనమే!

'శిల్పసందర్శన'మను ఘట్టమున దక్షారామ క్షేత్రమునగల శిల్పనైపుణ్యమును శాస్త్రిగారు కొనియాడినారు.

చివరగా 'సింహావలోకనము'న 'నాడుదన్యతమమ్ము జన్మమ్ము గనక పుట్టి నేడిట నేనెంత పారవడితిని' అని వాపోవుట శాస్త్రిగారికి ఆ క్షేత్రమున కల్గిన పవిత్ర భావనయే కారణము.

'అవునేదో ముడి నీకు నాకు నిది దక్షారామభీమేశ' అని ఈ కావ్య రచన మేనాటి ఋణాను బంధముగానో భావించి దానిని ఆ స్వామికే అంకిత మొనరించి తమ జన్మ ధన్యత్వ మొందెనని ఆనందించినారు హనుమచ్ఛాస్త్రిగారు.

ఈ కావ్యము గూర్చి ఇప్పటికే ఎన్నియో సమీక్షలు వచ్చుటచే ఇంతతో వదలు చున్నాను మన్నింపుడు.

ఈ కావ్యరచనానంతరము వెలువడిన పద్యములలో శాస్త్రిగారి 'భావనా విస్తృతి, ఆధ్యాత్మికత, భాషాపాండిత్యము, నైశిత్యము, రామాయణ కవితాస్వాదన పరత' కనిపించును. అంతర్ముఖత్వమున సత్యాన్వేషణ జేయు వ్యక్తిత్వము ఈయనలో రూపుదాల్చినది. ఇప్పటి నుండియే 'కౌముదీవిహారా'ది కవితలు శక్తియుక్తులను పుంజుకొన్న విగా చెప్పవచ్చును.

మిత్రులతో కలసి వైశాఖ పూర్ణిమనాడు నావపై గోదావరిలో విహరించి, కోరుమిల్లి యగ్రహారమును గాంచినారు. కవి అప్పుడు రాజరాజనరేంద్రుని ఔదార్య వైభవము గుర్తునకు వచ్చి శాస్త్రిగారు

> 'ఓహో జ్ఞప్తికి వచ్చెనీ మహిచళుక్యోర్వీశు నౌదార్యసు
> శ్రీ హృద్యంబయి బారసాచినది ధాత్రీదేవతాపుణ్యరే
> ఖాహస్తుండగు చీదమార్యుని యమోఘాశీస్సులాంధ్రేశుగ్రీ
> వాహీరాంచితహార శోభలయి వహ్వా! వెల్గవే నేటికిన్!

అని స్తుతించినారు.

'తొలి తెల్గు బాల ముద్దుల మూటగావించి జాణగీర్వాణితో జతలు కలిపిన 'ఆంధ్రకవితాది మహాపథికుడు అడుగో'! అని గౌతమీ తీరమున నన్నయ భట్టారకుని మరల కనుల గట్టించినారు కవి. అంతేకాదు.

'నీవు పెట్టిన భిక్ష వెన్నెలలు మాకు–నీవు కట్టిన రక్ష యాంధ్రికి సురమణి' అని నన్నయభటును స్తుతించినారు.

'మేఘదూత' అను శీర్షికలో కాళిదాసు కారణముగా ధన్యుడైన మేఘునకు స్వాగతమిచ్చి, 'విదిశా'ది పురములను గాంచిన విశేషముల నడిగినారు శాస్త్రిగారు.

చివరలో ఆతని 'పరోపకార సంపల్లలితాను భావమున'... క్రొత్త రుచులూరెడు కావ్యము దక్కె'నని కృతజ్ఞతలు తెలిపినారు.

హనుమచ్ఛాస్త్రిగారి భావనాశక్తికి 'ఫల్గుణి' ఒక చక్కని ఉదాహరణము.

మాఘ ఫాల్గుణములు శిశిర రుతువు. శిశిరము వసంతాగమనమునకు నాంది. కావున 'ఆకులపాటు గూర్చెనని, అంగములనే వణికించి సీతువజ్రాకల బెట్టెనంచును చిరాకులు బొందు'వద్దనినారు కవిశేఖరులు ఎందులకనగా రాత్రివేళ 'శీత సుఖమ్మొదాచి', పగలు ఎండ వేడిమిని మోచి, ఖండిత నాయికకుకూడా అల్కతీర్చి సుఖము నిచ్చునది శిశిర రుతువేకదా!

ప్రాతఃకాలమున ముత్యములవలె మెఱయు మలచుబిందువు శోభను, బారుల దీర్చి కూయు పిట్టల నాదములను, చెఱకు తోటల సొగసులను వర్ణించి 'సకలర్తు శోభల'ను 'పల్లెపట్టుం'తో చూడుడని కవి తమకుగల గ్రామసీమాభిమానమును చాటుకొనినారు. ఇక్కడ

రథసప్తమినాడు ముచ్చటగా అలంకరించుకొని 'తులసిమొక్క ముగ్గులకు చెంత' సూర్యనారాయణునకు పాయసము పెట్టు 'కులసతి'ని, 'ఆశల రాణి'గా వచ్చిన 'ఫాల్గునీదేవి'ని మన కన్నులకు గట్టించినారు శ్రీ ఇంద్రగంటి.

ఇందులోనే 'గాదె బంగరునిండువేళల' అను ముత్యాల సరమును, 'అమ్మగువ శీతమను రెమ్మల చివళ్ల కుసుమమ్ములను గ్రుచ్చియు' అనుపూర్వ ఛందోరీతులకు ముడిపెట్టి 'పాత క్రొత్తల మేలు కలయిక'గల అభ్యుదయ భావమును ప్రకటించినారు కవి.

'దిశల కెగసిన యార్యసాధ్వీపతాక' అయిన 'అమృతసీత' మాహాత్మ్యమునెన్ని 'సీత' అను రెండక్షరములలో ఎంత తీపి ఉన్నదో కదా అని ఆశ్చర్యపోయినారు.

భారతదేశమంతయు రామాయణ గ్రంథమును మాత్రమే పూజించుచుండగా, ఆంధ్రులు సీతారాములను ఇలవేల్పులుగాజేసి కొల్చుచున్నారని ఆనందించి, 'హనుమ' చ్ఛాస్త్రిగారు వాల్మీకి 'వ్రాసిన వ్రాత తరతరాలకు నక్షరభిక్షయౌ'నట్లుగా జేసిన సీతమ్మతల్లిని 'రావమ్మా! రఘునాథ జీవన కథా ప్రవస్యంది మాధుర్యమా' అని ఆహ్వానించి, తన 'కవితా మృదుపుష్ప సుగంధ' మన్ని దిశలకు వ్యాపింపజేయుమని అర్థించి 'ఈ జన్మకిదిచాలు' నను సంతృప్తితో వామసార్థక్య మొనరించుకొనినారు.

అందులకే 'సీతాకోకచిలుక' – 'మూడు తియ్యందనమ్ముల ముద్ద'గా 'దండకారణ్యమున సీతను మాయబుచ్చిన లేడిపిల్ల'గా, ఆ తల్లి 'పంచవటి' వద్ద ఆరవేసిన చీరెగా కవి భావనాలోకములో భాసించినది.

అంతియేకాదు. హిమాచల ప్రాంతము నాక్రమించిన వృత్తాంతమును; రావణుడు కైలాస పర్వతమును కదిలించుటతో ఉపమించి, 'ద్రోహిని, దుస్సాహసుని గాలింపుడు బంధింపుడీ!' అను నందీశ్వరుని బోధామృతములో భారత వీరకర్తవ్యమును ధ్వనింపజేయుటలో శాస్త్రిగారికి రామాయణ కావ్యమువగల భక్తిశ్రద్ధలు విదితమగును.

అటులనే 'కవిశరశ్శేఖరుడు కాళిదాసు భావగంధర్వనగర సర్వస్వము'గా, రామ భారత కథలకు ఆటపట్టుగా 'హిమనగము'ను వర్ణించి 'ఇన్నియేల–నీమానసమున్నదచట' అని తెలిపి 'వీరరక్తనదులు' పారించియైనను దానిని పరిరక్షించుకొనవలెనని 'దివ్యవీణ'ను మీటినారు మన భక్త 'హనుమం'తులు.

దేవభక్తితోబాటు శాస్త్రిగారికి 'నీవే పెట్టిన భిక్ష' అని కృతజ్ఞతా భావముగల గురుభక్తి, 'మ అమ్మయుడుగు దమ్ములు భజింతు'నని ప్రకటించు దేశభక్తికూడా సంపూర్ణముగా ఉన్నవి. అందులకే వారికి గాంధీజీ మరణము 'పురుషోత్తమాస్తమయము' గా వ్యథకలిగించినది. దేశములో వ్యాపించిన కులమత భేదములు బాధ పెట్టినవి. అందువల్లనే శాస్త్రిగారు

> 'పచ్చనైనట్టి ఈ మహాభవనసీమ
> వేషభాషల వర్ణ విద్వేషములను
> మరచి మమతలు పెంచి సోదరులు మెలగ
> 'ముక్తభారతి' కపుడు సంపూర్ణజయము'

అని భారతీయులను ప్రబోధించినారు. అటులనే

> 'తెరిచూడంగరాని యదృష్టదీప్తి
> నేల నాలుగు చెఱగుల నేల గలరు
> చెలిమి బలిమిని కలిమిని తెలివిగలిగి
> వెలుగు వారేకమతులైన తెలుగువారు'

అని 'మహాంధ్రోత్సవము'లలో ఎలుగెత్తి చాటినారు శ్రీ ఇంద్రగంటి.

శాస్త్రిగారెంతయో సహృదయులు. ఇతరుల బాధకు విలవిలలాడిపోవుదురు. నిలువున కుమిలిపోవుదురు. అదే 'శాశ్వత దంపతిత్య లోకోత్తర కీర్తి కేతన' ముగా, 'ప్రేమ ప్రదీపము' వెలుగొందు 'ముంతాజు భవన'మును వర్ణించుటలో కన్పించును.

ఏమైననేమి? 'ఎద రగిలించి పాడిన నభోదిన గీతికి ఒక్క అశ్రు వేవదల రుశుష్క మానవులు.' కావున 'వారలతో మనకేమి లెమ్మ' అను వైరాగ్య చిత్తముతో 'తులసిదళాలు బిల్వములతో కలగల్పిన పూజలోవి' 'అద్వైత' భావము నెరిగి 'ఏమి ఏనాటికేనాటికిపుడు పండెనాదు సుకృతమ్ము, స్వామి శ్రీపాద యుగళి దర్శన మహోత్సవమ్మున తనివితీర కన్నులకు వెన్నెలద్దు సుఖమ్ము తోచె' అని 'సత్యా'న్వేషణమ్మున ఒకమార్గముబట్టి చివరకు 'వేంకట ప్రభువు'ను జేరి శాస్త్రిగారు

'అన్నావా? ఎపుడైన–నీ భవన దివ్యక్షోణి వీక్షింపరమ్మన్నావా ...కన్నులు గల్గి ఏమి ఫలమయ్యా ఇదూరమైపోయితినే'అని విచారించి 'దివ్యచిత్రమ్ములోన నీ దీను తలపు కదలెనే నేటికైన వెంకన్నబాబు' అని రసాబ్ధిలో నోలలాడుట గమనింప తగును.

# కలగూరగంప

## శృంగార నైషధము - అనౌచిత్య వివేచనము

శ్రీ హర్ష భట్టసుకవి నైషధ మహాకావ్యమును సకలవిద్యా సనాథుఁడు శ్రీనాథుఁ డాంధ్రీకరించెను. ఆయన "యౌచిత్యం బాదరించియు, ననౌచిత్యంబుఁ బరిహరించియు, మాతృకాను సారంబుగా" తెనిఁగించితి నని 'కావ్యోపసంహారము' న జెప్పికొనెను.

తదను సారముగ కొన్ని తావుల యం దౌచిత్య పోషణమ్మునకై చేసిన మార్పులు ప్రశంసా పాత్రములైనవి. కాని, తృతీయాశ్వాసమున మూలాతిరిక్తమైన యనౌచిత్యమున కతఁడు పాలుపడినాఁడనుట చింత్యము.

దమయంతీ స్వయం వరమున కింద్రాది సురలు బయలుదేరిరి. మార్గ మధ్యమునఁ గానుపించిన నలుని దమయంతి కడకు దూతగాఁ బొమ్మనిరి. ఇంద్రదత్తమైన తిరస్కరణ విద్యచే నలుఁడు నిరాటంకముగ దమయంతి సమ్ముఖము చేరఁగలిగెను. ఆ సమయముననే ఇంద్రాదుల దూతికలు దమయంతిని జేరి తమను బరిచయ మొనర్చుకొని యిట్లు పలికిరి :

> "పాలిండ్ల కొత్తుగాఁ బరిరంభణము సేసి
> యడిగె నీసేమ మయ్యమర విభుఁడు !" (3-120)

ఇందుకు మూలము —

> "సలీల మాలింగన యోప పీడన
> మనామయం పృచ్ఛతి వాసవస్త్వాం" (6-78)

సంస్కృతమున లేని 'పాలిండ్లు' తెనుఁగునఁ బ్రత్యక్షమైనవి. ఇచట మూలమైన 'యాలింగన' పదమే యనౌచిత్యము. ఇక యనువాద మమూలకమే గాక మరియు నౌచిత్య భంజకము.

దూతికల నంపినవారు దిగధీశులు. పంపఁబడినవారు చేడియలు పంపినది పరాసక్తయు, స్వయంవర సంసిద్ధయునైన రాజకుమార్తెకు. అది యేకాంత సందేశము. కాని, యచట దమయంతి సఖులెల్లరుఁ గలరు. పైపెచ్చు యామె హృదయముగొన్నవాఁడదృశ్యుఁడై యచటనే యున్నాడు. ఆతని యునికి దమయంతి యెరుగదు. కాని యా సురలు, వారి దూతికలు నెరుంగకపోలేరు. ఒక విశేషము. తండ్రియైన యేకాంతమునం దుక్తవయస్కురాలైన తనయ నాలింగనము చేసుకొనరాదందురు. అట్టియెడ సంస్కృత 'మాలింగనము' గాని తెనుఁగు 'పాలిండ్ల కొత్తుగాఁ బరిరంభణము' గాని యసభ్యములు. అవాంఛనీయములు. మాతృకనే సవరింపవలసియుండగా మరియు ననౌచిత్యముగా వ్రాయుట విచారణీయము.

ఇది మాతృకాను సరణముకాదు. ఔచిత్యమును బోషించుట కాదు. అనౌచిత్యమును బరిహరించుటకాదు. శృంగార నైషధ వ్యాఖ్యాతలుగాని, విమర్శకులుగాని, పండితులుగాని మౌనము వహించుట విచిత్రముగ నున్నది.

ప్రమాదో ధీమతామపి' యని సరిపుచ్చుకొందమా?

— *శ్రీ ముదిగొండ ఈశ్వరచరణ్.*

## సంతోషీమా, అన్న దేవత కలదా ?

ఇటీవల హిందీలో "జై సంతోషీమా" అన్న చిత్రం విడుదలై విజయ విహారం చేసింది. అనేకమంది, సంతోషీ దేవిని కొలుస్తున్నారు. నా ఊహమట్టుకు ఈ 'సంతోషీమా' అన్న దేవత కేవలం సినీమావారి కల్పనఅని, ఈ దేవతను గురించి పురాణాలలో వ్రాయబడలేదని. అయినను విజ్ఞులద్వారా నా సందేహాన్ని నివృత్తి చేసుకొనుటకై ఈ లేఖ వ్రాయుచున్నాను.

### కథాసారాంశము :

సిద్ధి, బుద్ధిలను భార్యలుగాగల గణపతి, ఒకరోజు కైలాసములో నుండగా, — ఆరోజు రక్షాబంధన్ దినము కాబట్టి, అతనికి రక్షాబంధనము చేయుటకై ఆతని చెల్లెలు(?) వచ్చును. అదిచూచి అతని కుమారులు తాముకూడా, అతనికి రక్షకట్టుదుమందురు. అప్పుడు గణపతి రక్షాబంధనము కేవల సోదర సోదరీ పరిమితమైనదని చెప్పగా, వినక, అతని కుమారులు(?) మారాము చేయగా, తన భార్యల సలహామేరకు, తన కుమారులకై గణపతి ఒక స్త్రీమూర్తిని సృష్టించును. ఆమెయే సంతోషిదేవి. కుమారులు, తమ అనుంగు సోదరిని చూచి మురిసిపోదురు. త్రిమూర్తులు, ఆమెకు అనేక వరముల నిచ్చెదరు.

భూలోకములో అనేకమంది స్త్రీలు సంతోషీమాతను కొలుచుచుందురు. ప్రతి శుక్రవారము తప్పక ఆ దేవిని కొలిచి, ఉపవసించి, శెనగలు బెల్లము తిని, ఈవిధముగా ఐదు శుక్రవారములు చేసిన వారికి, అనేక భోగభాగ్యములు దేవి ప్రసాదించునని ప్రగాఢ విశ్వాసము.

ఒక గ్రామములో పెద్ద ఉమ్మడి కుటుంబములో కడపటివాడైన ఒక వ్యక్తి సంతోషీ భక్తుడు. అతడు పనిపాటలలో శ్రద్ధ వహించక, కేవలం పాటలలో సమయం వెళ్ళబుచ్చుచుండును. ఒకనాడు గ్రామాంతరమునకుపోయి అచ్చట సంతోషీదేవి ఉత్సవములలో పాల్గొని, తన గాన మాధుర్యంతో, సంతోషిదేవి భక్తురాలి మనస్సు ఆకర్షించును. త్వరలో వారికి వివాహము జరుగును. కాని సంపాదన లేని కడుపటి సోదరుని, ఆతని అన్నలు హీనముగా చూచుచుందురు

ఈ అవమానము భరించలేక అతడు ధన సముపార్జనార్థము, భార్యను వదలి విదేశములకు ఓడలో పోవును.

త్రిమూర్తుల భార్యలైన సరస్వతి, లక్ష్మి, పార్వతి భూలోకములో సంతోషిమాకు జరుగుచున్న మర్యాద మన్ననలను ఓర్వలేక, సంతోషీదేవి భక్తులను ఆమెను కొలువకుండా చేయుటకు ప్రయత్నించెదరు. వారు సంతోషి భక్తురాలైన ఈ యువతికి కలలో కన్పించి ఆమె పూజమానుమని హెచ్చరించెదరు. ఆమె నిరాకరించగా, వీరు పగపూని, ఆమె భర్త విదేశములలో వ్యాపారములో వుండగా అతనికి విస్మృతి కలిగించి, ఆమెను పూర్తిగా మఱచునట్లు మఱియొక స్త్రీని మోహించునట్లు చేయుదురు. మఱియును ఆ గ్రామమునకు వచ్చి ఆమె భర్త ఓడలో మునిగి చనిపోయెనని చెప్పుదురు. అది విని అందరు ఆమెను విధవ అని నిందించెదరు. దుఃఖితమైన ఆమెకు నారద మహర్షి కనుపించి, సంతోషీదేవి వ్రతమును ఐదు శుక్రవారములు విడువక ఆచరించవలసినదిగా సెలవిచ్చును. ఆ ప్రకారము ఆమె ఎన్నో కష్టములకు ఓర్చి సంతోషి వ్రతమును పూర్తిచేయగా ఆమె భర్త విస్మృతినుండి మేల్కొని అపార ధనసంపత్తుతో ఆమెను చేరును. ఆ శుభసందర్భములో వారు మరలా సంతోషి వ్రతమును పెద్ద ఎత్తున చేయగా. ఓర్వలేని కొందరు దేవీ ప్రసాదములో విషము కల్పి, ఆ ప్రసాదమును తిని కొందరు మరణించగా, ఇది అంతయు వీరి కుట్ర అని, ఆ దంపతులను నిందించి వారిని చంపుటకు రాగా, సంతోషీదేవి ప్రత్యక్షమై పాపాత్ములను శిక్షించి, ఆ దంపతులను ఆశీర్వదించును. అప్పుడు త్రిమూర్తుల భార్యలు, ఆ దేవిమహత్తును వెల్లడించుటకే తాము ఆ దంపతులను కష్టములకు గురిచేసితిమని వెల్లడించెదరు.

ఈ సినిమా, బొంబాయిలో మరి అనేక ప్రదేశాలలో విజయవంతంగా ఆడింది. ఈ సినిమాలో ముఖ్యంగా ఆకర్షించేది (Jazz) (జాజ్) సంగీతము! "జై జై సంతోషి" అని ఒక రకమైన లయలో ప్రాశ్చాత్య సంగీతాన్ని అనుసరించి, హిందువుల భజనలను ప్రచారం చేయడం సినిమా వారికే తగింది. ఎన్నో కాలేజీలలో విద్యార్థులు 'కోకాకోల' సీసాలో, ఈ సంతోషీదేవిపై పాటలు పాడి, వెఱ్ఱి గంతులు వేయటం పరిపాటి. వాస్తవానికి హిందువుల పురాణంలో లేని కథను సృష్టించి Jazz సంగీతంలో అసహ్యమెచ్చే రీతిగా నృత్యాలను చిత్రీకరించి, హిందూ మతాన్ని ఒకరకంగా కించపరచింది. ఈ సినిమాలోని త్రిమూర్తులు, వారి దేవేరిల సంభాషణ మరీ సాధారణ వ్యక్తులు—హిందీ రాని వారు మాట్లాడాలా వుంది. ఈ సినిమాలో నైతిక విలువకు స్థానంలేదు. ఉదాహరణకు గ్రామాంతర మెళ్ళిన వ్యక్తి ఒక స్త్రీని మోహించి, ఆమెతో విలాసంగా గడిపి, వివాహమాడి, సంతోషీదేవి దయవల్ల, తన భార్యను జ్ఞప్తికి తెచ్చుకొని, ఆమెను వదిలివేసి, తన భార్యదగ్గర రావడం, మన సంస్కృతికే తలవంపులు తెచ్చేది. ఈ సినిమా వుద్దేశ్యం, సంతోషీదేవి అనుగ్రహంతో ఏ పాపాలు మనలను అంటవని చెప్పే రీతి పైవిధంగా రూపొందింది.

మన సంస్కృతి, సంస్కారం పైన మక్కువలేక, కేవలం ధన సముపార్జనే వ్యాపకంగా పెట్టుకొన్న సినిమా నిర్మాతలున్నంతవరకు మన సినిమాల గతి యింతే! ఈ దృష్ట్యా Ben Hur, Ten Commandments వంటి ఆంగ్ల చిత్రాలను చూస్తే మన సంస్కృతిని ప్రదర్శించడంలో లోటుపాటులు బాగా తెలుస్తాయి.

ఏమైన, సంతోషీదేవి, అన్నదేవత వుందో లేదో, తెలిస్తే ఎంతో బాగుంటుంది.

— డా॥ మురళీధర్

# సంకల్ప సూర్యోదయము

ప్రాచీన విద్వత్కవులు వారి వారి కభిమానములైన జ్యోతిష - - వైద్య - వేదాంతాది శాస్త్రములోని విషయమును - తయా శాస్త్రములలోని పరిభాషాపదములను సముచిత రీతిని పాత్రములుగ గల్పించి నాటకములుగను, వ్యవహార గ్రంథములుగను రచించి యున్నారు. వేదాంత శాస్త్రములో కవితార్కిక సింహ సర్వతంత్ర స్వతంత్రాది బిరుదాంచితులైన శ్రీ వేదాంత దేశికులవారు రచించిన సంకల్ప సూర్యోదయము పదియంకములు కలదియు, శ్రీ ఘటికా శత సుదర్శనాచార్య తనూజులయిన శ్రీమద్వరదాచార్యులచే రచితమైన వేదాంత విలాసము అను నామాంతరము కల యతిరాజ విజయము అనెడు ఆరంకములు కలదియు, శ్రీరామానుజకవి ప్రణీతమైన వివేక విజయమున్ను శ్రీ విశిష్టాద్వైత వేదాంత సంబంధములైన నాటకములు. శ్రీకృష్ణ మిశ్రప్రణీతమైన ఐదు అంకములుగల ప్రబోధ చంద్రోదయము, ఆనందరాయమఖి ప్రణీతమైన విద్యాపరిణయము, నల్లాధ్వరి విరచితమైన జీవన్ముక్తి కల్యాణము, సాంఖ్యాచార్య దైవజ్ఞ సార్వభౌమ శ్రీరాణీ నృసింహాచయనుల వారిచే రచితమైన చిత్సూర్యాలోకము అద్వైత సంబంధములైనవి. ఇకను శ్రీ కవి కర్ణపూర విరచితమయిన చైతన్య చంద్రోదయమను పదియంకములు కలది చైతన్య సంప్రదాయ సంబంధమయిన నాటకము [1] ఆనందరాయమఖి రచితమైన ఆరంకములు కల జీవనందనము (లేక జీవానందము) వైద్య విషయక నాటకము. ఇకను వేదాంత శాస్త్రములోని పరిభాషలను వ్యక్తులుగ గల్పించి వ్యవహార పద్ధతితో రచితములైన కొన్ని గ్రంథములు కలవు. అవి — స. కృష్ణమాచార్య విరచితమైన [2] సంయమనీపురం హైకోర్టు వేదాంతవిచారణ సివిల్ కేసు, మా తండ్రిగారు విద్యారణ్య పంచానన విద్యా వాచస్పతి కళానిధి శ్రీమాన్ కళత్తూరు వి కాల రామచంద్రాచార్యులవారిచే విరచితమైన వేదాంతము జడ్జిమెంట్, పరమార్థ జడ్జిమెంట్[3] మున్నగునవి త్రిమతములకు చెందినవి. పూర్వాశ్రమములో కవిసార్వభౌమ కవిగండభేరుండ బిరుదాంచితులైన శ్రీమాన్ వసుదుర్గము కృష్ణమాచార్యులవారు అను పేరుగల శ్రీకృష్ణ బ్రహ్మతంత్ర పరకాల మహా యతీంద్రుల వారు (నేటికి మూట యేబది సంవత్సరముల నాటివారు), వారు విరచించిన అనుగ్రహ పరిపాటియను గద్యగ్రంథములో మధ్యను "శాల్యోదనము (అనగా సన్నవరి బియ్యపు అన్నము)ను నాయకుని

గాను, క్షుద్బాధము (అనగా ఆకలిని)ను ప్రతిపక్ష నాయకునిగాను మఱి కొన్నంటిని మఱికొన్ని వ్యక్తులుగాను కల్పించి చమత్కారముగ రచన సలిపినారు. వీటిలో కృష్ణమిశ్రుల ప్రబోధచంద్రోదయము నంది మల్లన, ఘంట సింగనలు పద్యకావ్యముగా దెనిగించిరి. ఇకను సంకల్ప సూర్యోదయము సంస్కృత గ్రంథమునకు సరిగ (నాటకము గనే) చీరాల వాస్తవ్యులు బహు గ్రంథకర్తలునైన శ్రీమాన్ శ్రీ కుమార ఆదివరాహాచార్యుల వారిచే ఆంధ్రీకృతమై ముద్రితమై సూర్యాలోకభాగ్యము నొందియున్నది. ఈ సంకల్ప సూర్యోదయము సంస్కృత గ్రంథము 1910వ సంవత్సరములో భారద్వాజ శ్రీనివాసాచార్య విరచితమైన ప్రభావళీ సమాఖ్య వ్యాఖ్యానముతోటి తెనుగు లిపితో బెంగుళూరులో వాగీశ్వరీ ముద్రాశాలయందు కీ. శ. శ్రీనివాస వరదాచార్యులగారిచే రెండు సంపుటములుగ ముద్రితమై విద్వద్గ్రహముల నలంకరించి యున్నది. దీనికి ఒక పద్యకావ్యరూపానువాదము నేను చూచినది కలదు. చక్కని (మృదుమధురమైన) శైలి. అనువాదము చాల సమగ్రతతో విషయమును సుగమమొనర్చుచు నిర్వహింపబడినది. ఇదియు పైన దెలిపిన బెంగుళూరులో ముద్రింపబడిన సంస్కృత గ్రంథమును బోలి అంతయు నట్లనే (ఆ సైజులోనే ఆరకపు కాగితములయందే లిపియు అంతయే) ముద్రితమైనది. ఇది ప్రకాశంజిల్లా కందుకూరు తాలూకా కలికివాయ గ్రామములో నా యింట మా సొంత పుస్తక భాండాగారములో నుండినది. నేను దీనిని ౧౯౫—౫౦ సంవత్సరములనాడు చదివి యుంటిని. ఆ తరువాత నొక మిత్రుడు చదివి యిచ్చెదనని యడుగ నిచ్చితిని. అంత నది పరహస్తం గతం గతం ఐనది. చిరకాలమైనందున నిటీవల అనువాదకుని పేరు ముద్రణస్థలము వగైరాలు విస్మృతములైనవి.

నే నిటీవల ఇట్లు నాటకములుగను, వ్యవహార రూపములుగను రచితములైన శాస్త్రగ్రంథములయొక్క స్వరూప విషయాదులను చర్చించుచు నొక వ్యాసము రచింపనెంచి సంస్కృత భాషలోనున్న నా గ్రంథముల నన్నింటిని చదివి వ్యాసములో వాటి వాటి ఆంధ్రానువాదములనున్ను తెలుపదగునని తలంచి నేను చదివిన పద్యకావ్యరూపానువాదమును దెప్పించుకొన నెంచి 70-80 యేండ్లనుండి నేటివరకునుగల పలు ముద్రాక్షరశాలల గ్రంథ సూచికల (క్యాటలాగుల)ను సుమారు 40-50 టిని చూచితిని. కాని వేటిలోను ఈ సంకల్ప సూర్యోదయపు పేరు కనుపించలేదు. పశ్చిమ గోదావరి జిల్లా పెంటపాడు గ్రామములోని శ్రీ వైష్ణవ పత్రికా ముద్రణాలయపు క్యాటలాగులలో పూర్వోక్తమైన శ్రీ కుమార ఆదివరాహాచార్యులవారి యథా మూలానువాదగ్రంథము పేరె కనుపించనది. కొన్ని గ్రంథాలయములలోను తిరిగి అడిగితిని. ఎచ్చటను కాననైతిని. చివరకు – దీని యనువాదములు మఱి యేదేని కలవా? కనుగొందమని యెంచి భాషోద్ధారక విశ్వదాత శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులవారు (ఆంధ్రపత్రికా భారతీ స్థాపకులు) 1929 సంవత్సరములో ప్రచురించిన ఆంధ్రవాఙ్మయ సూచికను చూడగా నొక ప్రబంధరూపానువాదము పేరు కనుపించినది. దాని విషయ మిట్లున్నది.

| గ్రంథము | గ్రంథకర్త | విషయము | ఛందస్సు | ముద్రణ కాలము | పుటలు |
|---|---|---|---|---|---|
| సంకల్ప సూర్యోదయము | రాయడవు రంగారావు | ప్రబంధము | పద్యము | | |

అని ముద్రిత గ్రంథముల పట్టికలో నున్నది. ఇందులో ముద్రణ కాలము తెలుపబడలేదు. మా గ్రంథాలయములోని గ్రంథము మా తండ్రిగారు సంపాదించినది. వారు 1932 సంవత్సరములో పరమపదించిరి. కావున నా గ్రంథము అంతకుముందు సంవత్సరములలోనే ముద్రితమైనదిగ నూహింపంజనును. ఇకను రచయిత ముద్రణస్థల వివరములు – రచయిత నామము నాకు జ్ఞాపకములేదు. ముద్రణ స్థానము బొబ్బిలియని జ్ఞాపకము. ఔనోకాదో. సుమారు 350 పుటలు కలది. యనియు గుర్తు.

ఇప్పుడు దీనిని గురించి మనవిచేయుటలో నా మనవి యేమనగా? వేదాంత దేశిక విరచితమైన పూర్వోక్తమయిన (సంస్కృత) సంకల్ప సూర్యోదయ నాటకమునకు పద్యకావ్యాత్మకములైన అనువాదములు కానీ. నాటకరూపానువాదములేకానీ. కథా సంగ్రహాత్మక రచనలుకానీ చూచిన విద్వాంసులు వాటి వాటి రచయితల పేళ్ళు, ముద్రణ కాలస్థలములు, అవి దొరుకు తావులు (అడ్రసులు) వగైరాలను నాకు లేఖామూలమున దెలుపగోరుచున్నాను. లేక వ్యాస రూపముగ భారతీ మూలముననే తెలిపినచో కృతజ్ఞతతో గ్రహింపగలను. ఈ రెండవ పద్ధతి యయ్యెనేని దేశములోని భారతీ పాఠకు లందఱు ఎఱుంగంగలరు.

ఈ సంకల్ప సూర్యోదయముయొక్క తెనుంగు అనువాదముల వివరములతోటి–నేను చదివిన పూర్వోక్త గ్రంథములేకాక మఱియు నేవేని యున్నచో వాటి వివరములనున్ను తెలుపగోరెదను.

---

1 చెన్నపురి అడయార్ లైబ్రరీవారి లిఖిత సంస్కృత ప్రాకృత గ్రంథముల పట్టికలో కనుపించెడి "జ్ఞానసూర్యోదయ" అను నాటకమును చూచి వ్యాసము వ్రాయునప్పుడు దాని విషయ వివరణమున్ను వ్రాసెదను.

2 ఇది సంస్కృతాంధ్ర ద్రావిడహూణ (ఆంగ్ల) భాషలలోను అనూదితమై యున్నది.

3 ఇట్టి అద్వైత గ్రంథమునకును మారోపదేశికులు సాహాయ్యకారులు పరిష్కర్తలు మా తండ్రిగారేనని అందు తెలియదగును. వ్యాసకర్త – వి. శే.

— విక్రాల శేషాచార్యులు.

కలికివాయ పోస్టు, (వయా) సింగరాయకొండ, ప్రకాశం జిల్లా

## ఒక సందేహము

''చింతామణిలోని తెనుగు వర్ణములలో హ కారము''

నన్నయ మొదలు నేటి వైయాకరణు లెల్లరు అచ్చ ఛందః కర్తలు అచ్చతెనుగు వర్ణమాలలో హకారమును గ్రహించిరి.

భారతాంధ్రీకరణకర్తగా కొనియాడబడుచున్న నన్నపార్యుడే ఆంధ్రశబ్ద చింతామణియను ఆంధ్రవ్యాకరణమును తొలిగా రచించి వాగనుశాసను డయ్యెనని సకల లాక్షణికుల గాఢవిశ్వాసము. బహు పండిత ప్రవాదము నదియే. కాని నేటి విమర్శకులు, చరిత్రకారులు కొందఱు మాత్రము భారతాంధ్రీకరణ కర్త నన్నయ భట్టారకుడు చింతామణికర్త కాడనియు, భారత రచనవల్లనే వాగనుశాసనుడయ్యె ననియు వాదింతురు. వీరిది కేవల తార్కికదృష్టి. తర్కముచే వాదము పెరుగువే కాని చర్చ ముగియదు. తర్కమున వాది దౌర్బల్యమే కాని వాద దౌర్బల్యముండదు. న్యాయస్థానమున న్యాయవాది వాదపటిమ ననుసరించి జయాపజయములు తారుమారగుట అనుభవసిద్ధము. లాక్షణికులు చింతామణి కర్తృత్వమువల్లనే నన్నయభట్టు వాగను శాసనుడయ్యెనందురు. అనుశాసనమనగా వ్యాకరణము. మహాభాష్యకర్త పతంజలి ''అథశబ్దాను శాసనమ్'' అని తన భాష్యము నారంభించెను. ఆంధ్ర శబ్ద చింతామణి ప్రణాళికను లోతుగా పరిశీలించినచో అది ఆద్యవ్యాకరణమని స్పష్టము కాగలదు. ఈ చర్చ చాల పెద్దది.

ఇక సందేహము.

నన్నపార్యుడు తన ఆంధ్ర శబ్దచింతామణిలో అచ్చతెనుగు వర్ణసమామ్నాయమున హ కారమును పఠించెను. ఆయన 11వ శతాబ్దివాడు. ఆ నాటికి అచ్చతెనుగు పదములలో హ కారమున్నట్లు నన్నపార్యుని భారత భాగమున ఒక పదమైనను లభింపదు. ఆ తరువాత హ కార ఘటిత కన్నడ పదములు తెలుగున ప్రవేశించియున్నవి. అవియు శబ్దరత్నాకరమున ద్వైరూప్యము కలిగి కనిపించుచున్నవి. సంస్కృతమునుండి ''హంస'' మున్నగు పదములు తద్భవములై తెనుగున చేరునపు ''అంచ'' పదమువలె హ కారము వీడియే ప్రవేశించుచున్నవి. అప్పుడది అనాంధ్రవర్ణమే కదా? సంస్కృతము తద్భవముగా చేరునప్పుడు అనాంధ్ర వర్ణములను తొలగించుకొనియే చేరుట సంప్రదాయము. ప్రాకృతములు సైతము తత్సమాదులలో అనాంధ్ర వర్ణములను వీడియే ప్రవేశించుచున్నవి. కావున అచ్చ తెనుగు వ్యంజనములన్నియు అల్ప ప్రాణములైనపుడు మహాప్రాణమైన ఒక్క హ కారము మాత్రము నెంకొన్నందుకు కారణమేమో దురూహముగా ఉన్నది. సకారము మాత్రము మహాప్రాణము కాదా యనవచ్చును. కాని అదొక విధముగా అల్ప ప్రాణమే. అదొక చర్చ. దీనినిబట్టి ఆంధ్ర శబ్ద చింతామణిలో తెనుగు వర్ణముగా ప్రక్షిప్తమా? లేక ఆ నాటికి హ కార ఘటితములు అచ్చతెనుగు పదము లేవైన గలవా?

పండితులు ఈ సందేహము తీర్పవలయునని ప్రార్థనము.

శ్రీ పి. వి. కృష్ణమాచార్యులు

# లేఖలు

## హిమలేహ్యం-శేషేంద్రజాలం

నవంబరు 1976 భారతిలో, శ్రీ గుంటూరు శేషేంద్ర శర్మగారి కవిత్వముపైని శ్రీ ఆవంత్స సోమసుందర్ వ్రాసిన ''శేషేంద్రజాలం'' అను ప్రశంసాత్మక గ్రంథమును శ్రీ రామాచంద్ర మౌళిగారు సమీక్షించిరి. శ్రీ రామాచంద్రమౌళిగారికి శ్రీ శేషేంద్ర శర్మగారి కవిత్వములో గుణముకాని, శ్రీ సోమసుందర్‌గారి ప్రశంసలో పసకాని కన్పడినట్లు లేదు. శ్రీ శేషేంద్ర శర్మగారి కవిత్వములో ఒక అంశము నైనను మెచ్చుకొనక పోయిన ఎడల బాగుండదేమో అని బిడియపడి, వారి కవిత్వములోని ఒక సమాసము (హిమలేహ్యం'')ను ఇట్లు ఉగ్గడించిరి.

''శ్రీ శేషేంద్రశర్మ తన పుస్తకంలో సృష్టించిన హిమ లేహ్యం (ఐస్ క్రీంకు బదులు) అన్న పదం మాత్రం ఓ సుందర ప్రతిష్ఠ.''

దాని ఖర్మమేమోకాని వారు బాగుగా లేదనిన శ్రీ శేషేంద్ర శర్మగారి ఇతర కవిత్వాంశములకంటె ఇదే తొక్కుగా ఉన్నది ఎట్లు అందురా? చిత్తగించవలెను:

క్రీం అనిన మీగడ, లేహ్యం మీగడ కాదు. అను వాదము సరిగా లేదు. క్రీం ఒకానొక నిర్దిష్ట పదార్థము. లేహ్యము తినదగిన పదార్థములలో ఒక దినుసును తెలుపు వర్గపదము. లేహ్యము నాక దగినది. క్రీం లేక మీగడ చప్పరింపదగినది. ''లేహ్య'' పదము కూష్మాండ లేహ్యము, ఊరుపిచ్చుక నత్తున లేహ్యము, సిద్ధ ధాతు సువర్ణ లేహ్యము మొదలగు ఆయుర్వేద ఔషధముల వాసనకొట్టుచున్నది. హిమలేహ్యము కూడా అట్టిదియే యేమో అని ప్రకృతి చికిత్సావాదులకు జంకు కలుగవచ్చును. ఇది ఇంగ్లీషు బాకెట్టు (ఐస్ క్రీం) పెట్టుకొనివచ్చిన, నాకదగినదిగ అనిపించు నేమో! ''హ్య'' శబ్దము ఉచ్చారణసౌకర్యము (Volubility) లేనట్టిది. అసహ్య, ఏహ్య, గుహ్య, యహ్యాఖాను (పాకీస్తాను నియంత) వంటి పదములు నెప్పునకువచ్చి ఏవకలిగింపక మానదు. కాబట్టి,

ఐస్ క్రీంకు ''మంచుమీగడ'' అనియున్నబాగు. కాదు మేము ఆధునికాంధ్ర కవులము సంస్కృత పదజాలమే కావలెననిన, ''హిమ మస్తువు'', ''తుషారమస్తువు''అను తయారు చేయవచ్చును. మీగడ నుండివచ్చి అంతటి రుచి, మృదుత్వము, ఆకారము, తెల్లదనము కలిగిన ''నవనీతము'' ఉన్నది. ఐస్ క్రీంకు ''హిమనీ నవనీతము'' (తెలుగులో ''మంచువెన్న'') అనినకూడా అక్షరరమ్యత, అర్థసారస్యము, ''క్రీం''లోని కొంత ఇంద్రజాలమూ ఉండును. మన కవులు వ్రాయునవి వచన పద్యములే కనుక గణ యతి ప్రాసలు పోవునను చింతయునులేదు.

ప్రేక్షకులను ముగ్ధులను చేయుటకు మారు వారిచే కొక్కిరింపబడే ఇంద్రజాలికుని చూచిన జాలికలుగక మానదుకదా!

— శ్రీ సర్దేశాయి తిరుమలరావు

## ప్ర ం ఖ లు

విజయనగర సామ్రాజ్యస్థాపనకు ప్రేరకులెవరను విషయముపై శ్రీ శాంతరసగారి ఆంగ్లవ్యాసమును అనువదించిన శ్రీ హనుమచ్ఛాస్త్రిగారి వ్యాసమును భారతిలో చదివిన పిమ్మట కొన్ని సందేహములు కలిగినవి.

విజయనగర సామ్రాజ్యము క్రీ. శ. 1336 హరిహర బుక్కరాయలచే స్థాపించబడిన విషయము జగమెఱిగిన సత్యము. అటు పిమ్మట క్రీ. శ. 1365 వరకూ హరిహరరాయలచేతను క్రీ. శ. 1365 నుండి క్రీ. శ. 1376 వరకూ బుక్కరాయలచేతను సామ్రాజ్యము విస్తరింపజేయబడినది. క్రీ. శ. 1379లో బుక్కరాయలు మరణించినట్లు శాసనాధారము లున్నవి.

బుక్కరాయల కుమారుడగు కుమార కంపరాయల పత్నియైన గంగాదేవి రచించిన మధురా విజయములోని అసాధారణ "సర్వజ్ఞం విలసత్సర్వ మంగలం క్రియాశక్తి గురుం వందే త్రిలోచన మీలావరం." అను వర్ణన క్రియాశక్తి బిరుదమును పొందిన విద్యారణ్యుల గురించేనని చారిత్రకులభిప్రాయపడుతున్నారు.

మాదవ మంత్రికి జ్యేష్ఠ లింగమును ప్రసాదించినట్లుగల రూరోముచ్చళి అగ్రహారమందలి శాసనములోని క్రియాశక్తి దేవుడు శ్రీ శాంతరసగారభిప్రాయపడినట్లు కులగురువుకాదని కులదైవమని కర్ణాటక ప్రాంతములోని గాథలు చెప్పుచున్నవి.

సొరబ శాసనము (ఎపి గ్రాఫికా కర్ణాటకా సంపుటి VIII సంఖ్య 375) హరిహర మందలి శాసనము (ఎపిగ్రాఫికా కర్ణాటికా సంపుటి XI సంఖ్య 23) చెన్నరాయపట్నం తాలూకా హాలికేరి శాసనము (ఎపిగ్రాఫికా సీరీస్ నెం 256)లో మార్గదర్శకుడని గురువని వర్ణింపబడిన క్రియాశక్తి దేవుడు విద్యారణ్యులే గాని తదితరులు గాదు.

వేటకుక్కలు కుందేలు కథలు, కట్టుకథలు కావచ్చుగాక విజయనగర సామ్రాజ్య స్థాపనా కాలమునకు (క్రీ. శ. 1336) విద్యారణ్యులు హరిహర బుక్కలతో వుండినారని ప్రముఖ చారిత్రకులు నిరూపించినారు.

శ్రీ శాంతరస పేర్కొనిన క్రియాశక్తి ఒక్కడే అనుటకు ఏట్టి ఆధారములు లేవు.

అనంతపురం జిల్లా ధర్మవరం తాలూకాలో క్రీ. శ. శక్తి ప్రతిష్ఠించినాడనుటను నిరూపించు శాసనములు ఆ దేవాలయ కుడ్యములపై నున్నవి. అచ్చటి పెక్కు దేవాలయములు, జలాశయము ఈతనిచే నిర్మించబడినవి.

ధర్మవరం చరిత్రలో ఈతనిని క్రియాశక్తి అనియే పేర్కొనిరి.

కావున క్రియాశక్తులు పలువురు వున్నట్లు ఋజువగుచున్నది.

విజయనగరము స్థాపించిన రెండు దశాబ్దములకుపైన విద్యారణ్యులు విజయనగరములో ప్రవేశించి ప్రాబల్యము నొందినారని శ్రీ శాంతరసగారు వ్రాసినారు.

వారి అభిప్రాయము ప్రకారము క్రీ. శ. 1536 సం॥ తరువాత విద్యారణ్యులు విజయనగరమును ప్రవేశించినట్లు మనము భావింపవలసి వున్నది.

అనగా విద్యారణ్యుల వారిని కృష్ణరాయల సూచనమాత్రముగానైనా ఎరుగడనియే కదా అర్థము? ఎందుకనగా కృష్ణరాయలు క్రీ. శ. 1530లో మరణించినాడు. కాని కృష్ణరాయలు పెక్కు శాసనములలో విద్యారణ్యుల ప్రస్తావన కనిపించుచున్నవి. ఇదెట్లు సంభవించినది.

దీనికి ఆ విమర్శకులే సమాధానమియ్యవలసి యున్నది. క్రీ.శ. 1370-1536 వరకూ వున్న కవులు విద్యారణ్యులను గూర్చి కలలు గనిరా?

అదియునుగాక పాశ్చాత్య చరిత్రకారుడు డా॥ సాలెటోర్ "స్థాపకులకు మహాసన్యాసియైన విద్యారణ్యస్వామికి అన్యోన్య సంబంధములున్నట్లు ఎన్నో కథలు పేర్కొంటున్నవి" అంటున్నారు.

అయితే క్రియాశక్తి ఒకరు కానపుడు, బిరుదు కావొచ్చన్న అనుమానం కలుగుతున్నపుడు శాసనములలో పేర్కొనబడిన క్రియాశక్తి దేవుడు విద్యారణ్యస్వామి ఎందుకు కాకూడదు? ఈ విషయమై చారిత్రక పరిశోధకులు పరిశోధనకు దిగి నూతన అంశములను నేటి తరానికి అందివ్వగలరని విశ్వసిస్తున్నాము.

— శ్రీ పాయసం సుబ్రహ్మణ్యం

# గ్రంథ విమర్శలు

## శ్రీ రామకృష్ణ కథామృతము

(శ్రీ మహేంద్రనాథగుప్త వంగమాతృకకు ఆంధ్రానువాదము. డెమ్మీ సైజు 16+240 పేజీలు. వెల రూ. 8. లు. కాలికో బైండు రూ 12లు. ప్రకాశకులు: శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-600004.)

గత శతాబ్ది చరమభాగంలో ఉండిన గొప్ప యోగులలో శ్రీ రామకృష్ణ పరమహంసయే అగ్రగణ్యులు. భక్తి, జ్ఞాన, కర్మ యోగాలలో సులభమైన భక్తిమార్గాన్నే అవలంబించి, మొదట కొందరు సంపన్నుల గృహాలలో దేవమందిరాలలో అర్చనచేస్తూ, చివరకు దక్షిణేశ్వరంలోని కాళీదేవికి పూజారియై దేవీఅనుగ్రహాన్ని ఆయన సంపాదించారు. ఆ అనుగ్రహంవల్లనే ఆయనకు సాటిలేని విజ్ఞానం లభించినది. ప్రపంచంలో ఎట్టి అనుభవములేని ఆయనకు సాటిలేని లోకజ్ఞత అలవడింది. అన్నిమతాల తత్వాన్నీ అవలీలగా గ్రహించారు. సాకారమైన దేవియందే ఆయన పరబ్రహ్మమును చూడగలిగారు. ఈయన చేష్టలను ఉన్మాదవిలసితాలని భ్రాంతిపడినవారే ఈయన మహాయోగి అని గ్రహింపగలిగారు. విగ్రహారాధనను నిరసించే బ్రహ్మసామాజికులే ఈయనను దర్శించి, బోధను వినుటకు తహతహపడేవారు.

ఆధ్యాత్మిక విషయంలో ఎవరికి ఎట్టి సందేహాలు కలిగినా, ఎవరు ఎట్టి చిక్కు ప్రశ్నలు వేసినా, చిన్న చిన్న కథలతోనూ, చక్కని దృష్టాంతాలతోనూ మనస్సుకు హత్తుకునేరీతిని సమాధానంచెప్పడంలో ఈయనకు ఈయనయే సాటి! వీరి లోకజ్ఞత అనన్య సామాన్యమైనది.

ఇందులో మొదట భగవాన్ శ్రీరామకృష్ణుల సంక్షిప్త జీవిత చరిత్ర పది పుటలలో ఇయ్యబడినది. చివర 3 పుటలలో గ్రంథకర్త (బెంగాలీ మూలరచయిత) మహేంద్రనాథగుప్త జీవిత చరిత్ర సంగ్రహముగా ఇయ్యబడింది. అందులో గొప్ప విద్వాంసుడై సంసార జీవితమును సాగించుచు బ్రహ్మసామాజికుల ఆదరమును చూరగొనుచు వారివెంట నుండిన మహేంద్రనాథగుప్త క్రమంగా పరమహంసను అర్థంచేసుకుని, అతని బోధలను విని ఆయనకు ముఖ్యశిష్యుడై పుత్రనిర్విశేషంగా ఉండిన విషయం వివరించబడింది.

శ్రీరామకృష్ణ కథామృతం అయిదు భాగాల పెద్దగ్రంథం. అందులో ఇది ప్రథమ భాగం మాత్రమే! ఇందులో 18 అధ్యాయములు ఉన్నాయి. మొదటి అధ్యాయంలో గురుశిష్యుల సమావేశం, రెండవ అధ్యాయంలో కేశవాది భక్తులతో నౌకావిహారం, మూడవ దానిలో సింతి బ్రహ్మసమాజ భక్తులతో సంభాషణ, నాల్గవదానిలో దక్షిణేశ్వరాలయంలో విజయుడు మున్నగు భక్తులతో సంభాషణ, 5, 6, 7 అధ్యాయాలలో దక్షిణేశ్వరాలయంలో బ్రహ్మసమాజ భక్తులతోనూ, తదితరులతోనూ సంభాషణ, 8-వ అధ్యాయంలో సింధూరియాపట్టి భక్తులతోను, 9వ అధ్యాయంలో జయగోపాలసేన గృహంలోను, 10-వ అధ్యాయంలో సురేంద్రుని గృహంలోనూ సంభాషించుట, 11-వ అధ్యాయంలో శశిధర పండితుని కలిసికొనుట 12-వ దానిలో సింధీ బ్రహ్మ సమాజం వారిని కలుసుకొనుట వివరింపబడినవి. 13-వ, 14-వ, అధ్యాయాలలో దక్షిణేశ్వరాలయంలోనూ, బలరామబోసు గృహంలోనూ భక్తులతోసంభాషించడం, చివరి నాలుగు అధ్యాయాలలో శ్యామపుకూరులో భక్తులతో సంభాషించడం వివరింపబడినవి. ఈ సంభాషణలన్నీ అమూల్యములైన విషయాలను తెలిపే ప్రసంగాలే కాని ఉత్త సంభాషణలు కావు.

ఈ కథామృతం మూలంగానే శ్రీరామకృష్ణుల ప్రభావం మిక్కిలి వేగంగా సామాన్య ప్రజలలో విస్తరించింది. సంసారాగ్నిలో పడి తపించిపోతూ ఉన్న వారి కందరికీ యీ గ్రంథం చల్లని మలయమారుతంవలెనే తాపోపశాంతిని కలిగిస్తుంది. దీనిని చదవడం ప్రారంభిస్తే పూర్తిచేసేవరకూ మనస్సు మరొక విషయంమీదికి పోదు.

దీని తక్కిన భాగాలు కూడా శీఘ్రకాలంలో ప్రకటింపబడగలవని ఆశిస్తున్నాను.

— శ్రీ బులుసు వేంకటరమణయ్య

## ఆంధ్రాభ్యుదయము

[(ఖండకావ్యము) పుటలు : 60. వెల : రు 3-00. రచన "వీరభద్ర" ప్రాప్తిస్థానం : ప్రగతి పబ్లిషింగ్ హౌస్, ఏలూరు రోడ్డు, విజయవాడ-2.]

"ఆంధ్రదేశపుమట్టి అది మహత్వ్యకము, ఆంధ్రదేశపు నీరు అది మాకు నమృతము" అని ఆంధ్రమాతను ప్రస్తుతించిన కావ్యాలెన్నో యిబ్బడి ముబ్బడిగా లోగడనుండి నేటివరకు ఆంధ్రసారస్వతి కలంకార ప్రాయాలై, ఆంధ్రసంస్కృతి కేడుగడలయ్యాయి. మన తెలుగు సంస్కృతి మనసులో చేతనావర్తం చెందగా, కొంగ్రొత్త ఆశల పల్లవిగా ఈ కావ్యాన్ని వీరభద్రగారు రూపొందించారు. దీన్ని ప్రస్తుతాంధ్ర దేశపునేత యయిన వెంగళరాయని కంకిత మొసంగటం సముచితంగాను, సాభిప్రాయ సుందరంగా వుంది. దీనిలో ఆంధ్రదేశపు

ప్రాచీనౌన్నత్యాన్ని ప్రస్తుతించే పద్నెండు వైవిధ్యంగల విషయాలను రసోచిత రామణీయకంగా మనకు వినిపించారు రచయిత. ఆంధ్ర సంస్కృతి ప్రభావాల భావాలు రచయితలోని రాగవీణ నెలా పలికించిందీ సోదాహరణ ప్రసంగం చేశారు. కమనీయమైన పీఠికలో కరుణశ్రీ గారు హృదయానికి అనుభూతి, స్పందనలిచ్చే ఈ ఖండికల కూర్పు సర్వత్రా ప్రాచీనతకు పట్టంకట్టే వీరి వ్యక్తిత్వం, ఛందంలో అందంగా వినిపించటంలో మరింత మాధుర్య ధుర్యంగా వుంది.

"చెలువగు కట్టుబొట్టు మనచీరపంగ తియ్యని తెల్గుభాషయున్
విలువగు పూర్వ సంస్కృతియుఁ బెల్లుగనుండగ భారతావనీ
తలమునఁ భాభవంబుఁగని దాన ననల్ప చరిత్రకున్ దిశా
చలముగ నూతనిచ్చి నొక చాతురి నాంధ్రము దేవ నీ దయన్"
—గోదావరీ లహరీ సదృశమైన కవి శైలి

ఇలాంటి పద్యాల్లో పదింబదిగా గోచరిస్తోంది.

రచయిత మానసికావేగానికి దీటుగా పరువులెత్తిన ఆంధ్రాభిమాన భావనాళ్ళాలు ఈ ఖండికలో విస్తారంగా విలసిల్లాయి.

"ఈ లోయంగల మానవోన్నతియు, ధర్మేచ్ఛాను బంధంబుది
వ్యాలంకార కళావిభూతియును, వేడాంధ్రావనిన్ నిర్బి నే
వాలోకింతుఁగదా మనోగత వివేకాక్షిం బ్రఫుల్లుండనై
వాలో వింతు నభూత భావన రసానందంబు ప్రాశస్త్యమై"
—"గత కాలము మేలువచ్చు కాలముకంటెన్"

అన్న భావనకు ప్రతిరూపుగా నిలచినవిలాంటి పూర్వాంధ్ర ప్రశస్తి బోధకమైన భావదీపికలు.

"ఆ విద్యానగరావనీ విభుకిరీటా గ్రోరురత్నంబు"లాంటి పద్యాలు రచయిత పాండితీ పటిమను పట్టి చూపటమే గాకుండ ప్రాచీనాంధ్ర నగరాల వర్ణనలో విశ్వనాథవారి ఆంధ్ర ప్రశస్తి కావ్యఛాయలు గోచరిస్తున్నాయి. ఇలాంటి ఉదాత్త వస్తువుకు అట్టి యనుకరణలు మకుటాయమానంగానే వుంటవి. ఆంధ్రదేశంలోని విశిష్ట వ్యక్తులను, నగరాల నాగరికతను సంగ్రహంగానైనా మూర్తిమత్వం గావింపబడ్డది లఘుకావ్యంలో. కవిరసజ్ఞ చేతనకు, చిత్తశుద్ధిగల భావుకతకు దర్పణంగావున్నది లఘుకావ్యం.

అనుభవ రాహిత్యంవల్ల కాబోలు, ఏడనేడ కొన్ని భాషాదోషాలు కన్పిస్తాయి. విశృంఖలతను వాంఛించే నవవ కవితలో అవి ఉపేక్షణీయం అయినా, సంప్రదాయ కవితలో అవి అపేక్షణీయాలు కావు. మచ్చుకు కొన్ని: ప్రాభక్షణ్ణ వినులక్తై, తరలుచుట, జనయిత్రి, వాడుగువారు, యొంచరంజనన్, స్వరతి.

అవర్ణనీయమైన కవితాశక్తి, అవిరళమైన యాంధ్రభక్తి, అనన్యమైన కావ్యకళాసక్తిగల వీరి మనుతుల మనసునుండి మరిన్ని మధుర కావ్యాలుల్లం పల్లవించేలా తళుకొత్తాలని దీన్ని పఠించిన పాఠకుడు పలుమారు భావిస్తాడు. కవి అలాంటి రసస్పందన పందించటంలో కృతకృత్యులయారు.

## సాహిత్య గంగాలహరి

[(సాహిత్య విమర్శలూ, పరామర్శలూ) పుటలు: 236 వెల: రు. 8-00. రచన: కీ. శే. నూతలపాటి గంగాధరం ప్రచురణ: చిత్తూరుజిల్లా రచయితలసంఘం, చిత్తూరు.]

ప్రాచీనార్వాచీన సాహిత్యామృతాన్ని పుక్కిటబట్టిన రసికుల్లో కీ. శే. నూతలపాటి గంగాధరంగారి ఉత్తమ కవితా విమర్శనాదర్శనం యీ వ్యాససంకలనం. "సుకృతీగతాయుః" అన్నట్లుగా వారు స్వర్గస్థులైనా సహృదయులకు తమ సాహితీ సందేశాన్ని సర్వత్రా రసస్పందనంగా అందించిన వీరి కృషి వాఙ్మయరంగంలో అక్షరప్రాయంగానే వుంటుంది. ఈ సాహితీ గంగాధరునిలోని రసమయ చంద్రరేఖకొక నూలుపోగుగా చిత్తూరుజిల్లా రచయితలసంఘంవారు ప్రచురించిన యిలాంటి ప్రామాణిక గ్రంథం యే డిగ్రీకళాశాల విద్యార్థులకో పఠనపాఠనీయాలుగ నిర్ణయించే అర్హతాధికారాలు యిందులో అవిరళంగా వున్నాయి. కాని "శ్రేయాంసి బహువిఘ్నాని" అంటారుగదా మరి.

నూతలపాటివారి సాహితీచంద్రుని షోడశ కళలను వెలువరించే సమగ్ర పరిపూర్ణమైన పదహారు వ్యాసాలిందులో చోటుచేసికొన్నాయి. ఇవన్నీ భారతి, ఆంధ్రప్రభ — ఇత్యాది ప్రముఖ సాహితీ పత్రికలు ప్రచురించుకొని, వాటి స్థాయిని చిరస్థాయి చేసికొన్నవని చెప్పాలి. నూతలపాటివారి సమగ్ర సారస్వతావలోకనం యిందులో మూడు భాగాలుగ ముచ్చటించబడింది. పీఠికలోని మధురాంతకం రాజారాంగారి స్మృతి వచనాన్నిబట్టి, గంగాధరంగారి "సంస్కారం, సాహితీనివేదన, వ్యక్తిత్వవైశిష్ట్యం. ఈ ముచ్చటైన మూడు విభాగాల కన్వయించుకోవచ్చు.

మొదటి విభాగంలోని అయిదు వ్యాసాలూ ఇజాలు, నిజాలతో నిండిన ఆధునిక కవితా లతలను పూయించిన గురజాడ, అబ్బురపే శ్రీశ్రీ, కుందుర్తి కవనాల కామనీయకతను, సంస్కరణాశీలాన్ని ప్రత్యగ్ర సుందరంగా ప్రత్యక్షంచేసినట్టివి. అయితే వారిలోని నవ సమాజ భావనకు, నవతాదీప్తికి పరోక్షంగా ప్రభావంచూపిన ప్రజాకవి వేమన వ్యక్తిత్వం ప్రాతిపదికయని మొదటివ్యాస సారాంశం జీవితానికి దూరంగా నిల్చున్నట్లే కనబడి, జీవితలోలీనమై యింకా కొందరు ధీమాన్యులకు మహోకసంగా గోచరించని వేమన రసనైదుష్యం యిలాంటి సహృదయుల హృదయాల్లోంచి జాలువారి సార్వజనీనత

స్తుంది. ప్రజాకవి వేమన వెలుకుబళ్ళ వేదాలను ప్రసన్న మధురంగా ఈ వ్యాసంలో ఉటంకించారు. ఆ సందర్భంగా సాహితీ ప్రపంచంలో గొప్ప కవులకు, మంచికవులకు పేరుగావించిన విశ్లేషణ హృద్యంగాను, నవ్యతో దర్శనీయంగానువుంది. వేమన దురదృష్టమే మన, "ఏగతి రచియించిరేని సమకాలము వారలు మెచ్చరేగదా" యన్నట్లుగా అటు సమకాలికుల అవజ్ఞకూ, వైయక్తిక జీవితంలోని బాధల నాధారంగా భార్యా ధర్మాలు చెబితే ఇటు అత్యాధునికులు వేమన వనితాద్వేషియని విరుచుకుపడుతున్నారు. మంచి కవికి వచ్చిన కితాబులివి. స్వీయ వ్యక్తిత్వము ద కవితలో గోచరింపజేయడమే వేమనచేసిన మహాపాపమా? ఆట వెలదులలో ఆటవెలదుల నిరాసనం గావించిన వేమన నేటి సామాజిక కవితా చేతనకు నిక్కంగా మక్కువ గొలిపే మాతృక అని చెప్పక తప్పదు. ఈ కవితా కర్మయోగి తెలుగు వారి కడుగుజాడల నేర్పిన గురజాడ కారాధ్యుడని రెండవ వ్యాసంలో సాధికారంగా వుపన్యసించారు గంగాధరంగారు. వీరిద్దరినిగూర్చి ఒకచోటలో వాస్తవికత, మానవత, కర్మయోగిత్వం మూర్తీభవించిన మనీషులనటం సముచితంగాను, ఎంతో అర్థవంతంగానువుంది. 'అనుభవం' అనే మాతన కవితావస్తువును తీసుకొని, వీరిచ్చిన వ్యాఖ్యానం హృదయంగమమేగాక, విమర్శనారంగంలో నవతను అందించింది. గురజాడవారు వేమననుంచి గైకొన్న సరళఛందం, వ్యావహారికభాష, నిత్యజీవితానుభవాలైన ఉపమానాలూ, వ్యావహారికమైన లోకోక్తులు. అనే అంశాలు కవితా కన్యను 'దివినుండి భువికి' దింపిన అమృతాంశువులన్న వీరి పలుకులు ఎవరికీ ములుకులు కానేరవు. అందరికి ఆమోదయోగ్యమే.

"రేపటి కవి త్రిపురనేని" వ్యాసం సాంప్రదాయకంపై తిరుగుబాటునే తన తీర్పుగా యిచ్చిన త్రిపురనేనివారి త్రివిక్రమ సాహితీ స్వరూపాన్ని తేటతెల్లం చేసేది. విశ్వనాథ వర్గంవారి సాహిత్యంలో పరిశీలనా సంస్కారం, దిగంబర కవుల దబాయింపు కవితలో సంస్కరణ సంస్కారంలేదు అనే మాటమాత్రం సమంజసమైనది కాదు. హస్తిమశకాంతరా వంటి విశ్వనాథ, కవిత దిగంబర కవితలకు పోలికయే సరికాదు. పైపెచ్చు త్రిపురనేని కవిత్వంలో రెండూ వున్నాయనటం అంగీకారయోగ్యం కాదు. ఆయనకు లక్ష్యశుద్ధి వుండవచ్చు గాని ఉత్తమ సాహితీ సిద్ధిలేదు. పరిమిత లక్ష్యప్రాబల్యం ఆయనకు అపరిమిత సాహితీ విలువల నాపాదింపజేయలేదని నా భావం. పురాణాల పోనిదంతా బూతనేవారి తీవ్రవాదం పాతకొత్తల, మేలికలయికను కోరేవారికి కూడ కంటగింపుగా వుంటుంది. "శ్రీశ్రీ మరో ప్రస్థానం 1934' అనే మరో వ్యాసం శ్రీశ్రీ గారిలోగల పూర్వాగ్రహకవితా చర్వణం, ఆయన కీర్తిపతాకకు వేదికయైన మహాప్రస్థాన నిర్మాణ కారణాలు సమగ్రంగా చర్చింపబడ్డాయి. మహాప్రస్థానం, ఆకాశదీపం. యీ రెండే శ్రీశ్రీ మహోత్తుంగ శృంగాలనధిష్ఠించేట్లు చేశాయి అంటారు. మళ్ళీ ఆ స్థాయిని వారందుకోవటానికి కృషిగావించటంలేదనే వీరి అభిప్రాయానికి నేనేకాదు, సహానుభూతిగల సర్వులందరూ సమ్మతిస్తారనుకుంటాను. ఆధునిక వచన కవితా ప్రక్రియల వ్యాప్తికి తానే ముందుండి, తానే వెనకుండి నడిపించిన కుందుర్తివారి కవితా స్వరూపవ్యాసం అసమగ్రతా దోషానికి గురి అయింది. రచయితకు, కుందుర్తికిగల వ్యక్తిగత పరిచయాల ప్రశంస లెక్కువైన కారణంగా వ్యాసానికి వెల తగ్గింది.

మాతలపాటివారి ప్రాచీన సాహితీ నిష్ణాతత్వం రెండవ విభాగంలోని రెండు వ్యాసాలలో సమ్యగ్దర్శనాన్నిస్తుంది. రెండు ప్రాచీన కావ్యాలలోని ఏకవస్తువు నాధారంగా చేసుకుని, తులనాత్మక పరిశీలన యిందులో లక్ష్యం. అందును మొదటి వ్యాసంలో కాళిదాసు, నన్నెచోడుల రతిపాత్ర చిత్రణల తీరుతెన్నులు, రెండవ వ్యాసంలో శృంగార నైషధ, ప్రభావతీ ప్రద్యుమ్నాలలోని హంసదౌత్యాల ధోరణులు సునిశితంగా వ్యక్తం చేయబడ్డాయి. జిజ్ఞాసువులకు ద్వితీయ వ్యాసం అద్వితీయంగాను, అతిప్రతిభా సమన్వితంగాను అగుపిస్తుంది. మొదటిది ఆ పాత మధురము, రెండవది ఆలోచనామృతము — అని వింగడించుకోవచ్చు.

గంగాధరంగారి సాహిత్య గంగాలహరి విద్యుద్దీపమై విలసిల్లిన మూడవభాగంలో ఆధునిక కవితా స్వరూప స్వభావాలను గూర్చి పదింబదిగా ప్రస్తుతించిన తొమ్మిది వ్యాసాలూ ఆయన కవితాత్మకు నవరస భరితగీతాలుగ ఒప్పుతున్నాయి. అట్టి ప్రక్రియా సారమ్యాన్ని విశ్లేషించి చూపే వ్యాసాలు గ్రంథస్థంగా యిటీవల రాలేదనే చెప్పొచ్చు. "సినారె"గారి దీపిక్ తరువాత ఆధునిక కవితాధ్యయనపరుల కానుషంగికంగా యీ సంపుటం ఉపకరిస్తుంది. వీనిలోని దోషాలను వెదుక్కునే పని సహృదయునకు అసిధారావ్రతంలాంటిది. గుణ రామణీయకత అంతగా గుబాళించింది. పఠనయోగ్యత వినా ప్రదర్శన యోగ్యత అంతగా గోచరించని 'దారి' అనే రూపకం మాత్రం దీనిలో అపవాదం. వ్యాసాన్ని బలవంతంగా నాటకీకరణ చేసినట్లున్నది. ఆధునిక కాలంలో తెలుగునాట పరిఢవిల్లిన సాహిత్యోద్యమాలను వ్యష్టిగాను, సమష్టిగాను, ప్రజాకవిత, నవ్యకవితల తీరుతెన్నులను, భూతకాలాన్ని వర్తమానంతో బేరీజువేసి భవిష్యదాశంసనలను, వచన కవితా ప్రక్రియలలోని వైవిధ్యాలను, వైరుధ్యాలను రచయిత ఎంతో సూక్ష్మేక్షికతో దర్శించి, మనకోసం ప్రదర్శించారు. వీరి కాంతదర్శిత్వం అడుగడుగునా వుట్టిపడుతోంది. చాల వ్యాసాలలో పునరుక్తిభావాలు, సంక్షిప్తం చేయబడిన పెద్ద వ్యాసాల ప్రభావాలు విస్తారంగా కనిపిస్తాయి. "అధికస్య అధికం ఫలమ్" అన్న రీతిలో అవి సామాన్యుడికి సాహిత్యపు పునాదిని గట్టిపరుస్తున్నాయని

భావించాలి శ్రీ శ్రీ, కుందుర్తి, ఆరుద్ర, తిలక్. అజంతా కవుల వచన కవితా వైదగ్ధ్యాన్ని వివరించిన ఆఖరు వ్యాసం అత్యంత ప్రామాణికమైనది. పది కాలాలపాటు సాహిత్యంలో ప్రశస్తి వహించేది.

"నుతజల పూరితంబులగు నూతులలో" నిక్షిప్తమైన ఈ సాహిత్య గంగాలహరిని ఆస్వాదించటానికి ప్రతి రసజ్ఞుడూ ముందుకు రావాలి. సర్వాంగీణ పరిపూర్ణ సుందరంగా ఈ గ్రంథం అందుకు సమాయత్తంగా వుంది. "రామగిరి ప్రాంతపు కొండలలాగే ఆయన స్నేహం జ్ఞాపకంగా మిగిలిపోయింది" అని ముగింపులో పత్రికాధిపతులు ఆవేదనతో పలికిన పలుకులు ఆయన సాహితీ వాత్సల్యం నిరంతర వర్ధిష్ణువుగానే వుంటుందని ఈ గ్రంథంలో సర్వేసర్వత్ర ద్యోతకమవుతుంది.

'వచన కవితకెంతో భవిష్యత్తు వుంది' అని అంతరిక్షంలోకి జారిపోయిన ఈ విమర్శక శిరశ్శేఖరుడు సహృదయుల రసనలపై చిరంజీవిగానే వుంటాడు. అందు కాధారమైన యీ గ్రంథ నిర్మాణాన్ని దీక్షా దక్షతలతో గావించిన చిత్తూరు జిల్లా రచయితల సంఘం వారి చిత్తశుద్ధి స్తుతిపాత్రమైనది, నాణ్యమైనది.

## ఊరు వీడ్కోలు చెప్పింది

[(కథల సంపుటి) పుటలు : 114: వెల: రు. 4-00, రచన : శీలా వీర్రాజు, ప్రచురణ స్పందన సాహితీ సమాఖ్య. 23/182E, న్యూ మున్సిపలు క్వార్టర్సు, మచిలీపట్నం.]

కుందుర్తి వచన కవితా సౌరభంతో వెల్లి విరిసిన కథక చిత్రకారులు శీలా వీర్రాజుగారి కథన చాతుర్యాన్ని కమనీయంగా అందించిన స్పందన సాహితీ సమాఖ్య వారి మరో చైతన్యజ్ఞాన దీపిక యీ పుస్తకం. ఆణిముత్యాల్లాంటి ఆరు కథలిందులో మనస్సుకు విందు చేస్తున్నాయి.

మధ్యతరగతి కుటుంబాల్లోని ఉద్యోగాలుచేసే ఉవిదల బాధలను బాధ్యతలను నేర్పుగా వివరిస్తూ అది అంతులేని కథగా చేయకుండ పసందైన పరిష్కారంతో అవధిచూపినది మొదటికథ. సూటిగా, పాఠకుని గుండెలోతుల్ని స్పృశించే కథనం. నేటి కాలానికి చాలా అవసరమైన సృజనయిది. ఇందులో రచయితలోని కవిని, చిత్రకారుడిని ఏకత్ర దర్శిస్తాడు పాఠకు. "గోడపక్క బాదంచెట్టు చిటారు కొమ్మ దాటి తెల్లని మేఘాల నల్లంచులుదాటి నీలాకాశంలోకి ఆనందపు వుయ్యాల వూగుతోంది" — ఇంతగా కవితా ప్రకృతి రమ్యంగా చదువరిని అలరిస్తుంది.

ఈ సంపుటిలోకెల్లా మకుటాయమైన కథ రెండవది. నేటి పల్లెటూళ్ళ కుళ్ళు వ్యవస్థను, బడిపంతుళ్ళ అవస్థలకు అనుసంధించిన కథనంయిది. ఆద్యంతం ఉత్కంఠనిస్తుంది. సొంతవూరుకన్న మిన్నగ ఆ వూరిపై మమకారం పెంచుకున్న బడుగు బడిపంతులుకు తేనె పూసినకత్తుల్లాంటి వూరివాళ్ళు వీడ్కోలుతో ఇచ్చిన కానుక హృదయ విదారకంగాను, సర్వసాధారణంగానువుంది. ఈ టైటిలుకథ మానవులలోని వంచనా శిల్పానికి పరాకాష్టగా మలిచారు శీలా'' శిల్పి.

ప్రేమించిన వ్యక్తి మోసంచేయగా పరిస్థితుల ప్రాబల్యాన పతితఅయి, మామూలు మగవాడైన అతనిచే తిరస్కృతయై పతిత జీవితాన్నే తనకు నిష్కృతిగా నిర్ణయించుకున్న ఒక అభాగినికథ 'ఓడిపోయాక.' రచయితలో పాత కథన ప్రవృత్తి వుంటే యిలాంటి కథలు ఆమె ఆత్మాహుతితో అంతంచేసి వుండేవారు. నేటికాలపు మగువల తెగువను వివరించే పరిష్కారం రచయిత నవీన దృక్పథాన్ని చూపిస్తుంది. కాని 'అత్తమీది కోపం దుత్తమీద చూపినట్లు' ఈ పరిష్కారం అందరికీ నచ్చదు. ఆదర్శవర్తనుడుగా రాజారాం ఆమెను చేబడితే మంచి ముగింపు అయ్యేది.

ఈ సంపుటిలో మరో మంచి రచన 'సీడ'. ఇదొక రంగుల హరివిల్లు. కట్టుకున్న వాని మనస్సున కనుగుణంగా తన వృత్తి ప్రవృత్తుల మార్చుకొని, భారతనారిగా మారిన చందన కథ. ఒక హఠాత్పతిత సన్నివేశాన్నాధారంచేసుకుని చందన భర్తను పాఠకునికి పరిచయంచేసి, ఆతడూహించని ఎన్నో మలుపులు తిప్పి అద్భుతమైన భావావేశాన్ని కలిగించారు. జీవితాన్ని జీవితంగా చూడగలదీ మంచి గంధంలాటి చందన కథ.

'చావొద్దు' కథ వస్తువులోను, తీర్పులోని నవ్యత లేనిది కథన చాతుర్యమే పాఠకుని మెప్పును పొందుతుంది. తన తప్పులేకుండా పతితయైన పత్నినేలుకున్న రాముని మించిన మరో సుగుణాభిరాముని పరిచయం చేస్తారు. మగవారిలో ఆలోచనాశీలత పెంచే రచనయిదా "ఆమె అప్పుడు వర్షాకాలంలో కొండవాగు, ఇప్పుడు దైన్యాన్ని నింపుకున్న వేసవి వాగు" వంటి సాభిప్రాయ వర్ణనలు వీర్రాజుగారి వైశేషిక భావుక ప్రజ్ఞకు నిదర్శనాలు.

స్నేహఫలం అందరికీ తీపికాదు. కొందరికది తీపులతూపు అవుతుంది. 'స్నేహమనే మాదకత్వంలో చాపకింద నీరులాంటి వారిని నమ్మి వంచితురాలైన సుందరి కథ ఆఖరుది. తులసిలాంటి అవకాశవాదులు, వెంగల్ప లాంటి నిమిత్తమాత్రులు, నిర్లిప్తులు నేటి సమాజంలో కోకొల్లలు ఈ ముగ్గురమ్మాయీ కథనంలో ముందు కథల్లో వున్నంత భావనా పటిమ భాసించదు టైటిలుకు వేసిన ముఖచిత్రంగూడ సామాన్యుడికి సద్యస్ఫూర్తి నివ్వదు.

ఇలాంటి సహకార రసాల కథామృతాన్ని రసజ్ఞులకు పందారం చేస్తున్న స్పందన సాహితీ సమాఖ్యవారి సాహితీ సహకారాన్ని, పరిణత ప్రజ్ఞను మరోసారి మెచ్చుకోక తప్పదు.

— సుచంద్ర.

## "మూడు పుస్తకాలు"

1. స్పెషల్ సీ కథలు.
2. మాలిక.
3. కవితా కల్లోలిని.

స్పెషల్ సీ కథలు అనే యీ పుస్తకంలో 21స్ట్ సెంచరీ రైటర్స్ అనబడే వారిలో కొంతమంది రాసిన పందొమ్మిది కథలున్నాయి. వీటిలో "చిలక చిత్తైపోయింది"లో మానవుని దైనందిన కార్యక్రమాలను, అక్రమాలను, జంఝూటనలనూ, ఆరాటాలను చూసి ఆశ్చర్యపోయి; మీ కెందుకీ జంఝూటన! మాలా స్వేచ్ఛగా వుండరాదూ అ మాటని అడిగిన వో చిలుకను కథలోని మానవుడు నాగరికతనగా యిదే అని చిత్తు చేస్తాడు. ఈ కథ కథనం చక్కగా వున్నాయి. "సింహాలొచ్చాయి జాగ్రత్త"లో లైన్స్ క్లబ్‌మీద హాస్యం, వ్యంగ్యం బాగున్నా, వో పాటికి కృతకమయినట్టనిపిస్తుంది. "ఆడది ఇహ వూరుకోదు" కథలాగా గాక చిన్న సందేశంలా, హెచ్చరికలా, అక్కసు తీర్చుకోడానికి రాసినట్టుగా వుంది.

మొత్తంమీద యీ రచనల్లో తెగింపు కనుపిస్తోంది. వీరి వృత్తి వ్యాపకాలున్నా, తీరుబడి సృష్టించుకుని రచనలుచేసి, తమ సంస్థద్వారా ప్రచురించుకుంటున్నట్టు, యిది తమ ఆరో పుస్తకమనీ 21స్ట్ సెంచరీ రైటర్స్ హెచ్చరికలో తెలియజేశారు. ఇది చాలా మెచ్చుకోవాల్సిన విషయం. ఎటొచ్చీ పత్రికలనూ, అందులోని రచనలనూ కించపరచకుండావుంటే బాగుంటుంది.

168 పేజీలున్న యీ పుస్తకం ఈ సంస్థ విజయనగరం నుంచి వెలవడింది. వెల వొక్రూపాయలు.

ఇహ రెండో పుస్తకం "మాలిక" నల్లగొండ యువరచయితల సమితివారు ప్రకటించారు. ఇందులో ఎనిమిది కథలున్నాయి. "ఓ మామూలు కథ"లో లంచగొండి ప్రపంచంలో వో నిరుద్యోగి జీవితం చిత్రింపబడింది. కథావస్తువు పాతదే అయినా కథనం బాగున్నది. "తెలుగు చూసిన చీకటి"లో వో సాదా కుటుంబంలోని స్త్రీ పెళ్ళిమీద ఆశలు, మూఢనమ్మకాలు, పెళ్ళి, త్రాగుబోతు భర్త...అంతరాత్మ తిరుగుబాటు...ఆత్మకర్తవ్యబోధ..."ఆవిడ భర్త పెళ్ళి"లో కడుపు పండని వో స్త్రీ తన భర్త మరో పెళ్ళి చేసుకుంటున్నాడని తెలుసుకున్నపుడు పడే ఆవేదన, సమాధానపరచుకోడం తీరా తననుకున్నట్టుగాక...భర్త వో అనాధపిల్లను పెంపకానికి తీసుకురాడం చూసినపుడామె పొందిన ఆనందం...చక్కగా రచింపబడ్డాయి. అన్ని కథలూ బాగున్నాయి. ఎటొచ్చీ కొన్ని కథలు మరీ క్లుప్తంగా వున్నట్టున్నాయి.

యువరచయితలను పోషించి, వెలుగులోకి తెచ్చే యిలాటి సమితి లుండడం చాలా ఆనందకరం. ఈ పుస్తకం వెల మూడ్రూపాయలు. ఆ సమితికి రాస్తే దొరుకుతుంది.

మూడవ పుస్తకం శ్రీ కన్నికంటి రాజమల్లాచారి వ్రాసిన "కవితా కల్లోలిని", ఈ "కల్లోలిని" శ్రీ కృష్ణదేవరాయుల చరిత్రలోని ముఖ్యమైన, మధురమైన కొన్ని ఘట్టాల నల్లుకుంది. రాయల ప్రతిభ, కవిత, కవిపోషణలమీద ఎన్నో పుస్తకాలున్నాయి కానీ యీ "కల్లోలిని"లో రాయల రాజకీయాలను, సాహిత్య పోషణనూ రచయిత అతిసుందరంగా రంగరించారు. శ్రీ కృష్ణదేవరాయలు జననంకన్నా కాస్త ముందునుంచి ఆయన మరణం వరకూగల చరిత్రలో వివిధ విశేషాలను రచయిత పేర్కొన్నారు. ఆముక్తమాల్యద రచనావశ్యకత, రచనవంటివన్నీ చక్కగా చిత్రించారు. పద్య గద్యములతో యీ "కల్లోలిని" ఆచార్య డాక్టర్ దివాకర్ల వెంకటావధాని గారు తమ తమ అభిప్రాయంలో విశదీకరించినట్లు "నామమునకు నవల అయ్యు, స్వభావముచే ప్రౌఢమైన గద్యకావ్యమువలె" విరాజిల్లుచున్నది. రచయిత శ్రీ రాజమల్లాచారి కృషి అమోఘము, అభినందనీయము. ప్రకాశకులు మార్కాపురం టావిక్ రైటర్సు వారు కూడా అభినందనీయులు. మూడ్రూపాయలు యీ నవల వెల.

—పాలాక్షుడు

## సంస్కృత వ్యాకరణ సంగ్రహము

[ రచయితలు : శ్రీమాన్ సి. వి. శేషాచార్యులు, శ్రీ కె. కె. ఆచార్య, క్రౌను సైజు 16+216 పేజీలు, వెల: రూ. 5-50, ప్రకాశకులు : సాహితీ సదన్, 141. టి. నగర్, తిరుపతి. ప్రతులకై ప్రకాశకులకు వ్రాయవలెను. ]

భాషలో ప్రావీణ్యం సంపాదించాలంటే వ్యాకరణాన్ని తప్పక అభ్యసించాలి. తెలుగు భాషలో చాలా పదాలు సంస్కృత సమములై ఉన్నందున సంస్కృత వ్యాకరణం కొంతవరకయినా తెలుసుకొంటేనే గాని, వాటిని అర్థం చేసుకోవడం కష్టం. ప్రాచీనములైన సంస్కృత వ్యాకరణాలు గురువుల నాశ్రయించి అభ్యసిస్తేనేకాని బోధపడవు. స్వయంగా చదువుకొని, వాటిని అర్థంచేసుకొనడం సాధ్యం కాదు. తెలుగువారు సులభంగా వాటిని తెలుసుకొనుటకు ముఖ్యములైన సంస్కృత వ్యాకరణాంశాలు తెలుగులో వివరించే గ్రంథాల ఆవశ్యకత ఎంతైనా ఉన్నది.

తత్సమ పదాలకు సంబంధించినంతవరకూ సన్నిధానం-సూర్యనారాయణ శాస్త్రిగారి 'తత్సమ చంద్రిక' పింగళివారి 'కుమార వ్యాకరణం' కొంతవరకూ ఉపయోగిస్తాయి. సంస్కృతం నేర్చుకునే విద్యార్థులకు సులభంగా బోధపడే పుస్తకంమాత్రం కావలసియే ఉన్నది. ఆ లోపాన్ని ఈ 'సంస్కృతవ్యాకరణ సంగ్రహం' తీర్చగలిగి ఉన్నది.

తిరుపతి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంవారు బి. ఏ. డిగ్రీకోర్సు అడ్వాన్స్‌డ్ తెలుగు విభాగంలో సంస్కృత వ్యాకరణాన్ని కూడా కొంత చేర్చారు. ఇంటర్‌లోకూడా సంస్కృత వ్యాకరణం

సంస్కృత వ్యాకరణ పాఠ్యాంశాలు ఉన్నవి. వీటి నన్నిటినీ పురస్కరించుకుని, అందరికీ ఉపయోగించే విధంగా ఈ వ్యాకరణ సంగ్రహం సమకూర్చబడినది. ఆ యా పాఠ్య ప్రణాళికలను అనుసరించి యిందులో మూడు లింగాలలోనూ అజంత, హలంత శబ్దాలు, సర్వనామ శబ్దాలు, అచ్చుల, హల్లుల, విసర్గముల సంధులు, ధాతు, ప్రత్యయ, ఆగమ, ఆదేశాలు భ్వాది దశగణ రూపములు, సమాసములు, తద్ధితాంతములు, వివిధ ప్రత్యయాలు, స్త్రీ ప్రత్యయాలు, కారకములు మొదలైనవి విపులంగా చూపబడినవి.

'సత్' శబ్ద యోగంవల్ల సప్తమ్యంత పదం ప్రథమా విభక్త్యర్థాన్ని ఇస్తుంది. ఇది సంస్కృతాభిజ్ఞులకు బాగా తెలిసినా, తెలుగు వారికి వింతగా కనబడుతుంది. ఆ ప్రయోగ విశేషాలు 'సత్ సప్తమి' (సతి సప్తమి అనికూడా ప్రసిద్ధి) శీర్షికలో ఇయ్యబడినవి. అలాగే 'సత్' శబ్ద యోగంలో షష్ఠికి ప్రథమార్థం రావడంకూడా చూపబడింది. ఇవి రచయితల నిశిత పరిశీలనకు తార్కాణాలు. ఇట్లే వాక్య నిర్మాణ పద్ధతి వివిధ శబ్దరూపాలూ ఇయ్యబడినవి.

ఎంత గట్టి పాండిత్యమున్నా – ఈ విధంగా వర్ణ విభాగంచేసి, ప్రధానమైన రూపాలను ఒకచోట చేర్చి కూర్చడం శ్రమసాధ్యమే. అయినా రచయిత లిద్దరూ ఎంతో ఓపికతో ఈ విషయాలన్నిటికీ ఒక రూపాన్ని కల్పించారు. ఈ పుస్తకం ఆయా పరీక్షలలో ఉత్తీర్ణులగుటకు మాత్రమే కాకుండా మంచి వ్యాకరణజ్ఞతకూ ఉపయోగిస్తుంది.

భాషా శాస్త్ర వేత్తలు, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాచ్య విద్యాశాఖాధ్యక్షులు అయిన డాక్టర్ జి. ఎన్. రెడ్డిగారి ఆమోదం దీనికి లభించినది.

ఇందులో తప్పులు చాలా దొర్లాయి. తప్పొప్పుల పట్టికను అనుసరించి, ఆ యా పుటల్లో దిద్దుబాట్లు చేసుకుని మరీ దీనిని చదవడం మంచిది.

(— "అంగీరస"

## మృత్యువృక్షం

[ఇస్మాయిల్; క్రౌన్ 1/16 76 పుటలు, ధర రు 5/- ప్రతులకు—గ్రంథకర్త, లచ్చిరాజువీధి, కాకినాడ—1.]

ఇది అప్పటమైన వచనంలో శిల్పం ఉట్టిపడేటట్లు వ్రాసిన కవితావైభవం. ఈ రచయిత ప్రకృతిలోని చిన్న చిన్న విషయాలను చేపట్టి నూతన ఉపమాన ఉత్ప్రేక్షలతో, కండపాణంగల భాషలో వర్ణిస్తాడు. తెనుగు తీపిదనం బాగా ఒంటబట్టి ఉన్నది సాహెబు గారికి. షేక్స్పియర్ రాళ్లనుండి తత్త్వాలను గ్రహించినట్లే ఈయన దేనినైనా అర్థవంతంగా హృద్యంగా చెప్పగలడు.

(ప్రయోగాలను వదలి ఉండవచ్చు) దరువులు వాయించే దొంగవ్రేల మృదంగాలు; ఆకాశమంత కాసారాలు ఎండిపోయి; ఆకలితో ఉబ్బిన పిల్లల పొట్టల డొల్ళ్లు—ఎల్మెడెలా వాటి చప్పుళ్ళు (ఆకలికి పొట్టల ఉబ్బుతవా? ఎండి లోపలికి పోతవా? బహుశః నీళ్ళు తాగి తాగి కాబోలు!); కటి ఊపే గోడమీది క్యాలెండర్లు; కలత నిద్దరోయే వెరువుల కళ్ళు తెరిపించి (ఎప్పుడూ చిన్న అలలు ఉంటవి కాబట్టి కలత నిదుర): సెలయేటిలో ఎక్కడో అడుగున సన్నగా గొంతెత్తి గులకరాయి; తడిపిన వెట్లపై తళతళలాడే ఆకుల దోనెలు; ప్రియురాలి నీలినయన గగనం (ప్రౌఢప్రయోగం)లోకి ఎగిరిపోతాడు; మెరిసే నీ చిరునవ్వులు ఏరుకొందామని వచ్చినా; ఊరే గది చీకట్లు (చీకట్లు ఊరుతున్నవి కాబట్టి నిలిచిపోయ్యే దానికి అవకాశం లేదనుట); పట్కాలు పట్టుక పాకులాడే శాస్త్రీయ శైలు (గానుగ ఎద్దు అనే దానికంటే ఇది కొత్త ప్రయోగం, మూఢాచార ఖండన బాగున్నది).

చక్కటి భావుకత, ఉత్ప్రేక్ష, ఉపమానం ఆనందాన్ని గొలిపే పట్టులు:—బిగిపిన జలచర్మంతో నిగనిగలాడే నదిబాజా కడునిండా మడిగుండాలలో కోట్లకొద్ది కథలు; చెడ్డీలు ఊడ్చేసి ఒడ్డున పడేసి మాతృగర్భంలోకి మరలిపో జూచేపిల్లలాగా; చెట్లు వీపులపై మ్యాపులతో పత్రాలన్నీ నిశ్శబ్దంగా ధాత్రికి దిగివచ్చి సామాన్య మట్టితో సారూప్యం పొంది, మ్యాపుల్లోని రహస్య మార్గాలగుండా చేరుకొని వృక్షశిఖరాన (తిరిగి మూల ప్రకృతిలో లీనం కావడం (Recycling) చెప్పిన తీరు ఇది) ఏరుపెక్కి ఇవాళ్టి సంధ్యగాని నలుపెక్కి వచ్చే నిశాంధంకాని నా మనసులో ఆనందపు తెరచాపలెత్తి (సుఖదుఃఖాల సమతను సాధించిన మనస్థితి ఇది) నవ్వడి చేయక భూమిబుగ్గపై చల్లటి నవ్వు సొట్టలా ముడుచుకుంటుంది—బావి (ఈ సొట్ట ముఖానికి ఒక మంచి అందమే, రచయిత రసికత ఇది)

నీడల వినవక్రవి విప్పి ఎండలో పేదతీరుస్తుంది చెట్టు; నీడల మడత విసనక్ర బావి; అలల కనురెప్పలక్రింద అలజడిలేని స్వప్నంలా విశ్వలంగా వేలాడుతుంది చేప; పురవీధుల దీపాలపై పురుగు మబ్బులు తేలుతున్నాయి (కనబడిన దానినంతా కవిత్వంగా మార్చగ

గిన శక్తి, ఇది) పరుగెత్తే కాలువ (నీళ్ళ అని) తన నీడల్ని తనతో రమ్మని వెయ్యిళ్ళ కలగుతోంది; ఆడదాని అందానికి అలవాటైపోతాం క్రమంగా - అనే చర్మచక్షు పేయులను కాదంటూ, కొండ అవది చూచేకొద్ది రుచు లూరిస్తవి (ఈ కవికి కొంత పూర్వజన్మ సంస్కారం ఉండాలను కోవలసి ఉన్నది, ఇస్లాం ప్రకారం దీనిని ఆయన ఒప్పుకోకపోయినా, పాఠకుడు ఈ భావాలలో హిందూత్వం కల్పించుకో గలడు) పంచరంగుల సంధ్యని పిసికి పడేస్తారెవరో (ఇది రమ్య ప్రకృతి ప్రీతి); అప్పుడూ ళ్ళో దీపాలు గప్పున వెలిగి పట్నం విశాలంగా పరుచుకొంటుంది (చీకట్ల చూపునుముడుచుకొనేటట్లు చేస్తే వెలుతురు విస్తరింపజేస్తుంది అన్నది మంచి భావన) చెయివేసి మెడచుట్టూ చెవిలో గుసగుసలాడే వేస్తాన్ని వర్ణించగలిగిన ఆర్ద్రత ఈ కవి హృదయంలో ఉన్నది. అలలలలుగా అన్నది మంచి ప్రెలింగు పద్ధతి. తెల్లల్లల్లల్లటి గుర్రం అన్నట్లు.

# తేజస్సు నా తపస్సు

[కవితా సంపుటి. డాక్టర్ సి. నారాయణరెడ్డి; డెమ్మి 1/8; 70 పేజీలు; వెల: రు 4/-; ప్రతులకు - శ్రీ భారతీ ఎంటర్ప్రైజెస్, నం. 4, హౌసింగ్‌బోర్డు కాలని, లాలాపేట, సికింద్రాబాద్-500040.]

నారాయణరెడ్డి (తిక్కనను పాటూరు, కొట్టరువు అని అనాలా? అట్లాగే నారాయణరెడ్డికి డాక్టర్ బిరుదం తగిలించవలసిన గత్యంలేదు) – నవ్యాంధ్ర కవితా నియత్తలంలో ఒక దీప్తతార. శ్రీనాథాది మహాకవులవలె, తన ముద్రను ఆంధ్ర వాఙ్మయ మహా ఫలంలో చెరిగిపోకుండా ముద్రించుకొన్నాడు. ఈయనది ఒక ప్రత్యేక ణి. "విష్ణు రోచిష్ణు జిష్ణు సహిష్ణు కృష్ణు" అని పోతనవలె వల పదాడంబరానికి ప్రాకులాడకుండా, యమక గమకాలతో ఒక త సొబగును సంపాదించుకొన్నాడు.

ఈ సంకలనం ఆయన కవితా తపస్సును తేజోమయంచేసినది. పత్ర చిత్రంలో రెడ్డి రెండు ముఖాలు యీ కాంతి పరిణామాన్ని సూచిస్తున్నవి. మనసు సంస్కారితమైన స్థాయికి పోయి. ఇక భాష దాని వెన్నంటి నడచి, ఆయన అన్నట్లే "ఒక జ్వలిత న" ను పొందినది. ఈ గుణం లేకుంటే అట్టి కవిత కాగితానికి ష్టగాకుండ, నమలి నమలి ఉమిసిన చొప్పదంటు పిప్పి అవుతుంది. యన రచనలు "కొసమెరపు విసురులో ముగిస్తాయి". End's a Flash! కాబట్టి పుస్తకం మూసిన తర్వాతగూడ, ఆ మెరుము రిమిట్లు గొలుపుతూనే ఉంటుంది. ముక్తసరిగా సూటిగా చెప్పాలంటే - ఈయన కవితలు మొదలు తుదలు కవితా శిల్ప దీపకాలుగా ఉంటవి.

ఇందు "తేజస్సు నా తపస్సు" అనే ప్రబంధ శకలల ఒక Master-piece. భావ విహంగం పాఠకుని మానసికాంబరాన్ని చకితం చేసి రంజింపజేస్తున్నది. భాష ప్రౌఢమధురం. కల్పనా వల్లిక గట్టి నేలపై వేరూని ప్రఫుల్ల కుసుమితమైనది. "సమత నా తల్లి, సౌహార్దం నా తండ్రి, అనాది నా జననం" అని పతాతన సత్యకామియై అలౌకికమైన ఉదాత్తతో విశ్వమానవ పౌరుడుగా ఆనందాన్ని గొల్పుతున్నాడు.

ఇక నానుడి పువ్వులను గంపలకెత్తి వెదజల్లుచున్నాడు:- "ఇక్కడి ధృక్కు ముక్కుమీదగాదు; దిక్కు మొనమీద" అంటూ చూపు మేరలను దిగంతాలకు చాచుతున్నాడు. "మృత్యువు వికటించే మరు భూమిలో నిత్య తరుణ సమీర మాలికలు పచ్చ పచ్చగా సౌమ్య జీవనాన్ని ప్రసరించా" లని, "జగన్మంగళ గీతిక అహర్నిశం సాగా" లని ఉజ్జ్వల కాంక్షను మధుర మనోజ్ఞ రీతిలో చెప్పబడినది. "ఇతరుల కట్టుడిలో మ్రూల్గుతున్న", "మరణాన్ని వరించిన మోళ్ళలో తరుణ పల్లవావతరణం – ప్రసూనాలు రాలిపోతూ ఫలాల పాపల అందించడం తపస్సు" అని చైతన్యాన్ని ఆరాధిస్తున్నాడు – ఈ భావుకుడు. "చలి నులి మంట", "తెగిన వెన్నెల తీగలు", "పిచ్చెత్తిన మతాల తొక్కిడి", "సజీవ చైతన్య ప్రజ్వలనం" – ఇవి వాడవికి.

ఈ ఉపమానాల సౌభాగ్యం చూడండి:- "సముద్రమధ్య ద్వీపం ఆకాశమధ్య చంద్ర బింబంలా – గుడిసెలమధ్య మేడ చంద్రుడిలోని కళంకంలా". సమత కోరే యీ కవికి మేడ వికటంగా తోచడం భావ్యమే. "చుక్కలు విను వీధిలో ఉరేసుకుని వ్రేలాడుతున్న" వట.

"త్రేతాగ్నులు" ఖండికలో యీ ప్రపంచాన్ని గురించి ఒక లౌకికాతీత భావన ఏర్పడి ఉన్నది. ఇది భావ ఉత్క్రమణ సూచన.

సరే! "ప్రబంధాల పంజరాలను, వ్యాకరణాల ఇనుప పెట్టెలను" నిరసించడం నేడు తెలుగుకు బట్టిన తెగులనుకొందాం. ఇది ప్రపంచ మంతా ప్రాకి వారు సర్దుకొంటున్నారు; మనకూ ఆ దినాలు మరలా వస్తవి. కాని ఆచార్య పదవిలోఉన్న వీరు ప్రబంధాలను చదువకనే భాషకు అస్తిభారం ఏర్పరచుకొన్నారా? నిన్నమొన్నటిదాక వీరు ఛందస్సు శృంఖలాలనుకోలేదే! ఇది కాలపు వెర్రి అనుకొందాం– ప్రస్తుతానికి. అయితే వీటిని తమ విద్యార్థులకు చెప్పడం మానివేస్తారా? (ఈయన పాఠాలు చాలా ఛందుగా చెప్పుతున్నారని విద్యాలయ ప్రాంగణాలలో వినబడేమాటలు) మాబోంట్లు పాత కొత్తలు రెంటినే చదువుతామయ్యా. "గుణంబులు ఘన వృత్తులు, వృత్తు తార కావ్యేందిరకున్" అన్న కావ్యాలంకార సంగ్రహ కర్తమాట ఒప్పుకోరా?

"నిలువెత్తు మంటలలో తడవడం", "మంచు మంటలు", "ఎండలో శీతలించడం"– మొదలగు విరోధాభాసల వీర విహారంగూడ యీ పుస్తకంలో చెలరేగిఉన్నది.

— శ్రీ మరుపూరు కోదండరామరెడ్డి

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna at the Andhra Patrik Press, Gandhinagar, Vijayawada-3. Editor S. Radhakrishna, Vijayawada. Phones: 75667 & 75226.